భక్తి సాహిత్య మాల-1

# భక్త రవిదాసు




రచన : చోళ్ల విష్ణు

సంపాదన : ఇంగువ మల్లికార్జున శర్మ

భక్తి సాహిత్య మాల-1

# భక్త రవిదాసు



రచన : చోళ్ల విష్ణు
సంపాదన : ఇంగువ మల్లికార్జున శర్మ




6-3-1243/156, డి. సంజీవయ్య నగర్,
హైదరాబాదు - 500 482.

ప్రచురణ సంఖ్య 1
భక్తి సాహిత్య మాల-1

తొలి ముద్రణ : 1000 ప్రతులు
1994 జనవరి




సాదా ప్రతి వెల : పాతిక (25) రూపాయలు
మేలి ప్రతి వెల : అరవై (60) రూపాయలు

ప్రతులకు : 1. రవి శశి ఎంటర్‌ప్రైజెస్,
6-3-1243/156, హైదరాబాదు-500 482.
2. నవోదయ బుక్‌హౌస్, ఆర్యసమాజ్ ఎదుటి వీధి,
కాచిగూడ చౌరాస్తావద్ద, హైదరాబాదు-500 027.
3. ప్రగతి బుక్ హౌస్,
మ్యూజియం రోడ్డు, విజయవాడ-520 002.
4. మైత్రీ బుక్ హౌస్, మసీదు వీధి,
ఏలూరు రోడ్డు, విజయవాడ - 520 002.

ముద్రణ :
వంశీ ఆర్టు ప్రింటర్సు,
ఖైరతాబాదు, హైదరాబాదు-500 004. ఫాక్స్ : 242 787; ఫోన్ : 236 420

# పీఠిక


మహాత్ముని అంతేవాసి

మన కథానాయకుని పేరు 'భక్త రవిదాసు'. 'భక్త' అనేది అతనికి తగిలించే విశేషణమో బిరుదో కాదు. బిరుదులకు ఆశించే లేక లోబడియుండే వాడుకాడు రవిదాసు. మరోమాట కూడ యిక్కడే - భక్తితత్వంలో ఎంతో కొంత ప్రవేశమున్న విజ్ఞవంటి వారికిగాని రవిదాసు దొరకడు. కోయిలపాట నెన్నడూ ఆలకించి ఆనందించని వానికి మరి కోయిలంటే ఏం తెలుస్తుంది? కోయిలకూత (పాట) వినడానికి అన్నం తింటూ తింటూ మంచినీటి చెరువుగట్టుకు పరుగెత్తేవాళ్లం మేము మా బాల్యంలో. ఆ చెరువు, దాని గట్టుమీది పెద్దపెద్ద అశ్వత్థ వృక్షాలు (వాటిలో ఒకటి జువ్విచెట్టు) మా యింటికి కొన్ని బారల దూరం మాత్రమే. మేం పరుగెత్తేది ఆ కలస్వరం వినే ఆనందం కోసమేగాని ఆ పక్షిరెక్కలు, ముక్కు మా కండ్లతో చూడడానికైతే గాదు. ఒకవేళ చూతామన్నా అది కనబడితేగా! అయినా దాని రూపంలో ఏముంది? కాకీ, అదీ ఒకటే. పెద్ద, చిన్న - అంతే తేడా! కాకుల బలగం ఎప్పుడూ మన దొడ్లో, వాకిట్లోనే వుంటాయి. కోకిల పిలిచినా రాదు. అయినా కోయిల స్వరం విని తన్మయులైపోతారు మహాకవులు కూడ.

Fare thee well, sweet bird!
Although invisible, with what delight
Hear I thy vagrant voice!

అంటూ ఆనందంలో ఓలలాడుతాడు వర్డ్స్‌వర్త్ కవీశ్వరుడు. ఇక వినండి మహాకవి షెల్లీ ఏమంటాడో!

Bird thou never wert,
Hail thee, blithe spirit!
What thou art, we know not.

ఇది కంటికగుపడని భరతపక్షి (lark) నుద్దేశించి షెల్లీ చేసిన సంబోధన.

అట్లాగే, సరిగ్గా అదేవిధంగా, రవిదాసు వంటి భాగవతోత్తముల కులాలు కూడ పై కోయిల జాతివంటివే. నీవు M.A.., LL.B., వా, Ph.D.వా అని ఎవరు ఎవరినడుగుతారు? ఆ డిగ్రీ అమెరికాదా, దేశవాళీదా? ఏ క్లాసులు, ఎంత శాతం మార్కులు? ఈ తబిస్లిళ్లన్నీ నాలుగుదినాల ఉద్యోగాలు, జీతపు డబ్బుల కోసం. అంతేగాని, కబీరునో, రవిదాసునో 'నీది ఏ కుల' మని ఎవరడుగుతారు? అడగడమే అమానుషమవుతుంది. కబీరువంటివాడైతే 'ఏ కులమని నన్ వివరమడిగితే ఏమని చెప్పుదు లోకులకూ, లోకులకూ, వలుగాకులకూ' అనుకుని ముసిముసి నవ్వుకుంటాడు. ఆ నవ్వులోనే ఆ ప్రశ్నకు జవాబూ వుంటుంది. ఒక కాలంలో మాలకులస్తుడు నేసిన బట్ట చాల ప్రశస్తం. అతడు తెచ్చిన బట్ట బాగా నీట తడిపించి, ఆరవేయించి కట్టుకునేవారు అన్యకులస్తులు! అయితే మాదిగ రవిదాసు కుట్టితెచ్చిన చెప్పులు మట్టుకు చెరువులో ముంచకుండానే తొడుక్కుంటారు! కాకుంటే కొందరు వాటిమీద పసుపునీళ్లు చల్లుతారేమో! కారణం? ఎక్కడికక్కడే సాగుబడి-అంతే కారణం. అస్పృశ్యత అంతా అర్థంలేని రుగ్మత అనడానికి పై రెండూ చాలు. ఇట్టి అజ్ఞానాంధకారానికీ, భక్తి ప్రపత్తికీ వేయి యోజనాల దూరం. భక్తి పుస్తకాలలో లేదు, గురు ప్రబోధాలలో కూడ లేదు. 'ఏ వేదంబు పఠించె లూత, భుజంగం బే శాస్త్రముల్ సూచె, దానే విద్యాభ్యసనం బొనర్చె గరి, చెంచే మంత్రమూహించె బోధావిర్భావ నిదానముల్ చదువులయ్యా? కావు! మీ పాద సంసేవాసక్తియేకాక జంతుతతికిన్ శ్రీకాళహస్తీశ్వరా!' అని కవి చక్కగా చెప్పారు. కనుక చదువులు రాని జంగం కులభక్తులను చూడండి. జేగంట వాయిస్తూ తన్మయులై పోతారు! చిలకమర్తి కవి మాకెన్నిసార్లు చెప్పారో చిక్కయ్య కథ.

చిక్కయ్య గజదొంగ. చెమటలు పోసేటట్లు శ్రమించి యింటి గోడకు పెద్దకన్నం వేసి లోపలికి ప్రవేశించాడు. చూస్తే ఏముంది? 20, 30 మంది జంగమయ్యలు అక్కడ మైమరచి శివతాండవం చేస్తూ భజన సల్పుతున్నారు. చోరీకి వెళ్లిన చిక్కయ్యకు ఆ దృశ్యం చూచి మతిపోయింది. సూటిగా పోయి జంగాల ముందు సాగిలబడ్డాడు! నేను చోరుడ్ని రక్షించమని వేడుకుంటూ భక్తకూటమిలో ఒకడైనాడు. ఆ జంగాలందరూ కూడ ఒక్కుమ్మడిగా శంఖాలు పూరించి చిక్కయ్యకు స్వాగతమిచ్చారు. ఇదీ కథ. కాని ఆ జంగాలు కేవలం పుస్తక పండితులో లేక ముష్టివాళ్లో అయితే కథ మరో రకంగా వుండేదేమో. శ్రీరామకృష్ణ పరమహంస, ఆయన అర్ధాంగి ఏం చదివారు? అయితే ఆ పామరభక్తుడ్ని చూడగానే పండితుడైన వివేకానందుడు ఏ విధంగా మార్పు చెందాడు? దానికి తగినట్లుగా, 'ఎన్నాళ్ల నుంచి నీకోసం నేను వేచియున్నానో!' అంటాడు పరమహంస. అట్లే ఈ భక్తపుంగవుల్లో అధిక సంఖ్యాకులు విద్యాధికులు కానివాళ్లే. బుద్ధ భగవాన్, సోక్రటీసు, మన రైదాసు మున్నగువారంతా యింతే. బుద్ధునిది రాజకుటుంబం గనుక చిన్నప్పుడు ఏదో పెద్దబాలశిక్ష పూర్తిచేసి వుంటాడేమోగాని పుస్తక పాండిత్యమే వుంటే అతడు బుద్ధుడెట్లా అవుతాడు? 'చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!' యని ప్రహ్లాదుడన్నట్లు సోక్రటీసు చదివిందీ పుస్తకాల చదువు కాదు. అతనికున్నదంతా అనుభవజ్ఞానమని Delphic Oracle రుజువు చేసింది. ఒకసారి హైదరాబాదులోనే నేను కొందరు జైన బ్రహ్మచారిణులను దర్శించాను. వారిది పుస్తక పాండిత్యమై యుండదు (ఆడవాళ్లనికాదు - ఆ మాటకు వేదకాలంలోనూ, తరువాతనూ కొందరు స్త్రీలు శాస్త్రకర్తలు కూడా నట). జ్ఞాన బోధ చేస్తూ వారు వివిధ రాష్ట్రాలు తిరుగుతారను కుంటాను. వారి దుస్తులు స్వయంగా వారే ఉతుక్కుంటారు. అంత తెల్లనిబట్టల సొబగు సాధారణంగా మనమెక్కడా చూచివుండం. తలలు బోడులు, ఆపైన నిండైన ముసుగులు! లలితకళల్లో వారు సూపర్ ప్రవీణులు. కొబ్బరి కురిడీపెంకును నల్లగా గీకి ఆ నిగనిగమీద వారు గీస్తారు - మనుష్యుల బొమ్మలు కావు, ఎక్కడివో శాస్త్రవాక్కులు లేక శ్లోకాలు ముద్దులు మూటగట్టే అక్షరాలతో. సున్నితమైన ఉక్కు పరికరాలతో బియ్యపు గింజపై దేవనాగరి అక్షరాలు అందంగా చెక్కారంటే అందలి బ్రహ్మవిద్య ఏమిటో ఊహించండి. వారు ఆహారం వండుకొనరు.

అవే మోకాయచిప్పలు, కొబ్బరి చిప్పలకంటె పెద్దవి, పొడుగాటివి తీసుకుని, వారికి తెలిసిన యిళ్లకు వెళ్లి మధుకరం స్వీకరిస్తారు. అదే వారికి పూటకో లేక రోజుకో సరిపడా ఆహారం. మరొక రోజున వారినే ఒక జైన బహిరంగ సభలో చూచాను. ఏదో సినిమా హాలులో ఆ సభ జరిగింది. కొన్నాళ్లు మన ప్రధానమంత్రిగా పనిచేసిన శ్రీ గుల్జారీలాల్ నందా ఆ సభాధ్యక్షుడు. ఆయన జైనప్రముఖుల్లో ఒక పెద్దగా వుంటూ, భారత మంత్రివర్గంలో seniormost cabinet member గా వుండి, ఏలనో ఏర్పడ్డ కొద్దిపాటి (ఖాళీ) వ్యవధానంలో ప్రధానమంత్రి అయినాడు - బాగా జ్ఞాపకం లేదు. ఒక్కమాట ఈ సందర్భంలోనే చెప్పక తప్పదు. ఒక్కటే మాట. ఆ కొద్ది రోజులైనా కాబినెట్ మంత్రి పని లేక ప్రధానమంత్రి పని మన మామూలు పార్టీవాలాలవలెనైతే చేసియుండడు. అతనిది లాల్ బహదూర్ శాస్త్రి జాతి! అందుకే అధికారపదవిని సంతోషంతో, తొందరగా వదుల్చుకొనియుంటాడు.

కాలమెప్పుడూ గొడ్డుపోదనే వారు మా కళ్యాణస్వామిగారు. సంఘ వ్యవస్థలో మానవకల్పిత అంతరాలెన్నివున్నా, మంచి మంచిగాను, చెడ్డ చెడ్డగాను చివరంటా నిలిచేవుంటాయని పెద్దలు చెప్పినమాట. మంచి చెడ్డల అప్రాచ్యపు సంఘర్షణ తరచు జరుగుతూనే వుండవచ్చును గాని "మంచి యన్నది పెంచుమన్నా, వట్టి మాటలు కట్టిపెట్టోయ్ - గట్టి మేల్ తలపెట్టవోయ్" అన్న హెచ్చరిక వెయ్యి రెట్లెక్కువగా శ్రీ గురజాడ వంటి వారి నోట మన చెవిన బడుతూనే వుంటుంది. గురజాడ వారి మాదిరి మనుష్యులకు, మాటలకు వర్ణం లేదు, వర్గం లేదు, కులం లేదు, పార్టీలేదు. వేమన కవిది ఏ కులం? ఏ పార్టీ? రాను రాను కవిత్వతత్వంలోను, భక్తి తత్పరతలోను బ్రాహ్మణా బ్రాహ్మణ భేదాలెంచడం అక్రమమే కాదు - పాతకం కూడ. కొద్దిలో కొద్ది - చిత్తూరు జిల్లా ఏర్పేడు గ్రామ 'వ్యాసాశ్రమ' స్వామిని, తూర్పుగోదావరి జిల్లా శాంతి ఆశ్రమ స్వామిని "మీరు ఏ కులస్తులు?" అని ప్రశ్నించడం జాబాలి కొడుకు సత్యకాముణ్ణి ప్రశ్నించినట్లే వుంటుంది. అతడు భూమాత కుమారుడు, పేరు సత్యం అని ఆ గురూత్తముడు గ్రహించినంత సులువుగా మరెవరు గ్రహించగలరు. రవిదాసును గూర్చి ఎవడో బ్రాహ్మణ కులజుడు ఇట్లన్నాడట: "పూర్వజన్మలో వీడు - ఈ మాదిగ -

బ్రాహ్మడై వుండివుండాలి. లేకుంటే ఈ మాదిగవానికి యింత భక్తితత్పరత ఎట్లా అబ్బుతుంది?" అని. మా చిన్నప్పుడు మా వూళ్లో ఒక చివుకుల సోమన్న ఉండేవాడు. వాడిని పక్కవూరి మావాళ్లు ఒక తద్దినానికి రెండో భోక్తగా పిలిచారు. రెండో భోక్త అంటే మంత్రం చెప్పేవాడు కాడు - ఊరక తినిపోయేవాడు. వాడు బాగా తిని, తర్వాత ఒక పశువుల పాకలో దూరి పొగచుట్ట కాల్చుకొనడంలో (అలక్ష్యం వల్ల) పాక చూరు అంటుకుని ఆ మిట్ట మధ్యాహ్నం ఆ పాక పూర్తిగా దగ్ధమై పోయింది. అయితే పై కుంటి తర్కం ప్రకారం మా ఉంగుటూరు చివుకుల సోమనాథం (పేరు చివర 'శాస్త్రి' కూడ ఉండెనేమో!) పూర్వజన్మలో మాదిగ కులస్తుడై యుండవలె! ఇట్టి పాడువాదాలకు మొదలేది, చివరేది? మా సోమన్నమట్టుకు (సోమన్నేకాదు మరొక భీమన్నయినా) వరుసగా 4 జన్మల్లో తద్దినపు తిండిపోతై యుండనొప్పు అది సంభవం. ఈ సోమన్నదే మరొక కథ వుంది - కాని ఇక్కడ చోటు లేదు. పోతే పశ్చిమ గోదావరి జిల్లా, ఉప్పులూరు కుగ్రామంలో దేవాలయ పూజారి మాలకులస్థుడు. ఆ వారసత్వం ఏనాటినుండి, ఎలా వస్తున్నదో తెలియదు. అయినా ఆ గ్రామ బ్రాహ్మణులు ఆ గుడి (గుడి అంటే ఏ గ్రామదేవత మరిడమ్మదో, మాచకమ్మదో కాదు సుమండీ!) లోనికి వెళ్లి అర్చన లాచరించి పోతారు - దేవుడి భయం చొప్పున (నూకాలమ్మ, మామిళ్లమ్మల లాగ ఉప్పులూరి దేవుడు పశుపక్ష్యాదుల రక్తం తాగడు, కోరడు). కాని ఒక్క సందేహం నేను అడిగి తీర్చుకోలేదు. మరి ఆ వూరి అంటరాని కులాలకు ఆ గుడిలో ప్రవేశమున్నదో లేదో తెలుసుకోలేదు. మరొక వింత విషయం - సహింపరానిది కూడ. గ్రామ మాలలు, మాదిగలు ఒకే నూతి నీరు తాగరు. అయితే నేనెరిగిన కొన్ని పల్లెటూళ్లలో ఒకే చిన్న చెరువులో ఒకవంక మాలలు, వేరొక వంక ఇతర కులస్తులందరూ నీళ్లు ముంచుకొని పోతారు. ఇహం, పరం ఎరిగిన ధర్మవిదులు - రవిదాసు వంటివారు -ఈ రగడల నెట్లా తీరుస్తారు? నన్ను చెప్పమంటారా? నీళ్లు తీసుకునేవారు ఏ కులస్తులయినా సరే. ఆ వైపు రేవులో ఎవరివల్ల కాలుష్యం చేరిందో కనిపెట్టి వారికి అపరాధం విధించడమో లేక గ్రామవెలి వేయడమో జరగాలి. ఈ మాత్రపు పారిశుధ్య జ్ఞానం మనదేశ గ్రామ ప్రజల బుర్రల్లోను, చేతల్లోను ఈనాటికీ యింకా ప్రవేశించలేదు. (ఉన్నదంతా) పనికి మాలిన పార్టీలు పెట్టుకొని, మెజారిటీలు సంపాదించి,

ఎప్పటికైనా రాజ్యం హస్తగతం చేసుకొందామనే దురాశ! "కారే రాజులు, రాజ్యముల్ గలగవే..." - ఈ పద్యం గుర్తుండదో!

ఈ విధంగా రవిదాసు కాలంలోను, అటు తరువాతను, రామానందుని అనుచరకూటంలో కబీరు, ధనా, పీపా, సేనా మున్నగు ద్వాదశ భక్తులుండిరి. జ్ఞానికి భక్తి ప్రధానమనేదానికి వారి జీవితాలే మనకు తార్కాణం. భక్తిప్రపత్తి, తద్వారా సర్వసమర్పణ భావం - నైతిక జీవనానికి పునాదులు. వీరందరి దృష్టిలోను, అనుభవంలోను సర్వజన సులభనామం రామనామం. కర్మయోగమే వారి ఈశ్వరుడు. ఖండన మండన విధానాలకు వీరు వ్యతిరేకులు. తీర్థాటనం, వేషధారణవంటివి వీరికి లేవు. వీరి భక్తిమార్గం సరళాతి సరళం. స్మరణం, శ్రవణం, అర్చనం, వందనం, దాస్యం, పాదసేవనం, సఖ్యం, ఆత్మనివేదనం - వీటన్నింటి కంటె సత్సంగం, భక్తునికి ఎక్కువ విలువైనది. "*సత్సంగత్వే నిస్సంగత్వం; నిస్సంగత్వే నిర్మోహత్వం;నిర్మోహత్వే నిర్మల తత్వం; నిర్మల తత్వే జీవన్ముక్తిః*". ఎంత దుష్టుడయినా సాధనా క్షేత్రంలో వీటివల్ల సజ్జనుడవుతాడు. భగవంతుని 'పతిత పావన' బిరుదు అన్నిటికంటెను గొప్పది. భక్తుడుపయోగించే భాష దైవానికి గూడ తెలుసునా తెలియదా అన్నంత సరళం (simple). అది దైవం కంటె భిక్షుకులకు సులభసిద్ధంగా తెలుస్తుంది. కృష్ణ, మురారి, గోవిందా యిత్యాదులు వేదాంతులకంటె ముందు బిచ్చగాండ్ర నోటికి పరిపాటి! చిన్నపిల్లల నోటికి, మనసుకు అవి యింకా సులభం. అట్లాగే అల్లా, ఖుదాలు కూడ. రాముడంటే దశరథ రాముడు, కృష్ణుడంటే గోకుల కృష్ణుడే కాదు. జగత్కర్త, భర్త అయిన వాడే రవిదాసు రాముడు. సత్యమన్నా అదే, విఠల్ అన్నా అదే. ఆ పరాశక్తి, ఆకాశం శిరస్సు, పాతాళం పాదాలుగా గల విరాట్ స్వరూపం అదే. అదే ఆనందం; పరమానందం అదే. రవిదాసాదుల ఇష్టదైవం అదే. జ్ఞానదేవ్, నామదేవుల దైవం అదే. వారిని బట్టి ప్రజానీకపు ఊతపదం అదే ముందటిది, తరువాత మరేదయినా. భక్తియుగంలో అదే ప్రజలకు సులువైన సహజ సంబోధన - తారక మంత్రం. ధర్మమంటే సత్కర్మయని ఎన్నిసార్లు చెప్పుకున్నా చెప్పుకోవచ్చు. మానవ జీవిత కాలమే ఇందుకు తగిన తరుణం. ధర్మమంటే కర్మ - సత్కర్మ, నిష్కామ కర్మ. ఇట్టి కర్మ చేస్తూనే నూరేండ్లు బతుకగోరుకోమని ఉపనిషద్ఘోష! "జి జీవిషే చ్ఛతం సమాః" - రవిదాసు దృష్టిలో (కేవలం అతని అభిప్రాయమే

కాదు) ప్రత్యక్షానుభవంలో కులవృత్తి, దానికి సంబంధించిన మానమర్యాదలన్నీ. అంటే నిగర్వ చూడామణిత్వం, అగ్నిహోత్రం వంటి నిజాయితీ. దానికే మరియొక భాష అందరినీ తృప్తిపరచడం, తద్వారా దైవత్వ ప్రాప్తి. అందులోనిదే సుఖదుఃఖాలపట్ల సమాన భావం. స్వర్గమంటే స్వాతంత్ర్యమని, పారతంత్ర్యమే నరకమని రవిదాసుని అనుభవ వేదం. రవిదాసు దృష్టిలో యిది ఎల్లకాలపు సత్యం. ఏ పాలనలోనైనా ప్రజలందరికీ తినడానికి సరిపడిన అన్నం, ఉండడానికి యిల్లు, కట్టబట్ట, సుఖం, శాంతి – స్వపరిపాలన గూర్చి యిదే రవిదాసుని సిద్ధాంతం. ఇదే భక్తి ఆధారిత భారతీయ సంస్కృతి. కుల, మత, వర్ణ, వర్గ భేదాలులేని ఈ సంస్కృతిని నిక్కచ్చిగా, నిర్భయంగా ప్రచారం చేసాడు రవిదాసు. ప్రభుప్రాప్తి, మానవాది జీవుల సేవ – ఇదే అతని భక్తి నిర్వచనం. ఆ కాలపు భక్తులందరు ఇదే గురూపదేశమిచ్చారు, పొందారు. ఆ గురువెవరు? ఇష్టదేవతయైన పరమేశ్వరుడే.

రవిదాసు కారణ జన్ముడు. అతనిది సదా ఎదురీత. ఈ స్కూలుకు ప్రధాన పురుషుడు రామానందుడు. రవిదాసు ఈ విధంగా అన్ని వర్గాలకు పూజనీయుడైనాడు. టాల్‌స్టాయ్ రచనల్లో "Industry and Idleness" (శ్రమ- సోమరితనం) అనే చిన్న వ్యాసమొకటుంది. ఆయన రాసిన బండెడు రచనల్లో ఈ విషయానికున్న విలువ మరి దేనికీ లేదనుకుంటాను. శరీరశ్రమ చేయని స్థాణువు భక్తుడెట్లవుతాడు? శరీరశ్రమయే సమస్త సుఖాలకూ మూలం. సుఖాల్లో ఆత్మతృప్తిది మొదటి మార్కు. కనుక శ్రమయే భక్తి. శ్రమయే ఈశ్వరుడు. రవిదాసు చేసిన నోటి ఉపదేశాలవల్ల అతడు మాన్యుడు కాలేదు. అతని జీవితమే, అతని స్వానుభవమే ఒక ప్రత్యక్ష ఉపదేశం, తరింపుకు మార్గం – సులభ మార్గం. అదే ఆయన బోధ కూడ. ఆ బోధ యొక్క ఆద్యంతాలు తన చర్మకార వృత్తిలోనే గడిచాయి. చేతితో చెప్పుల తయారీ, హృదయంలో భక్తవత్సలుని నామస్మరణ. సరిగ్గా యిటువంటి విషయమే నా కంటబడ్డది, చెవికి సోకింది ఒకప్పుడు. గృహస్థభక్తుడొక్కడు తాటాకులదడి కుట్టుకుంటూండి నాడు. ఆకుతర్వాత ఆకు తగిలించడం, చూరు కుట్టుబద్దతో తడపను, ఇటుండి అటు మరల అటుండి యిటు అందుకొనడం – అంతా ఒక చేతిమీదనే, రెండవవైపు మరొకని సహాయం లేకనే. నాకాశ్చర్యమై ఉన్నవాడనున్నట్లే నిలబడ్డాను. "ఎవరికి వారే, యమునా తీరే!"

అంటుంటారు చూడండి - ఇదొక సత్యమైన సామెత. ఇహపరాలు రెంటిలోను ఎవరి మంచి చెడ్డలకు వారే కర్తలు; రెండవవారు రారు, రానక్కరలేదనే విషయం ఇక్కడ తేటతెల్లమయింది నాకు. రవిదాసు తన చేతిపని చేసుకుంటూనే తన బుద్ధిని పరమాత్మపై కేంద్రీకరించినట్లు, పై కర్షకుడు తన రెండు చేతులనూ తాటియాకుల దడి పని కప్పగించి నోట భగవత్కీర్తన ఆలపిస్తూనే వున్నాడు! ఆర్థికం, పారమార్థికం, అంటే యిహం, పరం అంత సహజంగా ఒకదానితో ఒకటి కలిసిపోగలవు. అట్టి దివ్యకళ రవిదాసుకు రెండోపేరయింది. అదే విధంగా కబీరు నేతమగ్గపు పడుగు పేకలమధ్య నాడీ రవళి అతని దైవకీర్తనకు రాగం, తాళంగా పనిచేసింది."కర్మయే ధర్మం" అనే శాస్త్రానికి సాదృశంగా 60 ఏళ్లనాటి పాత సంగతి ఒకటి నాకు జ్ఞాపకం వస్తోంది. ఆనందనికేతన్ ఆశ్రమంలో కార్యకర్తను నేనప్పుడు. దానికే చాగల్లు ఆశ్రమమని, మల్లవరం ఆశ్రమమని మరి రెండు పేర్లు. మల్లవరం గ్రామానికీ, ఆశ్రమానికీ మధ్య ఒక పెద్ద కాలువ. ఏదో ఒక పని మీద తరుచు బల్లకట్టు (దోనె) దాటి మల్లవరం వెళ్లవల్సి వచ్చేది. హరిజనులకు, తదితరులకు అదే మార్గం. అన్నపుముంతలున్న కమ్మవారితో కలిసి హరిజనులు బల్లకట్టు ఎక్కకూడదు. ఈ పుస్తకరచయిత 'విష్ణు' ఆనాడు ఆశ్రమ బాల విద్యార్థి. హరిజన బాలుడు గనుక ఇతరుల అన్నపుగిన్నెలతో కలిసి దోనె ఎక్కకూడదు. "అట్టి సందర్భంలో నీవు దోనె ఎక్కుతావా, గట్టుమీద ఉండిపోతావా?" అని విష్ణుకు ఒకనాడు నా ప్రశ్న. "గ్రామస్తులతో ఘర్షణ, దౌర్జన్యం, కొట్లాట లేకుండా కొంతసేపు గట్టుమీదనే ఆగి తరువాత ఏరుదాటడమే కర్తవ్యమనుకుంటా"ననేది విష్ణుకు అప్పట్లో తోచిన జవాబు. విష్ణుతండ్రి శ్రీ వీరయ్య వుండేవాడు. అప్పుడప్పుడు ఆశ్రమానికి వచ్చి నాతో సంభాషించి వెళ్లేవాడు. వయసు మళ్లిన మనిషి, చేతిలో ఊతపు కర్ర. బహు ఆలోచనాపరుడు, మధుర సంభాషి. నా కేలనో ఆయన మరపురాడు. 10,14 ఏళ్ల వయస్సు గల కుమారుడు విష్ణును 'విష్ణుగారు' అనేవాడు మా సంభాషణలో. ఆ మాటకు నా కాశ్చర్యం. కాని ఆ మర్యాద చూపడంలో విజ్ఞత గమనించి నాకు ఆనందంకూడ కలిగేది. ఏటిపై దోనె దాటే విషయమై కొడుకును నేనడిగిన ప్రశ్న ఆ తండ్రినే అడిగియుంటే ఆయనకూడ అదే జవాబు నాకిచ్చియుండు నను కుంటాను. అప్పటికి మేమలవర్చుకున్న ఆ సమయోచిత పల్లెటూరు

వాతావరణానికి అదే తగిన గాంధీ జవాబని ఇప్పటికీ నా ఆలోచన – అది ఇంగితమెరుగని పల్లెపట్టు గనుక. ఇప్పుడు చాలవరకు రోజులు మారాయి!

## 2

రవిదాసు తండ్రిపేరు రగ్గు, తల్లి ధుర్బనియా. నిష్ఠ నిజాయితీలు గల కుటుంబం. దైవభక్తిపరులు. సాత్విక స్వభావులు. సాధుసన్యాసుల సేవయందు ప్రీతిగలవారు. వారి కులవృత్తి చెప్పులు కుట్టడం. రవిదాసు ఐహిక జీవితమందు యిష్టం లేనివాడు. బలవంతాన లోణా అనే గుణవతిని ఈతనికి పెండ్లి చేశారు. చెప్పుల వ్యాపారంలో రవిదాసు చాల ఉదారంగా వ్యవహరించేవాడు. బేరసారాలు లేని మనిషి. ఎంత గిట్టుబాటు అయితే అంతే చాలు ననుకునేవాడు కాబోలు! ఒక చిన్న ఉదాహరణ! మహారాష్ట్ర సాధువు భక్త తుకారాం ఒక చిన్న చిల్లర దుకాణదారుడు. మిరపకాయలకో, మరేదో వస్తువులకొరకో ఎవరైనా వస్తే, "మీరే తూచుకొని తీసుకెళ్ల" మనే వాడట! వాడుకదార్లూ అంతే మర్యాదస్తులుగా వుండేవారనుకుంటాను – నిస్సందేహం. కాని రవిదాసుది చిన్న దుకాణమేమో, నానాటికీ తీసికట్టు అయింది రాబడి. ఇంటి ఖర్చు తట్టుకోలేకనూ, కుమారునికి జాగ్రత్త చెప్పడంకోసమూ రవిదాసును వేరే కాపురముండమన్నాడు తండ్రి. చిల్లిగవ్వ కుమారుని కియ్యలేదు. రవిదాసిప్పుడు స్వతంత్రుడై తండ్రి యింటి వెనుకే ఒక గుడిసె వేసుకున్నాడు. భక్తి అబ్బింది. సాధువుల సేవ అబ్బింది. ఆధ్యాత్మిక చింతన ఉండనే వుంది. కటిక దారిద్ర్యం అనుభవించాడు. కష్టాలను లెక్కచేయక అంతా రామునిదే భారమన్నాడు. భార్య అనుకూలవతి కావడం ఒక అదృష్టం. దంపతులు అల్పసంతోషులు. శ్రీరామ, శ్రీకృష్ణులు అతని యిష్టదైవాలు. స్వావలంబన, సాధువుల సేవ అతని పరమ భాగ్యం. కృష్ణ భగవానుని పేర ఒక మందిరం, ధర్మశాల, జలాశయం నిర్మించాడు. ఆ మందిరంలో ప్రత్యేక జాతి (కుల) మతాల నిర్మూలన, మానవ సమానత్వం పాటించాడు. ప్రజలు దూర, దూర స్థలాలనుండి వచ్చి రవిదాసు ప్రవచనాలు వినడానికి, ఉపదేశామృతం పొందడానికి తహతహలాడు తుండేవారు.

రవిదాసు దంపతులకు ఒకడే కుమారుడు జనించాడు. ఆధ్యాత్మికత పెరిగి పరిపక్వమయింది. పారమార్థిక చింతనకూడ దానితోబాటే. అగ్రకులస్తులు కొందరు ఆయన భక్తితత్పరతకు వశులయ్యారుగాని మరికొందరు ఆయనను శంకించి పరీక్షలకు దిగారు. కొందరు హేళన చేసేవారు. సుఖాలకంటె అతనికి కష్టాలే ఎదురైనాయి - కడజాతివాడు వచ్చి మందిరాలలో ప్రవచనాలేమిటని. మరి కొంద రధికులే అతనిని పైగంబరుగా నెంచి గౌరవించారు.

రవిదాసుకు అంతగా పుస్తక చదువు లేదు. అతడు కారణజన్ముడు. తత్వార్థాల నెరిగిన సత్పురుషుల సాంగత్యంలో నిశ్చలనిర్మలమైన ఆయన సహజ ప్రతిభ వికసించింది. కనుకనే జీవితానికి వలసిన వాస్తవతత్వాన్ని తెలుసుకోగలిగాడు. సహజ సాధన, సత్సంగం, అన్నిటిని మించిన స్వయంప్రజ్ఞద్వారా ఆత్మజ్ఞానం అలవడజేసుకున్నాడు. సరళమగు గీతాతత్వసారం, భారత, భాగవత, రామాయణాలలోని ఆదర్శం కదళీపాకంగా సామాన్య జనులకు కూడ అర్థమవుతుంది. రవిదాసు, కబీరు, ధనా, పీపా, సేనా, పద్మావతి మున్నగువారు ఆధ్యాత్మిక విప్లవకారులు. భావ సంచలనం కలిగించినవారు.

రవిదాసు, కబీరు ప్రభృతులు పరంపరాగత కర్మకాండలు, ఆడంబరాలు, సాంఘిక అసహిష్ణుతలతో కూడుకున్న పూర్వ సాంప్రదాయాలను పూర్తిగా మార్చి వాటికి ప్రజోపయుక్తమైన కొత్త రూపమిచ్చారు. పాత విలువలు పోయి కొత్త విలువలు వచ్చాయి. భక్తులలో ప్రతిపత్తి, సామంజస్యం, వివేకశీలత నెలకొన్నాయి. ప్రజలు తమ అవస్థలు అవగాహన చేసుకున్నారు. సాధన మార్గంలో కఠినమైన వివిధ విధానాలను సడలింపజేసి మానవతావాదాన్ని భక్తికి ప్రధానం చేశారు. చరిత్ర శుద్ధి, ఇంద్రియ నిగ్రహం జీవిత విధానానికి ప్రధాన స్తంభాలుగా చేశారు. రవిదాసు భక్తి అంతర్ముఖమైనది. సాధనాపరమైనది. ఆయన ఖండన మండన పద్ధతి ననుసరించలేదు. కర్మ అంటే ఈశ్వరుడు. ఈశ్వరుడే కర్మ. శ్రవణం, కీర్తనం, విష్ణునామ స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మనివేదన - ఇవన్నీ Spirit చేసే physical పనులు. దీన్ని తన జీవితం ద్వారానే ప్రత్యక్షం చేస్తాడు రవిదాసు. అట్లా చూపడానికే "ఈ జన్మా మిక దుర్లభమురా" అంటాడు. సాధన అంటే యిదే ! దానిని పరాశక్తి అంటామే కాని అది యిక్కడిదే!

భక్తులలో హిందువులు, ముస్లింలు కూడ వున్నారు. సమదృష్టి, సద్భావం వారిని ఏకం చేస్తుంది. ముస్లింలలో సూఫీలనబడేవారు ప్రేమమార్గం కనుగొన్నారు. భారతీయ, వైష్ణవ, మాధవ, మురారి, రామ, హరి మున్నగు నామ జపాలను వారు హర్షిస్తారు. ఇదే నిజమైన భక్తిమార్గం. పండుగల విషయంలో హిందువులది ప్రధాన పాత్ర. భక్త రవిదాసు వినమ్రుడు. రాగద్వేషాలు, ఖండన మండనలు ఆయనకు లేవు. సాత్వికుడు. ఇది సూఫీ పద్ధతిలో కనుపిస్తుంది. సూఫీల పద్ధతి ఉపనిషద్వేదాంతుల పద్ధతి. వారవలంబించిన సులభశైలి శ్రోతల హృదయాలకు సూటిగా హత్తుకుంటుంది.

*అజ్ఞాని ఏమెరుగు హరి యుండే మరుగు*
*జ్ఞాని యెరుగు*

*వన శృంగారమ్ము కోకి లెరుగును గాని*
*వాడవాడ దిరిగే కాకి యేమెరుగు? ॥అజ్ఞాని॥*

*మంచి నీటి రుచి మత్స్యమెరుగును గాని*
*బురదలో పొర్లు కప్ప యేమెరుగు? ॥అజ్ఞాని॥*

*ఇంటివాని గుణము ఇల్లా లెరుగునుగాని*
*పంచల దిరిగేటి తొత్తు యేమెరుగు? ॥అజ్ఞాని॥*

అనే తత్వం పైదాని కొక ఉదాహరణగా తీసుకొనవచ్చును. ఇహాన్ని, పరాన్ని సమంగా కలిపియుంచే కీర్తన యిది - అతి సులభ సూక్ష్మమైన ఉపమానాలివి. రవిదాసు స్వీకరించిన రాముడు దశరథ రాముడు కాడు. రామనామం తారక మంత్రమయింది అతనికి. దానినే ప్రజలకు అందించాడు. రామనామాన్ని ఊరక జపించే కపటమానవుల్ని తాడనం చేస్తాడు రవిదాసు.

రవిదాసు మామూలు స్కూళ్లలో చదవలేదు. స్వానుభవంవల్ల ఆధ్యాత్మిక విద్యలో తనకుతానుగా తయారయినాడు. కబీరు, రవిదాసాదులు కావ్యాలు రచించలేదు. విద్యలను మించిన విద్య - పరావిద్య - ను అభ్యసించారు వారు. ఏమి చెప్పినా, ఏమి పాడినా ఆ గురువును అనగా యిష్టదేవుడైన పరమేశ్వరుని సంబోధించి చెప్పారు. సాహిత్య స్రష్టలు దండి మున్నగు వాళ్లు తమ సాహిత్యానికి కొన్ని గీటురాళ్లేర్పరచారు. మరి

అట్టి పరీక్షలకు అక్షరశః నిలవకపోవచ్చు భక్తి సాహిత్యం. అయినా రవిదాసు వాణిలో కొన్ని సహజ సాహిత్య లక్షణాలు లేకపోలేదు. అందులో 'ఉపమా ఉత్ప్రేక్షలు', అనుప్రాసలు, వృత్యనుప్రాసలు కావలసినన్ని వున్నాయి. రవిదాసు ప్రధానంగా భక్తుడు. ఆయనది భక్తివాణి. అతడు వాడిన భాషలో గ్రాంథిక, గ్రామ్యపదాలు, హిందీ, ఉర్దూ, గుజరాతీ, రాజస్థానీ మొదలైన భాషలపదాలు, యింకా పార్సీ, అరబ్బీ వంటి విదేశీ భాషాపదాలు సైతం కనిపిస్తాయి. ఆత్మ, పరమాత్మల సమ్మేళనం కోసం తపించిందా వాణి. నెమలి, చకోరం, వత్తి, జాతి, నీరు, దారం – ఇవి ఆత్మకు ప్రతీకలయితే, పరమాత్మకు ప్రతీకలు గిరివర, చంద్రుడు, ముత్యం మున్నగునవి. అవన్నీ ఆయన పలుదేశ పర్యటన మూలంగాను, భక్తిభావ తీవ్రతలోను అబ్బిన విశిష్టతలేగాని కావాలని చేసిన ప్రయాస ఫలితాలు కావు. ఈ భక్తవరులు ప్రజలకు ధైర్యసాహసాల నిచ్చి నిర్భయులుగా చేశారు. జ్ఞాన, భక్తి సమన్విత సమరస భావం బోధించి ప్రజలలో పరస్పర స్నేహ విశ్వాసాలు పెంపొందించారు. ఆరాధ్యుని పట్ల భక్తున కుండవల్సిన వినయం, అభిమానం, ఆత్మసమర్పణ, భావావేశం – ఇవి రవిదాసుని ప్రత్యేకతలు. మధ్యయుగాల నాటి భక్తవరుల్లో అధిక ప్రచారం కలిగి, ప్రజల నోళ్ల కెక్కినవారు భక్త కబీరు, భక్త రవిదాసులు.

## 3

భక్త రవిదాసు కాలంనాటికి దేశస్థితి నానా అలజడులతో కూడుకుని వుండింది. రాజకీయంగాను, సామాజికంగాను, సాంస్కృతికంగాను, ధార్మికంగాను కూడ అనేక పరివర్తనాకాలం. వారివారి రీతి రివాజుల్లో ఆచారవ్యవహారాల్లో మార్పు కలుగుతున్న కాలం. ఈ మూలంగా విజితులైన దేశీయులలో నిరాశా నిస్పృహలు జనించినవి. "మేము అనాథలం, దిక్కులేనివారం" అను తక్కువతనం దేశీయులలో పుట్టింది. మరిన్నూ నిర్విరామంగా జరిగే విదేశీ ఆక్రమణలు, వాటివల్ల దేశీయులకు వరుసగా కలిగే పరాభవాలు – ఈ రెంటి నడుమ భారతీయ సమాజం, సంస్కృతులు సతమతమవుతూండినవి. ఇలా విజితులు, విజేతల మధ్య పెరిగిన అఖాతాన్ని పూడ్చాలి. సామాన్య ప్రజలలో తలయెత్తిన హీన, దాస్య భావాలను నిర్మూలించాలి. ఇంచు మించు మొత్తం సమాజమంతటినీ

పునర్నిర్మించాలి. అట్లా సంకుచితమైయుండిన ధార్మిక క్షేత్రంలో ఉదారభావాలను ప్రవేశింపజేసిన మహనీయుడు రామానందుడు. శ్రీ రామానందుడు, ఆయన అనుచరులు కలిసి అతి సామాన్య ప్రజానీకానికి దైవాన్ని కరతలామలకం చేసినారు. ఒక ధార్మిక విప్లవం తెచ్చినారు వీరు. శ్రీ రామానందుడు నవచింతనకు తగిన భూమికను తయారుచేసినాడు.

శ్రీ రామానందుడు తన కాలంలో మిక్కిలి వ్యాపించియున్న కుల, మత భేదాలను చూచి చాల దుఃఖించాడు. "జగదీశ్వరాలయంలోన చీకటి గదులా, ఏ కుటిలబుద్ధి వీటిని నిర్మించిందో" అని ఒక ఆంధ్రకవి తన కీర్తనలో వాపోయినట్లు ఆయన దుఃఖించాడని మన రచయిత యిక్కడ సమయోచితంగా వ్యాఖ్యానిస్తాడు. ఇదే విధంగా రవిదాసు చరిత్రను కూడ బయటనుండి సమయోచిత ఉదాహరణలతో రసవత్తరం గావిస్తాడు ఈ పుస్తక రచయిత.

ఇంద్రియాలను నిగ్రహించనంతవరకు మానవ జీవితం కడతేర దంటాడు రవిదాసు. భోగలాలసకు, ఈర్ష్యాద్వేషాలకు మూలకందం ఇంద్రియలోలత్వం; కనుక ఇంద్రియ చాపల్యానికి లోబడకుండా హమేషా దూరంగా వుండడమే ఉత్తమం; తద్వారా ఆత్మవిశ్వాసంకూడ పెరుగుతుందంటాడు. భోగలాలసవల్ల ధనాకాంక్ష పెరుగుతుంది. ధనేచ్ఛ దుఃఖానికి చేటు. ధనం త్యజించనైనా త్యజించాలి, లేక పరోపకారానికైనా వ్యయపర్చాలి. (రామ) నామ స్మరణలో లభించే సుఖశాంతులు ధనసంపాదనలో దొరకవని రవిదాసు బోధ.

శ్రమచేసి సాధించాలి అనేది గురు రవిదాసు సమాజానికి యిచ్చిన మౌలిక సందేశాలలో ఒకటి. ఎవరూ పరాన్నభుక్కులుగా, స్వార్థపరులై బతుకరాదు. తేరగా తెచ్చుకున్న పిండివంటలకంటె కష్టించి గడించుకున్న గంజే మేలు. రవిదాసు అభిప్రాయం ప్రకారం శ్రమయే దైవం. పరమపద ప్రాప్తికి సైతం అదే సులభ మార్గం. రవిదాసు కేవలం నోటి ఉపదేశకుడు కాడు. స్వానుభవాన్నే యితరులకు బోధించేవాడు. ఆద్యంతాలు చర్మకార వృత్తిలోనే గడిచిన ఆ సాధకుని జీవితమే యిందుకు సాక్ష్యం. జిహ్వతో ఓంకారం జపిస్తూ, చేతులతో పనిచేస్తూవుంటే ఆ భక్తవత్సలుడు ఎక్కడో ఎందుకు ఇంటిలోనే సాక్షాత్కరిస్తాడట. అందుకే తన జీవితంలో రవిదాసు శ్రమకర్మకు అంత ప్రాధాన్యం యిచ్చాడు.

రవిదాసు జన్మతః భక్తుడు. భక్తికి ఎట్టి ఆడంబరాలు ఉండరాదంటాడు. అందువల్ల దైవదర్శనం కోసమని ఇల్లువాకిలి వదిలి, బంధుమిత్రులను విడిచి తోటి మానవులకు, సమాజానికి దూరంగా అడవులకు, కొండగుహలకు పరుగులు పెట్టాల్సిన పని లేదంటాడు. అందుకు బదులు మానవసేవలోనే లీనమై యుండమంటాడు. రవిదాసుకు భక్తి, ప్రేమ ప్రధానమయినవి. ప్రేమ ఆధారముంటే మానవులెవరూ జన్మతః నీచులుగాని, అస్పృశ్యులుగాని, చూడరానివారుగాని కారు. తమ కర్మలను బట్టే ఎవరైనా ఉత్తములు లేక అధములవుతారని రవిదాసు వెల్లడిస్తాడు.

దైవదర్శనం, ఇష్టదేవతారాధన, ధర్మపీఠమెక్కి ఉపదేశాలు యివ్వడం కులీనులేగాని అన్ని వర్గాలవారూ చేయ వీలు లేదని కొంతకాలంగా వస్తున్న రివాజు. దానిని నిరసిస్తూ ధనికులు, దరిద్రులు, పేద, పెద్ద అనే తారతమ్యం లేకుండా మానవులందరూ దేవతార్చన చేసుకోవచ్చు, పీఠమెక్కి ఉపదేశాలీయవచ్చని నిర్భయంగా చాటి చెప్పాడు రవిదాసు.

కృష్ణుడు, కరీం, రాముడు, రహీం మున్నగువారిని సమానదృష్టితో చూడనంతవరకు వేదాలు ఎన్ని వల్లించినా, పురాణాలెన్ని పఠించినా, కురాన్‌లు ఎన్ని చదివినా ప్రయోజనం శూన్యమని మర్యాదగా మందలిస్తాడు రవిదాసు. ఈ విధంగా వివిధ మతస్థుల మధ్య సమత, సౌహార్ద్రతలు కల్పించయత్నిస్తాడు రవిదాసు.

పూర్తి నిర్లక్ష్యానికి గురైన సముదాయంలో జన్మించినా భక్త రవిదాసు ఎన్నడూ ఉపేక్షితుడిగా జీవించలేదు. ఉత్తమునిగానే బతికాడు. యుగ యుగాలుగా సమాజానికి, సజాతీయులకు కడుదూరంగా వుండిపోయిన మానవులను మేల్కొలిపి, వారిని ఈ భూమిపై కుదురుగా నిలబెట్టాడు. ఇది అతడు చేసిన మహోపకృతిగా పరిగణించవచ్చును.

## 4

సాహసం, సహనాలతో మానవాతీతుని సందేశాల నియ్యడం రవిదాసువంటి సిద్ధునికే చెల్లుబడి అయింది. జనసముదాయానికి నచ్చజెప్పగల ఉత్తమ సాధకుడైనాడు రవిదాసు. అంత్యజాలకులంలో పుట్టినా రవిదాసు చరిత్రలోను, వ్యవహారంలోను, సాధనలోను ఏ వైష్ణవ

భక్తునికీ తీసికట్టుగా జీవించలేదు. ఒక ధార్మిక పండితునికంటె మిన్నగా గౌరవ మర్యాదలందుకున్నాడు. కనుకనే అన్ని వర్గాల వారు ఆయన బోధలు వినక తప్పింది కాదు. "గీత నశించి పోయింది; ఉపనిషత్తులు లుప్తమైపోయినవి; వేదాలు విస్మరింపబడ్డవి. ఏమంటే రవిదాసు ప్రభృతుల వాణిద్వారా ప్రజలు మోక్షం పొందగల్గుతున్నారు. కలియుగ మహిమ యిది." ఇలా ఎవరేమనుకున్నప్పటికీ రవిదాసు భావాల ఔచిత్యం మరింత వృద్ధి అయిందేగాని తగ్గలేదు. తుదకు సమకాలిక ప్రజానీకమైనా అతనిని ఏ బ్రాహ్మణునికంటెను తక్కువగా గణించలేదు. అతడు దూరదృష్ట, సంఘసంస్కర్త. అతడి జీవితం ఆద్యంతాలు సంఘర్షణా మయంగానే గడిచాయి. నిద్రిస్తున్న సమాజాన్ని మేల్కొలిపాడు. కనుకనే మానవతావాది, సాధనాసిద్ధుడు అయిన రవిదాసును మన జాతిపిత మహాత్మాగాంధీ, "బీజన్యాయంగా తన్నుతాను నశింపు జేసుకొని ఇతరులకు జీవనదానం చేయడం నేర్పాడు... రవిదాసుని అమృతవాణి తప్త హృదయాలను చల్లబరుస్తుంది. మానవుల్లో సమానత్వం సాధిస్తుంది కూడ." అని ప్రస్తుతించాడు. భక్తాగ్రేసరుడు రవిదాసు ఆవిర్భవించి నేటికి సుమారు 650 ఏండ్లు గడిచాయి. అయితే ఆనాటి అసమానతలు, సాంఘిక అన్యాయాలు నేటికీ సాగుతూనే వున్నవి. అవి వున్నంతవరకు రవిదాసు ప్రగతిశీల భావాలు అభేద్యంగా, సుప్రస్తుతంగానే వుంటాయి.

## 5

రవిదాసు భక్తవాణి పరిచయం యిక్కడే పాఠకులకు కొద్దిగా కలగజేయడం సమంజసంగా వుంటుందని భావిస్తాను.

1. ప్రపంచం కుసుంబ పుష్పం వంటిది. క్షణక్షణం రంగు మారుతూంటుంది. కాని తన ఆరాధ్యుని రంగు తొగరురంగులాంటిది. అది శాశ్వతమైనది, ఎన్నటికీ మారనిది అంటాడు రవిదాసు.
2. సృష్టికర్త ఈశ్వరుడు సర్వులను సమానంగా చూస్తాడు. ఆ అఖిలరంజనుడు అంతటా వ్యాపించి యున్నాడని రవిదాసు అంటాడు.

3. పుట్టుకతో ఎవరూ నీచులుగా జన్మించరు. నీచకర్మ అను పంకిలమే మానవులను నీచులుగా చేసిందని రవిదాసు హితవు పలుకుతాడు.

4. గుణహీనుడైన బ్రాహ్మణుడెప్పుడూ పూజార్హుడు కాడు; గుణవంతుడు, బుద్ధిమంతుడైన చండాలుడుసైతం పూజనీయుడనే రవిదాసు బోధ.

5. జనన మరణాలు లేనిది పరాశక్తి. స్థావర జంగమము లన్నింటిలోను, పిపీలికాది సర్వప్రాణులలోను నిండియుండునది, వాటి గతి విధుల నెరుగునది, వాటికి జన్మకారణమైనది అదే శక్తి. చూచునది, చూడబడునది; తెలుసుకొనునది, తెలుసుకోబడునది; ఈశ్వరుడు, పరమేశ్వరుడు అనబడునది, ఆదిమధ్యాంతరహితమైనది ఒకటే. సాధకోత్తముడు రవిదాసు మత ప్రకారం అదే పరాశక్తి, ఏకేశ్వర శక్తి, ఏకైకశక్తి!

6. కులమత జంజాటాలలో అందరికందరూ చిక్కువడి యున్నారు. అయితే ఈ కుల మతాల జాడ్యం మానవతను మింగివేసిందన్న సంగతి ఎవరూ గమనించడంలేదని రవిదాసు హెచ్చరిస్తున్నాడు.

7. అరటి ఆకులవలె కులంనుండి కులం, అందునుండి ఉపకులం ఒకదాన్నుండి మరొకటి పుట్టుకొస్తున్నాయి. ఈ కులాలు అంతరించనంత వరకు మానవులు పరస్పరం (సఖ్యతతో) కలవలేరంటాడు భక్త రవిదాసు.

8. సత్యం, సంతోషం, సదాచారం - యివి మానవ జీవితానికి ఆధారస్తంభాలు. విషయలోలత్వం మొదలైన పంచవికారాలను జయించిన మానవుడే దైవత్వం పొందగలుగుతాడంటాడు రవిదాసు.

9. ప్రజలు తరచూ మద్యం సేవిస్తూంటారు. కాని దాని మత్తు పదే పదే దిగిపోతూనే వుంటుంది. అందుకు బదులు తాగితే రామనామమనే మహారసమే తాగమంటాడు భక్త రవిదాసు. ఆ మహారసం మత్తు ఎక్కినది ఎక్కినట్లుగానే వుంటుంది, దిగడమంటూ వుండదు.

10. ఆ ఆరాధ్యుని దర్శనం కావడంతోనే జన్మజన్మాల దప్పి తీరిపోతుంది. అంతటితో మానవుడు జీవన్ముక్తుడవుతాడు.

11. సాధు పురుషుల సత్సంగం లేకుండ భావం పుట్టదని, భావోదయంలేనిదే భక్తి జనించదని సాధక శిరోమణి స్వానుభవం.

12. ఓ ఈశ్వరా, ఈ భవసాగరం అపారం. నాదేమో ఇనుపనావ. రాళ్ల రప్పలు ఇందున్న బరువు. లోపల సద్భావాలు లేవు. వీటి మధ్య చేపవలె చిక్కివున్నది నా మనస్సు అని పరితపిస్తాడు రవిదాసు.

## 6

ఇంతటి మహాత్ముని జీవిత చరిత్రను సరళసుందరంగా మనకు పరిచయం చేసిన ఈ పుస్తక రచయిత చోళ్ల విష్ణు. ఈతని జన్మస్థలం ఆంధ్రరాష్ట్రం, పశ్చిమ గోదావరి జిల్లా, తాడిమళ్ల కుగ్రామం. తల్లిదండ్రులు సీతమ్మ, సీతయ్యగార్లు. గవరయ్య, రామన్న, చింతన్న అనువారలు తమ్ములు. 1923 ప్రాంతంలో తణుకు గ్రామ గాంధీ జాతీయ పాఠశాల నుండి అక్కడి అధ్యాపకులు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణమూర్తి గారితో "ఆనంద నికేతనం" అనే వేరొక గాంధీ జాతీయ పాఠశాలలో వచ్చి చేరారు మన చోళ్ల గంగన్న (విష్ణు), అతని తమ్ముడు చింతన్న (చిత్తరంజన్), పచ్చిపాల చిట్టెయ్య, పోలుమట్ల సూరన్నలు. "ఆనంద నికేతనం" ప.గోదావరి జిల్లాలోనే కొవ్వూరు సమీపంలో వుండింది. ఆ విద్యాశ్రమ వ్యవస్థాపకులు శ్రీ తల్లాప్రగడ నరసింహశర్మ, ఆయన సతీమణి శ్రీమతి విశ్వసుందరమ్మగార్లు. శ్రీమతి విశ్వసుందరమ్మ పరమ సాధ్వి. గాంధీ వుద్యమంలో జైలుకు వెళ్లిన ధైర్యశాలి. ఆ ఉద్యమ సాహస కార్యకలాపాలను అద్భుతంగా వర్ణించిన సహజ కవయిత్రి. తాడిమళ్ల సోదరులలో 'గంగన్న'కు 'విష్ణు' గాను, 'చింతన్న'కు 'చిత్తరంజన్'గాను పేర్లు మార్చినది ఈవిడే. అప్పటికి మన 'విష్ణు' 14 సంవత్సరాల బాలుడు.

తన సంక్షిప్త జీవిత విశేషాలు రాసియవ్వమని ఈ 'విష్ణు' నాముడ్ని అడిగాను. 'డు' అనే ఏకవచన ప్రయోగం ఎందుకంటే, ఆరు దశాబ్దాల

క్రితం 'ఆనంద నికేతనం'లో 'విష్ణు'ని అధ్యాపక ప్రియుల్లో నేనొకడిని కావడంచేత. నాకుతోడు విశ్వసుందరమ్మగారు, ఆమెతోబాటు శ్రీ వారణాసి రామశేషయ్య, తణుకు గ్రామ గాంధీ పాఠశాల నుండి వచ్చిన తల్లాప్రగడ నారాయణమూర్తిగారు వుండేవారు. ఈ చివరి యిద్దరూ, అలాగే మన 'విష్ణు'డూ ఐచ్ఛిక బ్రహ్మచారులు, దైవభక్తులు, ప్రజాసేవకులు. నేను కోరిన ప్రకారం మా 'విష్ణు'డు రాసియిచ్చిన సమాచారం యిది :

> *మేము 1930 శాసనోల్లంఘనోద్యమంలో చురుకుగా పాల్గొన్నాము. శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, కంభంపాటి సత్యనారాయణ, మద్దుకూరి చంద్రంగార్లతో కలిసి గాంధీ ఉప్పు సత్యాగ్రహానికి బయలుదేరాను. భీమవరం, కోపెల్లవారి సత్రంలో మకాం చేశాం. అక్కడినుండి (సత్యాగ్రహానంతరం) తంజావూరు బోర్స్టల్ స్కూలు (జైలు)కు పంపబడ్డాను. తిరిగివచ్చి ఉంగుటూరు మకాం. అల్లూరి, ఉద్దరాజు, భీమయ్య, నేను (విష్ణు) 'వీర భారతి' రహస్యపత్రికను నడిపాము. ఆ సందర్భంలోనే బహుశా 1932 జూలై నెలలో భీమవరం ఆర్.డి.ఓ ఆఫీసు మీద (సత్యాగ్రహంలో) శ్రీ కాళీపట్నపు కొండయ్య, పసల కృష్ణమూర్తిగార్ల నాయకత్వాన అరెస్టయ్యాము. నన్ను 3,4 నెలలు రిమాండులో వుంచి విడిచిపెట్టారు. మరల ఉంగుటూరు మకాం. అక్కడనుండి సుందరయ్యగారి వద్దకు చేరుకున్నాను. వారు నన్ను శ్రీ నండూరి వెంకట కృష్ణమాచార్యుల వద్దకు, హైదరాబాద్‌కు, పంపారు. నండూరివారిద్వారా రావి నారాయణరెడ్డిగారి పరిచయం. వామన్ నాయక్, సరోజినీ నాయుడుగార్ల సలహాలతో నైజాంకు వ్యతిరేకంగా కార్యకలాపాలు నడిపాము. ఆంధ్రోద్యమంలో పని, పగలు కుట్టుపని, రాత్రిళ్లు మిలిటరీలో హిందీ తరగతుల నిర్వహణ, రహస్యంగా జాతీయ భావాల ప్రచారం. ఢిల్లీలో బాగా తర్ఫీదయివస్తే ఇక్కడ నైజాం వ్యతిరేక ప్రచారం చక్కగా చేయవచ్చని యోచించి శ్రీ నారాయణ రెడ్డిగారు నన్ను ఠక్కర్ బాపాగారివద్దకు కేవలం రెండేళ్ల కొరకని పంపారు. ఢిల్లీలో మహాత్మ గాంధీ, ఠక్కర్ బాపా, ఎన్.ఆర్. మల్కానీ, వియోగిహరి గార్ల పర్యవేక్షణలో కార్యభారం పెరిగింది. నన్ను నేను మరచి పనిలో పడ్డాను. ఇక్కడ నా జీవితంలో కొత్త మలుపు వచ్చింది. రెండేండ్లనుకున్నది నలభై ఏండ్లయింది!*

ఆచార్య నియోగిహరిగారివద్ద హిందీ సాహిత్యం, సంత్ సాహిత్యం చదివాను. "సాహిత్య విశారద", "రాష్ట్ర భాషారత్న" మొదటి పార్టు పాసయ్యాను. కాని రెండో పార్టు పరీక్షకు వెళ్లలేకపోయాను. థక్కరు బాపా చదువుకు వ్యతిరేకులు. పనిని మించిన చదువేమిటంటారు. పనియే పరీక్ష గనుక పని చేయమనే వారు. ఈ విషయంలో గాంధీజీ భావాలు భిన్నంగా వుండేవి. ఆర్థికంగా ఎవరిమీదా ఆధారపడకుండా స్వదేశ లేక విదేశ భాషలు ఏవైనాసరే చదవమనేవారు.

1942 ఉద్యమంలో జైలుకు వెళ్లనియ్యలేదు థక్కరు బాపా. "జైళ్లకు వెళ్లడం ముఖ్యంకాదు. వెళ్లినవారి లక్ష్యం, ఆశయం కొనసాగించాలి. వారి కుటుంబాలను కనిపెట్టడం ప్రధానం" అనేవారు శ్రీ బాపా. ఈ నలభై ఏళ్ల కాలంలో నేను అనేక రచనలు చేశాను. వాటిలో కొన్నియివి :

1. దీనబంధు థక్కర్ బాపా - ఇది నా స్వీయరచన.
2. అస్పృశ్యతా శ్రద్ధాకణములు - హిందీ నుండి అనువాదం.
3. భారతదేశ జానపద కథలు - భారత ప్రభుత్వ ప్రచురణ.
4. దేశదేశాల జానపద కథలు - భారత ప్రభుత్వ ప్రచురణ.
5. పది తెలుగు కథలు - హిందీలోనికి అనువాదం.

ఇంకా హిందీలో కొన్ని వ్యాసాలు రాసాను. పోతే 'ధర్మజ్యోతి', 'విద్యాజ్యోతి', 'ఆంధ్రజ్యోతి', 'ఆంధ్రప్రభ' దిన, వారపత్రికలు, 'భాగ్యనగర్', 'భారతి' యిత్యాది తెలుగు పత్రికల్లో 40కి పైగా నా వ్యాసాలు ప్రచురింపబడ్డాయి. వాటిలో కొన్ని గాంధీజీ గురించిన స్మృతులు.

థక్కర్ బాపావద్ద శిష్యరికంతర్వాత "హరిజన సేవక సంఘం" ఆధ్వర్యంలో నడిచిన 'హరిజన ఉద్యోగశాల'లో పనిచేశాను. ఆ సంఘం వున్న ఆవరణ పేరు 'హరిజన నివాస్' లేక 'హరిజన కాలనీ'. అందులో ముందు విద్యార్థిగా, తరువాత వరుసగా హిందీ ఉపాధ్యాయునిగాను, క్రాఫ్టు టీచరు (వృత్తి విద్యా అధ్యాపకుని)గాను, వార్డెను, సహాయ వ్యవస్థాపకునిగాను పనిచేశాను. 1964లో ఈ సంస్థకు ఐ.టి.ఐ.

(పారిశ్రామిక శిక్షణా కేంద్రం)గా గుర్తింపు వచ్చినప్పుడు నేను 'సహాయ వ్యవస్థాపక్' అంటే ప్రభుత్వ పరిభాషలో వైస్ ప్రిన్సిపాల్ అయ్యాను. 1976లో వ్యవస్థాపకునిగా (ప్రిన్సిపాల్‌గా) పదవీవిరమణ చేశాను. ఆ సంస్థలో అనాథ విద్యార్థులు కూడ చదువుకునేవారు.

1945 నుంచి శ్రీమతి రాజ్యలక్ష్మి రాఘవన్ గారితో కలిసి హిందీయేతర రాష్ట్రాలవారికోసం రాష్ట్రభాష హిందీ (వార్ధా) ప్రచారం, పరీక్షలు నిర్వహిస్తూ వస్తున్నాము.

మన స్వరాజ్యానికి పూర్వంనుండి నేనిక్కడ బ్రహ్మ సమాజంలో సభ్యునిగా వుంటూవస్తున్నాను.

స్వాధ్యయనంద్వారా అవసరం వున్నంతమేరకు అనువాదం చేసుకోగలంత పరిజ్ఞానం బెంగాలీ, గుజరాతీ, మరాఠీ, ఉర్దూ భాషల్లో గడించుకున్నాను.

దేశానికి 'హరిజన ఉద్యోగశాల' వంటి సంస్థలు ఎంతో అవసరమని, కాని అవి వ్యక్తులపై ఆధారపడకుండా బలమైన సంఘం లేక ట్రస్టీలపై ఆధారపడడం మంచిదని నా అభిప్రాయం.

ఇన్ని రాసిన విష్ణు యిప్పుడు భక్త రవిదాసు జీవితగాథ రచించాడు. వేలమందికి దారిచూపే రవిదాసు జీవిత కథా రచనను మించిన ప్రజాసేవ మరొకటుండబోదని నా నిశ్చితాభిప్రాయం.

తల్లాప్రగడ ప్రకాశరాయడు

* * *

# కృతజ్ఞతలు

1972 సెలవులకు వచ్చినపుడు విశాఖపట్టణంలో ఈ పుస్తకం రాసాను. రాస్తూ, రాస్తూ మధ్యలో శ్రీ తల్లాప్రగడ నారాయణమూర్తిగారికి చూపించాను. చూచి, బాగుంది,యిదే ధోరణిలో పూర్తిచేయమన్నారు. అలాగే పూర్తి చేసాను.

1980లో గురుదేవులు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారిని హైద్రాబాద్‌లో చూచినపుడు నా రెండు రాతప్రతులు - రవిదాసు, ఈశావాస్యోపనిషత్తు (అనువాదం) - చూపించాను. కొన్ని భాగాలు చదివించుకుని విన్నారు. అనంతరం దినదినం పెరుగుతున్న వయోభారాన్ని లెక్కచేయకుండా అక్షరం, అక్షరం చదివి, పరిచయ వాక్యాలు (పీఠిక) రాసి యిచ్చారు. ఆ భక్తునిపట్ల వారి శ్రద్ధ, నాపట్ల వారి ప్రేమ మరువరానిది.

రవిదాసు బొమ్మకు నకలు గీసిచ్చిన శ్రీ నేలపాటి సుజ్ఞానరావుగారు గూటాల (పశ్చిమ గోదావరిజిల్లా) Z.P.P. హైస్కూలులో డ్రాయింగు టీచరు. ఈయనలో ఒక నిపుణుడైన కళాకారుడున్నాడు. తగిన హంగులు, అవకాశాలు లభించకపోవడం వలన ఎంతమంది కుశలురయిన కళాకారులు, గోటి చిత్రకారులు పైకి రాకుండా యిలా అడుగునే పడివుంటున్నారో! అడగడంతోనే వెనుకాడకుండా రవిదాసు చిత్రానికి నకలు గీసి యిచ్చిన సుజ్ఞానరావుగారు ఎంతైనా ప్రశంసనీయులు.

లోగడ పనిమీద ఢిల్లీ వచ్చిన ఆదరణీయ మిత్రులు శ్రీ ఇంగువ మల్లికార్జున శర్మగారు నావద్ద కొన్నాళ్లు వున్నారు. ఆ సదవకాశ ఫలితంగా రవిదాసు రాతప్రతి చూడడం, ఇందులో వారికి ఏం తోచిందో తాను అచ్చువేయిస్తానని ముందుకురావడం జరిగింది. ఇరవై ఏండ్లుగా వేచిచూస్తున్న నాకిది ఆనందమయింది; సరేనని వారి కిచ్చాను. ఆయన హైదరాబాదు తిరిగివెళ్లిన పిదప తన శ్రీమతి ఐ. బాలమణి ప్రారంభించి, నడిపే రవి శశి ఎంటర్‌ప్రైజెస్ తరపున మొదటి ప్రచురణగా వెలువరిస్తానని తెలపడం, ఆ మేరకు శ్రీమతి బాలమణి కూడ నాకు ఉత్తరం రాయడం జరిగింది.

ఈ విధంగా యీ భక్త రవిదాసు పరిచయ పుస్తకం ప్రజల ఎదుటకు రావడానికి దోహదం చేసిన పై ఏవురికి ఎంతయో కృతజ్ఞుడను. అలాగే ఈ పుస్తక రచనకు, శుద్ధప్రతి రాతకు సహాయపడిన నా తమ్ముడు చోళ్ల చిత్తరంజన్‌కు, చిరంజీవి P.J.V. లక్ష్మి (ఝాన్సీ) కి నా హార్దిక ధన్యవాదాలు.

తేదీ : 15-12-1993.

671, ఫ్రీడం ఫైటర్స్ హోమ్,
బాబా ఖడక్ సింగ్ మార్గ్,
కొత్త ఢిల్లీ - 110 001.

చోళ్ల విష్ణు

* * *

# మా మాట

సాంఘిక, ఆర్థిక, రాజకీయ, సాంస్కృతిక, సాహిత్య, శాస్త్రవిజ్ఞాన రంగాలకు సంబంధించిన పలు ముఖ్య అంశాలపై విలువైన, సర్వజనోపయోగకరమైన అనేక పుస్తకాలు ప్రచురించాలని, పంపిణీ చేయాలనే సంకల్పంతో ఇటీవలే ఈ **రవిశశి ఎంటర్‌ప్రైజెస్‌**ను ప్రారంభించాము. ఆ లక్ష్య సాధనా క్రమంలో పదిహేనవ శతాబ్దపు ప్రఖ్యాత హరిజన భక్తశిరోమణి **రవిదాసు జీవిత చరిత్ర**ను మా తొలి పుష్పంగా సమర్పించగల్గుతున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాము. ఎంతో పరిశోధన సల్పి, శ్రమించి ఈ పుస్తకాన్ని రచించడమే గాక అడిగినదే తడవుగా సానందంగా రాతప్రతిని మాకు ప్రచురణార్థం యిచ్చిన ప్రముఖ స్వాతంత్ర్య యోధులు, హరిజన సేవకులు శ్రీ చోళ్ళ విష్ణుకు, నేర్పుతో, ఓర్పుతో ఈ పుస్తకం సంపాదన, ముద్రణలను నిర్వహించిన మా వారు శ్రీ ఇంగువ మల్లికార్జున శర్మకు పుస్తకాన్ని అందంగా అచ్చువేసి యిచ్చిన వంశీ ప్రింటర్సు వారికి ఈ పుస్తక ప్రచురణకు యింకా అనేక విధాలుగా తోడ్పడిన మాన్యులందరికీ నా హార్దిక ధన్యవాదాలు. తెలుగు పాఠకులు ఈ పుస్తకాన్ని విశేషంగా ఆదరించి మమ్మల్ని కృతార్థుల్ని చేస్తారని ఆశిస్తున్నాను.

ఇంగువ బాలమణి

తేదీ: 1994 జనవరి 1
హైదరాబాదు - 500 482.

# విషయ సూచిక



* * *

# 1

# ఎవరీ రవిదాసు?

భారతదేశ చరిత్రలో మధ్యయుగం కబీరు, గురునానక్, రవిదాసు, సేనా, ధనా, మీరా మొదలైన భక్తవరులతోను, వారి భక్త వాణులతోను నిండివున్నది. నాడు దేశం రాజకీయ, సాంఘిక, మతపర రంగాల్లో నానా అలజడులకు, అల్లకల్లోలాలకు లోనై అస్థిరంగా వుండింది. విదేశీ దురాక్రమణలు, మత మార్పిడీలు ముమ్మరంగా జరుగుతున్న కాలమది. కాలచక్రం తిరుగుడులో ఈ దురాక్రమణలు, మతాంతరీకరణల పర్యవసానంగా తలెత్తిన క్రొత్త పాతల సంధికాలంలో ప్రజలు అకారణంగా అనాథలు, అసహాయులుగా నలిగిపోతూండినారు. స్వాతంత్ర్యం, స్వాభిమానం కోల్పోయి పరరాజులచే విజితులై అడుగడుగునా అవమానాలతో బానిసబతుకులు గడుపుతూండినారు.

అటువంటి క్లిష్ట తరుణంలో దైవప్రేరణయా అన్నట్లు దైవజ్ఞుడైన ఆచార్య రామానందుడు, ఆయన ద్వాదశ శిష్యులతో ఒక భక్తమండలి అవతరించింది. తమ త్యాగమయ, నిరాడంబర జీవితాలద్వారా, సాత్విక సాధనాల ద్వారా, విశిష్టశైలితో తామొసగిన హితోపదేశాల ద్వారా ఆ భక్తవరులు విజేతలు, విజితులు ఉభయులకూ నడుమ ఎంతో ఆవశ్యకమైన నూతన భావ వారధి ఏర్పరిచారు. ఆదర్శప్రాయమైన స్నేహసామరస్యాలు నెలకొల్పారు. ఆ మండలిలో ఒకడే గురు రవిదాసు.

భక్త రవిదాసు ఆ భక్తమండలిలో ప్రథమగణ్యునిగా జీవించాడు. సాధుస్వభావం, సత్ప్రవర్తన, అనవరత సాధనలద్వారా వీరు వారనకుండా అన్ని వర్ణాలవారికీ వంద్యుడయ్యాడు. ఎంతో కాలం నుండి పాదుకు పోయివున్న మూఢనమ్మకాలను చీల్చిచెండాడి సంస్కార దృష్టి, సమసమాజ కల్పనా శక్తులను సామాన్య ప్రజానీకానికి ప్రసాదించాడు. హెచ్చుతగ్గులు, కొద్ది గొప్పలు లేని సమసమాజ స్థాపనకు కృషి చేశాడు. కులమతాల అంతరాలు లేకుండా స్త్రీ పురుష భేదం లేకుండా అందరూ భక్తిమార్గంలో భగవద్ధ్యానం నిరభ్యంతరంగా చేసుకోవచ్చని ప్రబోధించాడు.

బాహ్యాడంబరాలు, అంధవిశ్వాసాలను తోసిపుచ్చి సంఘ సంస్కర్తగా, సఫల విప్లవకారునిగా పేరుపొందాడు. ఆ కారణంగానే 'భక్తుల్లో భక్తుడు రవిదాసు' అని, "అత్యంత నిష్కాముడు, మహాత్యాగి" అని, "కడజాతిలో పుట్టినా అన్ని వర్ణాల వారికి పూజనీయుడైన ఉత్తమ పురుషుడు" అని సమకాలిక భక్తవరులచే ప్రశంసలందుకున్నాడు.

ఆయన సమకాలికులు, అనంతరకాలపు రచయితలే కాదు, నేటి మహానుభావులుకూడ భక్త శిఖామణి రవిదాసును వేనోళ్ల కొనియాడారు. మచ్చుకు,

"మహాత్మా రవిదాసు కేవలం రవిదాసీయులకేకాదు, సర్వమానవులకు పూజనీయుడు" అని శ్రీ జగజ్జీవన్ రామ్ అంటే, నాటి కేంద్ర హెూం శాఖామాత్యుడు శ్రీ గోవింద వల్లభ పంత్, "భారతీయ భక్త సముదాయంలో రవిదాసుకొక గౌరవ స్థానం వుంది" అన్నారు. ఇక ఉత్తరప్రదేశ్ మాజీముఖ్యమంత్రి పండిత సంపూర్ణానంద్ "హిందూ సమాజం బహుకాలంగా కులమతాల విషవలయంలో చిక్కుపడి వున్నది. కబీరు, సదనా, పీపా, రవిదాసుల్లాంటి మహాపురుషులు ఈ (శోచనీయ) రివాజును ఖండించారు" అని కొనియాడాడు. ఇంకా, "సద్భావన, సదాచారాల ద్వారా భారతదేశంలో ఆధ్యాత్మిక ప్రాతిపదికను సిద్ధపరచిన మహాత్ముల కోవకు చెందినవాడు భక్త రవిదాసు" అని ప్రశంసిస్తాడు శ్రీ చౌధురీ గిరిధారీలాల్.

మధ్యయుగాలప్పటి భక్తవరుల్లో అత్యధికులు ఉత్తరాదినే జన్మించారు. వారిలో పేరెన్నికగన్నవారు కబీరు, రవిదాసులు. వీరిలోనూ ఆద్యుడు రవిదాసేనని చెప్పవచ్చు. భక్తాగ్రేసరుడు రవిదాసు పుట్టి యిప్పటికి రమారమి 600 ఏండ్లకుపైగా గడిచింది. ఇన్నాళ్లకు నేడు మేధావులు, పరిశోధకుల దృష్టికి తగిలాడు రవిదాసు. ఆయన జీవిత విశేషాలు చర్చనీయాంశాలైనాయి. ప్రఖ్యాత మేధావులు స్వర్గీయ అగర్ చంద్ నాహటా (బికనీరు), కీ.శే. ఆచార్య హజారీ ప్రసాద్ ద్వివేదీ, కీ.శే. రామానందస్వామి, M.P., గార్లు ఆయన జీవితం గురించి విస్తృత పరిశోధన గావించారు. ఇంకా ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధుడు శ్రీ పృథ్వీసింగ్ ఆజాద్, మహంత్ భగవాన్ దాస్ శాస్త్రి (బికనీరు), శ్రీ గోపాల్ నారాయణ్ వోహ్రా (జయపూరు), డాక్టర్ శ్రీ రామకుమార్

వర్మ, ఆచార్య శ్రీ పరశురామ చతుర్వేది, సాహిత్యవాచస్పతి పండిత శ్రీ నియోగిహరి, పండిత వీరేంద్ర పాండే మొదలైన స్వదేశీ మేధావులు, విలియం వెస్టింగ్‌లాంటి విదేశీ మేధావులు భక్త రవిదాసు గురించి పరిశోధన జరిపారు, జరుపుతున్నారు. ఇంకా రాజస్థాన్ ప్రాచ్య విద్యా ప్రతిష్టాన్, ఓరియంటల్ రిసర్చి ఇన్‌స్టిట్యూట్ (పూనా), హిందీ సాహిత్య సమ్మేళన్, నాగరీ ప్రచారిణీ సభ, కాన్పూరు విశ్వవిద్యాలయం వంటి విద్యాసంస్థలు పట్టాఅనంతర (Post-graduate) చదువులకు, Ph.D. పట్టాలకుగాను రవిదాసు గురించి థీసిస్‌లు రాయించడంలో నిమగ్నమై వున్నాయి.

ఇంతమంది మహామేధావులు, ఇన్ని ప్రతిష్మాత్మక విద్యాసంస్థలు పరిశోధనలు జరుపుతున్నా నేటికీ భక్తరవిదాసు జనన మరణ కాలాలు, ఆయన జన్మస్థల వివరాలు యిదమిద్ధమని తేలలేదు. అలాగే ఆయన పుట్టుకులం, పేరు మొదలైనవికూడ నిస్సందేహంగా ఖరారు కాలేదు. ఇంకా పరిశోధకుల తుది నిర్ణయాన్ని వేచివున్నవి.

ఇంతగా చర్చకెక్కిన భక్త రవిదాసు భోగట్టా ఉత్తరాదివారికే పరిమితమై వుంది. ఉత్తరాదిలో స్కూలు పిల్లలకు సైతం ఈ భక్తుని పేరు తెలుసు. కాని దక్షిణాదివారికి ఆయనగురించి ఎరుక అత్యల్పమే. అందుచేత భక్తుల్లో మణిపూస వంటి ఆ పావన పురుషుని జీవితచరిత్ర టూకీగానైనా తెలుగు ప్రజలకు పరిచయంచేయాలనే కోరికతో నేనీ రచనకు పూనుకున్నాను. ఆయన జీవితచరిత్ర సమగ్రంగా రాయ సంకల్పించే విజ్ఞులు, మేధావులకు యిది ఏ కొంత ఉపకరించినా నాకదే పదివేలు. ఇదే నా ఆశయం.

* * *

# 2

# చారిత్రక, రాజకీయ నేపథ్యం

యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్ ।

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ।

**ఓ అర్జునా! ఎప్పుడెప్పుడు ధర్మం క్షీణించి అధర్మం పెరుగుతుందో అప్పుడప్పుడు నేను అవతరిస్తాను. సాధుజనుల రక్షణ, దుర్మార్గుల నిర్మూలనల కోసం, ధర్మపాలన నెలకొల్పడంకోసం నేను ప్రతి యుగంలో అవసరమైనప్పుడల్లా ఆవిర్భవిస్తాను.**

*(భగవద్గీత, అధ్యా. 4, 7-8).*

మన దేశంలో హర్షవర్ధనుని అనంతరం రాజకీయంగా కేంద్రాధికార శక్తి నశించిపోయింది. సామంతరాజులు ఎవరికివారు స్వతంత్రంగా వ్యవహరించసాగారు. వారి రాజ్యసీమలు అత్యంత పరిమితమైపోయినవి. కాని ఆ సంకుచిత రాజ్యాలనే వారు సామ్రాజ్యాలుగా పరిగణించుకోసాగారు. జాతీయ భావన పూర్తిగా మృగ్యమైపోయింది. సరిగదా వారివారి మహాభిలాషలు, వ్యక్తిగత పేరుప్రతిష్ఠలే వారికి జాతీయతకు మించి ముఖ్యమైపోయినవి. అందుమూలంగా దేశం ఛిన్నాభిన్నమై రాఠోర్, సోలంకి, పవార్, కచ్‌వాహ, పరిహార్, చందేల్, తోమార్, అహీర్, గహలౌత్, చౌహాన్ మొదలైన వివిధ వంశాల రాజ్యాలుగా ముక్కలై పోయింది. ఇలాంటి స్వతంత్ర్య రాజుల మధ్య తరచూ రాజ్యాభిలాషలవల్లనైతేనేమి, పరస్పర ఆధిక్యతా భావాల మూలంగానైతేనేమి ఈర్ష్యా ద్వేషాలు,కలహకార్పణ్యాలు పెచ్చరిల్లిపోతుండేవి. ఎవరైనా సుందర రాజకుమారి కోసమో, లేక ఏదైనా రాజ్యసీమ విస్తరణ కోసమో, ఇవేవీ కాకపోతే కేవలం తమ పౌరుష పరాక్రమాల ప్రదర్శన నిమిత్తమో ఆ సామంత రాజులు పరస్పరం పదే పదే యుద్ధాలు చేస్తూండేవారు. కడకు

ఎందుకూ కొరగాని కీసుకజ్జాలు సైతం రాజుల చావుబతుకులకు, రాజ్యాల అభివృద్ధి పతనాలకు కారణభూతాలు అవుతూండేవి. ఆనాడు అటువంటి కార్యకలాపాలు గౌరవప్రదమైనవిగా ఎంచబడేవికూడాను. ఇలాంటి పరస్పర కలహాలు, కార్పణ్యాలు, ఆంతరంగిక గృహకలహాలు తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు, గౌరవప్రతిష్ఠలకు నిదర్శనాలన్నట్లు ఆ సామంత రాజులు భావించి కొనసాగిస్తూండేవారు. ఆ స్వనామధన్యత్వ ప్రయాసలో రాజ్యాల భవితవ్యం, రాజ్య ప్రజల రక్షణ, యోగక్షేమాలు, రాజ్యపాలన లాంటి ప్రాథమిక విషయాలు వారెవరూ పట్టించుకునేవారు కాదు. ఆ విషయాలను పూర్తిగా ఉపేక్షించేవారు. తద్వారా దేశం బలహీనపడుతున్న దన్న జ్ఞానం ఆ సామంత రాజులెవరికీ లేకపోయింది.

సరిగ్గా అదే తరుణంలో సామ్రాజ్య విస్తరణాకాంక్షులయిన విదేశీయుల దాడు లారంభమయినాయి. ఆ దురాక్రమణదారుల దాడులను అరికట్టి దేశాన్ని, ప్రజలను కాపాడగల శక్తిసామర్థ్యాలు వ్యక్తిగతంగాగాని, సమష్టిగాగాని యిక్కడి రాజులెవరికీ లేకపోయినవి. కేంద్రీకృత రాజకీయాధికార శక్తి అసలే లేదు. పర్యవసానంగా యవనుల కత్తికి ఎదురులేక వారు దేశాన్ని యథేచ్ఛగా దోచుకున్నారు. ఇక్కడి సిరిసంపదలను, స్త్రీలను అపహరించడం, ప్రతిఘటించినవారిని తమ వాడి కత్తుల కెరగావించడం నిరాఘాటంగా సాగిపోయింది; సర్వసామాన్యమై పోయింది. ఢిల్లీలో గురు తేగ్ బహదూర్ చేసిన బలిదానం చరిత్రలో ఈ పరిణామానికి ఒక ప్రబల నిదర్శనం. ఒకవైపు అంతఃకలహాలలో, స్వీయ మహత్వాకాంక్షలలో సామంత రాజులు నిమగ్నమై వుండగా, మరోవైపున బలంగా తాకిన విదేశీ దురాక్రమణలు, అత్యాచారాలతో భారతీయ సాంఘిక వ్యవస్థ, దాని ఆదర్శాలు ఛిన్నాభిన్నమైపోయినాయి. ఇంకా స్వదేశీ అగ్రకులస్తులచే ఉపేక్షకు, అవమానాలకు తోడుగా విదేశీ దురాక్రమణదారుల వత్తిళ్లకు కూడ గురవడంతో సామాన్య ప్రజల స్థితి తిరగలిలో గింజల చందంగా అసహ్యంగా, దుర్భరంగా రూపొందింది.

భారతీయ రాజుల అంతిమ పరాజయానికి, యవనుల నిశ్చిత విజయానికి సూచనగా 12వ శతాబ్దంలో కుతుబుద్దీన్ (ఐబక్) ఒక ముస్లిం రాజ్యం స్థాపించాడు. దానితో కేంద్ర రాజకీయాధికారం హిందువుల చేతుల నుండి ముస్లింల చేతికి మారింది. దురాక్రమణల క్రమంలో అనేక

దోపిడీలు, మారణహోమాలు, అత్యాచారాల దరిమిలా చివరకు యవన రాజ్యం స్థిరపడింది. అంతటితో "ఇకపై మనమూ ఈ దేశీయులతో కలిసిమెలసి వుండవల్సిన వారమే" నన్న భావం కూడ ముస్లిం ప్రభువుల హృదయాలలో జనించింది. అందువల్ల దురాక్రమణ యుద్ధాలు, దాడులు ఆగిపోయినవి. అయితే అందుకు బదులుగా మత యుద్ధాలు మొదలైనాయి. వారు పెట్టుకున్న "రాజ్యాక్రమణ, మత ప్రచారం" అన్న రెండు లక్ష్యాలలో ఒకటి పూర్తయింది. రెండవది మిగిలివుండింది. దానితో కుదురుకున్న సామ్రాజ్యాన్ని మరింత గట్టిపరచుకోవడానికి, మత ప్రచారాల కొరకు యుద్ధాలు జరగసాగినవి. మత యుద్ధాలు, సామూహిక హత్యలు, హింసాద్వేషాలు హద్దుమీరిపోయినవి. ఆ కారణంగా ప్రజల ధన, మాన, ప్రాణాలకు ఇసుమంతైనా రక్షణ లేకపోయింది. ఇక ధర్మరక్షణ, సంఘ సంస్కరణల సంగతి చెప్పనేల? నిర్విరామంగా, నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా హత్యాకాండలు, హింసాచర్యలు అనునిత్యం జరుగుతూంటే, ఇక్కడి పూజామందిరాలు విధ్వంసమవుతూ, పూజ్య పురుషులు అవమానాలపాలు అవుతూంటే దేశప్రజలు వాటిని నిస్సహాయంగా చూచి, సహించి ఊరుకోవడం తప్పితే మరెలాంటి ప్రతిక్రియ చేయలేకపోయారు. కింకర్తవ్యతా విమూఢులై, నిరాశా నిస్పృహలతో నిస్సహాయులై, అనాథలై సతమతమవుతూండినారు. కరడుగట్టిన వర్ణాశ్రమ వ్యవస్థలో దీనంగా మగ్గుతూవుండినారు.

ఏదెలావున్నా యవనుల రాకవల్ల సమాజంలో చెలరేగిన సమస్యలకు ఎలాంటి రాజకీయ పరిష్కారమూ లభించక పోవడం వల్ల దేశ వాతావరణం నిరాశా నిస్పృహలతో నిండిపోయింది. ఆ నిరాశా వాతావరణంలో సామాన్య ప్రజలు భూత, ప్రేత పూజలకు, మంత్రతంత్రాల మహిమలకు, శాపతాపాది మూఢనమ్మకాలకు వశులవుతుంటే, కొందరు బుద్ధిమంతులు మాత్రం ఒక మెరుగైన వ్యవస్థ అన్వేషణలో నిమగ్నులైవుండినారు. నాటి కాలం అపేక్షిస్తున్న మార్పుకూడ అదే. అలాంటి సంకటకాలంలో దైవజ్ఞుడు, దూరద్రష్ట, సంఘసంస్కర్త అయిన ఆచార్య శ్రీ రామానందుడు అవతరించాడు. అంధకారంలో ఆశాజ్యోతి వెలిగించాడు.

* * *

# 3

# మధ్యయుగాల్లో భారత సమాజం

ప్రపంచంలోని అతి ప్రాచీన సంస్కృతుల్లో భారతీయ సంస్కృతి ఒకటి. ఈ సంస్కృతికి పుట్టువనరు వేద చతుష్టయం. ఆ వేదాలలోనే భారతీయ సంస్కృతి రూపురేఖలు, గుణగణాలు, అర్థ ప్రయోజనాలు ఇత్యాదులన్నీ సవివరంగా వర్ణింపబడినాయి. భారతీయ సంస్కృతికి ప్రధాన లక్షణాలయిన 'మానవ సమానత్వం', 'మనుషులపట్ల మమతానురాగాలు' అన్నీ ఆ వేదాలలోనే నిహితమైవున్నవి. దానినే వైదిక సంప్రదాయమన్నారు. మానవులంతా సోదరభావంతో మెలగాలన్నది దాని ప్రధాన ధ్యేయం. వైదికయుగంలో కులమత భేదాలు లేవనీ, జీవనోపాధికిగాను ఎవరైనా ఏ వృత్తినైనా అవలంబించవీలుండేదనీ గమనిస్తాము. 'సర్వే సంతు సుఖినః, సర్వే సంతు నిరామయాః' అనేది ఆ సంస్కృతి ప్రధాన నినాదం. తదనుగుణంగానే,

మిత్రస్య మా చక్షుషా సర్వాణిభూతాని సమీక్షంతామ్
మిత్రస్యా హమ్ చక్షుషా సర్వాణిభూతాని సమీక్షే
మిత్రస్య చక్షుషా సమీక్షే మహే.

నన్నందరూ స్నేహంగా చూడాలి. నేనందరినీ మిత్రులుగా చూచుకోవాలి. మనమందరం పరస్పర స్నేహంతో మెలగాలి.

అని అన్నారు. ఇలాంటి ఉదాహరణలు అనేకం వున్నాయి.

అయితే మధ్యయుగాలనాటికి ఆ వైదిక సంస్కృతి, దాని ఆదర్శాలు లుప్తమైపోయినవి. సంఘంలో కేవలం శాస్త్ర-తర్కవాదం, ఛాందస బ్రాహ్మణవాదం సర్వసాధారణంగా చెలామణీ కాసాగినవి. మఠగురువులు, కర్మకాండలు అనుష్ఠించే పండితులు, పూజారులు, పురోహితులు పూర్వకాలపు సాంఘిక వ్యవస్థను ఎంతో వికృతంగా మార్చివేశారు. కఠోరమైన నియమనిబంధనలు విధించారు. వాటి అమలుకోసమని కఠినమైన ఆంక్షలు విధించారు. 'జ్ఞాన భక్తి' ప్రబోధించడంలో

పైకి అద్వైతం ప్రతిపాదించారుగాని, ఆచరణలో మాత్రం దాన్ని లేశమాత్రమైనా ప్రదర్శించలేకపోయారు. పర్యవసానంగా "మానవులంతా సమానులు" అన్న వైదిక భావన లుప్తమైపోయింది.

సరిగదా ఒకే మతస్థులైనా అనేక కులాలు, వాటిలో ఉపకులాలు ఏర్పడ్డాయి. శూద్రులని, అంటరానివారని, కడజాతివారని పేర్లుపెట్టి కోట్లాది సాటి మానవులను వెలివేసి పూర్తిగా ఉపేక్షించసాగారు. అంతకుపూర్వం గుణకర్మల ఆధారంగా ఏర్పడిన వర్ణవ్యవస్థ యిప్పుడు జన్మ ప్రధానమయింది. పవిత్ర గ్రంథాలు, పావనక్షేత్రాలు, ధర్మశాస్త్రాలు పూజారులు, పురోహితులు, కర్మకాండపండితుల అధికార భుక్తమయినవి. ఉపేక్షితులైన కోట్లాది మానవులకు వాటి గాలిసైతం సోకనీయలేదు. పైగా పరమార్థ మెరిగిన జ్ఞానులు, భక్తి భావాలుగల భక్తవరులు కేవలం అగ్రవర్ణాల్లోనేగాని నిమ్నజాతుల్లో పుట్టరు, పుట్టరాదని ఘంటాపథంగా వాదించారు. శిలాక్షరాలు చెక్కించారు. ఈ విధంగా వీరు మధ్యయుగాలలో పూజాస్థానాలు, పవిత్ర తీర్థాలు, పవిత్ర గ్రంథాలు, ధర్మశాస్త్రాలు అన్నింటిపై తమ గుత్తాధికారం (monopoly) ఏర్పాటు చేసుకుని మిగతా ప్రజలందరినీ వాటినుండి వంచితులు గావించారు. ఒక్కమాటలో భుక్తి, ముక్తి మార్గాలన్నీ తమ పరం చేసుకున్నారు. ఇక ఉపేక్షితులకు విడిచిపెట్టింది ఒక్క భక్తిమార్గం మాత్రమే. అదీ కొన్నిషరతులపై. ముక్తిమార్గం దరిదాపులకు ఈ బహిష్కృతులు రాకూడదన్నారు. అలా రావడానికి వారికి అధికారమే లేదన్నారు. ఇంకా వారిని గుళ్లలోకి రాకూడదన్నారు. దైవదర్శనం చేసుకునే అర్హత లేదన్నారు. జలాశయాలకు రానివ్వలేదు. నగరవీధుల్లో నడవనీయలేదు. ధర్మగ్రంథాలు తాక కూడదన్నారు. వేద శాస్త్రాలు వినకూడదన్నారు. ఒకవేళ ఎవరైనా పొరపాటున వింటే వారి కర్ణపుటాలలో సీసం కరిగించి పోయమని శాసించారు.

ఇవన్నీ భౌతిక ప్రపంచానికి సంబంధించిన విషయాలు ; లౌకిక జీవితానికి సంబంధించిన గాథలు. వీటిని మించిన విచిత్రం ఆ కాలంలో మరొకటుండింది. ఈ మూఢగురువుల చండశాసనం భౌతిక-ఆధ్యాత్మిక, లౌకిక-అలౌకిక హద్దులను దాటి సాగింది. చివరకు 'భక్తులు, సాధకులు, కారణ జన్ములు' అనబడే వారిని ఫలాని, ఫలాని కులాలలోనే పుట్టించాలి,

ఫలాని ఫలాని కులాలలో పుట్టించరాదు సుమా!... అంటూ ఆదిమధ్యాంత రహితుడు, జగన్నాటక సూత్రధారి, విశ్వనియంత అయిన ఆ సృష్టికర్తనే శాసింపసాగారు. చూచారా... ఛాందస శాస్త్రవాదం, కర్మకాండ పండితుల చండశాసన ప్రభావం ఎలాంటిదో?

భక్తులు, జ్ఞానులు, కారణ జన్ములు అయిన మహాపురుషులు బహిష్కృత జాతుల్లో జన్మింపరాదని నాటి శాస్త్రవాదం. అలాగని సనాతన వాదులు, ఛాందస పండితులు ఎంతగా శాసించినప్పటికీ, పవిత్ర గ్రంథాలు, ధర్మశాస్త్రాలపై ఈ బహిష్కృతులు, ఉపేక్షితుల దృష్టి పడకుండా ఎంతగా కాపాడుకొన్నప్పటికీ, 'తత్వజ్ఞానం, భగవద్భక్తి' అనే ఆ దివ్యశక్తి ఉక్కు తెరల్ని సైతం ఛేదించుకొని సర్వత్రా వ్యాపిస్తుందని, సర్వుల్లోనూ ప్రవేశిస్తుందని, ఫలితంగా బహిష్కృతుల్లో కొందరు ఆత్మోద్ధరణ చేసుకోగల్గుతారని పాపం వారు గ్రహించలేకపోయారు. ఎంత అజ్ఞానం, ఎంత మూర్ఖత్వం!

ఇలాంటి అసాంఘిక, సంకుచిత భావాలతో, కుల, మత, జాతి విభేదాలతో, కొద్ది-గొప్ప, ఉచ్చ-నీచ తారతమ్యాలతో సతమత మవుతూండినది మధ్యయుగాలనాటి సమాజం. అటువంటి సమయంలో విదేశీయుల దురాక్రమణలు మొదలైనవి. వాటి పర్యవసానంగా నవాగంతుక విదేశీయులకు, దేశప్రజలకు మధ్య సంఘర్షణ ప్రారంభమైంది. అవి రాజ్యాక్రమణకు, మత ప్రచారానికి రెండు విధాలుగా జరిగిన ఘర్షణలు. ఒకదాన్నిమించి మరొకటి మహా దారుణంగా సంభవించాయి. వాటితో బాటు కులాల నడుమ, జాతుల మధ్య, వివిధ మత విశ్వాసాల నడుమ, వివిధ సంస్కృతుల మధ్య ఘోరమైన పోరాటం చెలరేగింది. నవాగంతుక విదేశీయులదే అన్నిటా పైచేయి అయి జయలక్ష్మి వారినే వరించింది. దేశ ప్రజలకు అపజయం, అవమానాలే దక్కినాయి. ఇరు వర్గాలమధ్య ద్వేషభావం పెచ్చరిల్లింది. ఒకరి దృష్టిలో మరొకరు మ్లేచ్ఛులు అయితే, ఆ మరొకరి దృష్టిలో వీరు కాఫిరు లయ్యారు. పర్యవసానంగా హిందూ ముస్లింల నడుమ పెద్ద అఖాతమేర్పడింది. మౌల్వీలు, ముల్లాలు గాని, పండితులు, పురోహితులుగాని ఆ అఖాతాన్ని పూడ్చలేకపోయారు. ఇక పాలకులకైతే అదెంత మాత్రం తరం కాకపోయింది. ఫలితంగా దేశంలో రాజకీయ కల్లోలం, మతపర బీభత్సం, సాంఘిక అశాంతి నెలకొని వుండినవి.

అటువంటి శోచనీయ స్థితిలో నవాగంతుకులకు, దేశప్రజలకు నడుమ ఏర్పడిన అఖాతాన్ని పూడ్చడానికి, అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి జ్ఞానజ్యోతిని ప్రకాశింప జేయడానికి, సంకీర్ణతను రూపుమాపి విశాలభావాలు వ్యాపింప జేయడానికి, దైవజ్ఞుడు, మహామనీషి, సంఘ సంస్కర్త, ఆధ్యాత్మిక విప్లవకారుడు అయిన ఆచార్య శ్రీ రామానందుడు, ఆయన శిష్యమండలి అవతరించారు. తమ నిష్ఠాపూర్వక సాధనల ద్వారా, నిరహంకార ప్రవృత్తి, నిర్మల చరిత్ర, నిష్పాక్షిక బోధనల ద్వారా వారు పరంపరాగత కాలప్రవాహానికి ఎదురీది సంఘంలో మహత్తర పరివర్తన తీసుకువచ్చి చరిత్రలో తమకని ఒక ప్రత్యేక అధ్యాయం రూపొందించు కొనగలిగారు. అదొక దైవ సంయోగమని చెప్పుకోవాలి.

* * *

# 4

# శ్రీ రామానందుడు, ఆయన శిష్యమండలి

శ్రీ రామానందుడు ఆచార్య శ్రీరామానుజ సంప్రదాయానికి చెందిన ఆచార్యుడు. విశిష్టాద్వైతవాది. పుష్పసదనశర్మ, సుశీలాదేవి దంపతులకు ప్రయాగలోజన్మించాడు. వారణాసి, స్వామీ రాఘవానందుని ఆశ్రమంలో విద్యాధ్యయనం చేసి ఆయన వద్దనే దీక్షపుచ్చుకున్నాడు. శ్రీ రామానందుని ప్రఖర బుద్ధికి, గంభీర అధ్యయనానికి మెచ్చి స్వామి రాఘవానందుడు అతనికి 'ఆచార్య' బిరుదునిచ్చి సన్మానించాడు. అనంతరం రామానందుడు దేశాటనగావించి వైష్ణవ భక్తిమార్గం, దాని వివిధ సంప్రదాయాలను గురించి అధ్యయనం చేసి ఎంతో అవగాహన చేసుకున్నాడు. సహజంగా మౌలిక చింతకుడవడం వలన తన మేధావిభవంతో ఆచార్య శ్రీరామానుజుని కర్మకాండా విధానంలోంచి భక్తి, ఉపాసనలను, దక్షిణాది ఆళ్వారుభక్తుల భాగవత సంప్రదాయాన్ని స్వీకరించాడు. ఆ విధంగా మానవసమానత్వం, సమాజ ఐక్యత, భావాత్మిక సమైక్యత, దైవభక్తి ఆధారాలుగా ఒక విశిష్ట సంప్రదాయం నెలకొల్పాడు. అప్పటివరకు భక్తిమార్గంలో కూడ వుండిన కుల కట్టడులు, విధి నిషేధాలు తొలగించి విశాలభావాలు, ప్రగతిశీల, ఉదారవాద సిద్ధాంతాలు ప్రచారం చేశాడు. ఆయన ఒక దూరద్రష్ట, స్వతంత్ర చింతకుడు. యుగావసరాలను గమనించి తదనుగుణంగా నాటి సమస్యలకు పరిష్కారం అన్వేషించిన, సమాధానం యివ్వబూనిన ప్రథమ ప్రగతిశీలి. తన సహజప్రతిభ, మేధోశక్తుల ద్వారా యుగపురుషుడయ్యాడు. సమాజంలో పాదుకుపోయివున్న దురాచారాలను, సంకుచిత భావాలను గ్రహించి సర్వజన సులభం, కుసంప్రదాయ వ్యతిరేకం అయిన ఒక విశాలమార్గాన్ని– భక్తిమార్గాన్ని – ప్రశస్తంగావించాడు. భక్తి క్షేత్రంలో అనురాగయుతమైన సమర్పణభావం అవసరమన్నాడు. జాతి, మత, కుల ప్రమేయం లేకుండా స్త్రీ పురుషులందరూ భక్తిమార్గానికి అర్హులేనని చాటిచెప్పాడు. అలా ఎలుగెత్తి చాటడమేకాదు అందరకూ భక్తిక్షేత్రంలో ప్రవేశం కల్పించే

నిర్మాణాత్మక కార్యక్రమాలు చేపట్టాడు. భక్తి సంప్రదాయం ఆధారంగా నాటి కరడుగట్టిన మత కట్టడులను శిథిలపరచి, కర్మకాండ విధానంలోని సంకీర్ణతలను సడలింపజేసి విశాల భావాలు వ్యాపింపజేసిన ప్రథమ ప్రగతిశీలి, సంఘసంస్కర్త అయినాడు. ఆయన ఎంత విద్వాంసుడో అంత ఉదారుడు. తన ప్రగతిశీల భావాలు విరివిగా వ్యాప్తిచేయడానికిగాను కొద్దిమంది కులీనుల భాషయైన సంస్కృతాన్ని వదలి అశేష ప్రజల వాడుకభాషలో బోధలు చేయసాగాడు. నాడు శ్రీరామచంద్రుడు సముద్రానికి వారధి నిర్మించినట్లు లోకకళ్యాణార్థం పీడిత తాడిత జనులందరూ భవసాగరం తరించడానికి అనువుగా మన శ్రీ రామానందుడు భక్తిమార్గమనే సేతువు నిర్మించాడు. ఆ విధంగా 'మానవులంతా సమానమే' నన్న వైదిక సంప్రదాయాన్ని పునరుద్ధరిస్తూ ఒక నవ్యనూతనమైన విప్లవమార్గం సృజించాడు. *'జాతి పాంతి పూఛో నహి, హరికో భజే సో హరికా హోయ్'* అనే సూక్తిని వాడుక గావించాడు. అందుకే ప్రఖ్యాత పరిశోధకులు, పండిత శ్రేష్ఠులు అయిన శ్రీ పరశురామ చతుర్వేదిగారు, 'హరిభక్తి మాధ్యమంగా కులమతాది జాతివాదాన్ని శిథిలపరచి కులం తక్కువవారనబడే వారినిసైతం కులీనులతో సమంగా స్వీకరించాడు. ఈ విధంగా సర్వమానవుల దృష్టిని తన మార్గానికి మరల్చగలిగాడు శ్రీ రామానందుడు' అని కొనియాడారు.

యుగప్రవర్తకుడైన శ్రీ రామానందుని వ్యక్తిత్వం, దైవజ్ఞత, మానవప్రేమ, సహృదయత, ప్రగతిశీల భావాలు అప్పటి ప్రజలందరినీ ప్రగాఢంగా ప్రభావితుల్ని చేశాయి. అందువల్ల పేద–పెద్ద, దరిద్రులు–ధనికులు అనే తేడాలు లేకుండా కులమతాల తేడాలు లేకుండా సమస్త జాతులవారు ఎలాంటి అరమరికలు లేకుండా ఆచార్య శ్రీ రామానందుని శిష్యులయ్యారు. ఆ విధంగా ఉదారభావాలు, మానవతావాదాలను జీర్ణింపజేసుకున్న సాధుసన్యాసుల, సద్గృహస్థుల, భక్తప్రజల విశాలవాహిని – మానవతావాద స్రవంతి – ఒకటి నాటి సమాజంలో ఉద్భవించి ప్రవహించింది. అలా తయారైన శిష్యుల సంఖ్య 500కు మించిందని శ్రీ రామానందుని సమకాలికుడు, సుప్రసిద్ధ ఫకీరు, కాశీవాస్తవ్యుడు అయిన మౌలానా రషీదుద్దీన్ తన ప్రఖ్యాత గ్రంథం 'తజకీరాత్ ఫుకరా'లో పేర్కొన్నాడు. ఆ శిష్యులందరిలో శ్రీ రామానందగురువుకు

పక్కా అనుయాయులై ప్రసిద్ధిగాంచిన వారు పన్నెండుమంది : 1. అనంతానంద్, 2. సుఖానంద్, 3. భావానంద్, 4. సురసురానంద్, 5. నరహర్యానంద్, 6. రవిదాసు, 7. కబీరు, 8. పద్మావతి, 9. పీపా, 10. సేనా, 11. సురసురీ, 12. ధన్నా అనేవాళ్లు. వీరిలో అనంతానంద్, భావానంద్‌లు బ్రాహ్మణులు. రవిదాసు చమార్ (మాదిగ), కబీరు సాలి, ధన్నా జాట్ (కాపు), సేనా మంగలి, పీపా క్షత్రియ కులాలకు చెందినవారు. పద్మావతి స్త్రీవర్గానికి ప్రతినిధిగా భావించవచ్చు. ఈ విధంగా సమాజంలో అన్నికులాలకు చెందినవారు శ్రీరామానందుని ప్రసిద్ధ శిష్యులుగా రూపొందారు. ఈ పన్నెండుమందీ మానవతావాదం, ఉదారభావాలు, ఉన్నత ఆదర్శాలుగల శ్రీ రామానందుని సంస్కారోద్యమాన్ని ఉత్తరాదిన విరివిగా ప్రచారం చేసారు. ప్రజలకు ధర్మబోధ చేసారు. ఈ కారణంగానే ఈ ద్వాదశభక్తులు ప్రపంచంలో వ్యాపించిన అజ్ఞానాంధకారాన్ని పారదోలడానికి ఉదయించిన 'ద్వాదశాదిత్యు'లని ప్రఖ్యాత స్వామి అగ్రదాసు కొనియాడారు.

శ్రీరామానందుని శిష్యులలో అధిక సంఖ్యాకులు ఏదో ఒక నిమ్నకులానికి చెందినవారేనని గమనించాము. వీరంతా నిరాడంబరులు, నిష్కాములు అయిన, దయాళువులు, ఉదార హృదయులు, పరోపకారులైన సాధుపుంగవులు, సాధక శ్రేష్ఠులు. నాడు నిరాఘాటంగా చెలామణీ అవుతూండిన సాంఘిక, మతవిషయక సంకుచితతత్వాలు, అత్యాచారాలకు ప్రతిక్రియయా అన్నట్లుగా వీరంతా ఒక భక్తమండలిగా ఏర్పడి నాటి సమాజ వికృతరూపాన్ని ఎండగట్టారు. జాతి, కుల, మత అంతరాలు, స్పృశ్యాస్పృశ్యతాభావాలు లేని సమసమాజం – ఒక నవసమాజం నిర్మింప యత్నించారు. సుప్రసిద్ధ పాశ్చాత్య పరిశోధకుడు డా. గ్రియర్‌సన్ మాటల్లో, 'స్వామి శ్రీ రామానందుని భక్తిపుద్యమం సువిశాల భారతదేశంలో నలువైపులా విద్యుత్ ప్రవాహంలా వ్యాపించిపోయింది. నిజానికది భారతీయ ప్రాచీన సంస్కృతి పునరుద్ధరణకు జరిగిన ప్రబలమైన ప్రయాస.' ఆ ప్రయాసను ఎంతో అధికంగా చేసి, దైవజ్ఞుడైన తమ గురువు బోధలకు అనుగుణంగా సమాజంలో సానుకూల పరివర్తన తీసుకురావడంలో కృతకృత్యులయినారు ఈ భక్తమండలివారు. అంతేకాదు, సహజ ప్రతిభ, గురూపదేశం, అనవరత సాధన, కఠిన తపస్సు, అశేషత్యాగాల మాధ్యమంగా

అంతదనుక 'ఉక్కుగోడల మధ్య, వజ్రవలయాలలో' దాగియున్న ఆ 'పరతత్వాన్ని', ఆ 'సూక్ష్మజ్ఞానాన్ని' గ్రహింపగలిగారు. ఆ 'పరంజ్యోతి'ని దర్శింపగలిగారు. ఆ 'దివ్యవాణి' వినగలిగారు. అంతటితో ఆగక తాము తెలుసుకున్న ఆ పరిజ్ఞానం గురించి, ఆ పరతత్వం విషయమై అన్నిజాతుల వారికి నిర్భయంగా తెలియజెప్పారు. తాము దర్శించిన ఆ పరంజ్యోతిని అందరిలోను ప్రకాశింపజేసారు. తాము విన్న ఆ అనశ్వరనాదం సకల మానవులకు వినిపించారు. ఆ విధంగా ఈ మధ్యయుగపు భక్తమండలి తాము తరించారు, యితరులనూ తరింపజేసారు.

ఇక్కడ మనం మరువరాని, బాగా గమనించవలసిన విషయం ఏమంటే ఉపనిషత్తుల కాలంనుండి నవయుగ వైతాళికుడు రాజా రామ్మోహన్ రాయ్ వరకుగల సుదీర్ఘకాల అవధిలో, ఆ అన్ని శతాబ్దాల కాలంలో శతశతాధిక సాధకులు తపించిన విశాల సాధనాక్షేత్రంలో మన మధ్యయుగాల నాటి భక్తమండలిదొక అధ్యాయం – విశిష్టమైన అధ్యాయం. విప్లవ చింతనాపరుడు, దైవజ్ఞుడు శ్రీరామానందునితో ప్రారంభమై, ఆయన శిష్యమండలి సాధనలతో నిండిన ఈ అధ్యాయం ఒక నూతన జీవన పద్ధతిని, విలక్షణ వాణులను, నవీన భంగిమలను, నవ్యదృక్పథాన్ని వెల్లడి చేస్తుంది. ఈ భక్తులందరు సమకాలీన దేశకాల పరిస్థితులను నిష్పాక్షిక దృష్టితో వీక్షించి, సంపూర్ణంగా అవగాహన చేసుకున్నారు. వారు త్యాగం, సహనం, సాధనలతోకూడిన అనపేక్షాయుత జీవితం గడిపారు. దానితో వారు కడు నిర్భయులైనారు. అందువల్ల పరంపరాగతంగా వచ్చే భూస్వామ్య సంస్కృతిని, మూఢశాస్త్రవాదాలను వీడి ప్రజాసంస్కృతి, ధర్మాలను చేపట్టారు. గురు శ్రీరామానందుడు సైతం జాత్యభిమానం వీడాడు. సంస్కృత భాష త్యజించాడు. ప్రజలభాష స్వీకరించాడు. ఈ విధంగా గురుశిష్యులందరూ ప్రజల భాషను, ప్రజల ధర్మాన్నే స్వీకరించారు, వాటినే గౌరవించారు. ప్రజలకు వాటి మాధ్యమంగానే బోధలు చేశారు. వాటిద్వారానే అంతదాకా పాలక, పాలితవర్గాలన్నింటిలోను రూఢిగా చెలామణీ అవుతూండిన అనేక అంధ విశ్వాసాలను, అపోహలను, భ్రమలను పటాపంచలు చేయగలిగారు, మనిషికీ, మనిషికీ; కులానికీ, కులానికీ; మతానికీ, మతానికీ; జాతికీ, జాతికీ మధ్యపెరిగిన కపటపూరితమైన, కృత్రిమమైన అడ్డుగోడలు కూలదోసి వ్యవహారాచరణలో పరస్పర

సత్సంబంధాలు నెలకొల్పారు. ఆర్థికంగా ఎంత అవసరమనుకున్నప్పటికీ ఈ కులవ్యవస్థ సంఘంలో అభ్యుదయం, వ్యక్తుల్లో నిర్మలత్వం తేజాలవని నిర్మొగమాటంగా చెప్పారు. ఆ విధంగా పాలకవర్గాలకు, పాలిత ప్రజలకు నడుమ ఆదర్శప్రాయమైన సమన్వయ సామరస్యాలు నెలకొల్పగలిగారు. "మానవులంతా సమానం. ఎన్నోజన్మల అనంతరం మనకీ మానవ జన్మ లభించింది. అలాంటి ఈ మానవదేహాన్ని దుర్వినియోగం చేయరాదు. ఈ శరీరాన్ని మనకు లభించింది లభించినట్లుగా పవిత్రంగా వుంచి అవసానకాలంలో ఆ పరమేశ్వరునికి అర్పించుకోవాలి" అంటూ ఒక ఉన్నత మానవతావాదాన్ని హిందువులు, ముస్లింలు ఉభయవర్గాలకు నచ్చజెప్పారు. ఉభయులకూ అనుకూలము, అంగీకారయోగ్యమైన ఏకేశ్వరోపాసన, నిరాకారోపాసనలను ప్రబోధించారు. ఇలా ఇరువర్గాల మధ్య అఖాతాన్ని పూడ్చసాగారు. స్వర్గీయ హజారీప్రసాద్ ద్వివేదిగారు అన్నట్లు, "అస్తవ్యస్త స్థితిలోనున్న నాటి సమాజాన్ని సరిదిద్దారు; నిరాశా నిస్పృహలతో నిస్సహాయంగా అలమటిస్తున్న హిందూ సమాజానికి జీవం, జవం పోసి దృఢంగా నిలబెట్టగలిగారు." ఇదే ఈ భక్తమండలి సాధించిన ప్రధాన విజయం.

ఈ మధ్యయుగ సాధకుల ప్రత్యేకత, విశిష్టతలను వివరిస్తూ ప్రఖ్యాత రచయిత, చరిత్రకారుడు శ్రీ రాంగేయ రాఘవ్ యిలా చక్కగా వ్యాఖ్యానించాడు;

> "అప్పటికింకా కార్ల్ మార్క్స్ పుట్టలేదు. గతితార్కిక భౌతికవాదం తలయెత్తలేదు. అయినా నాటి మానవులు అన్యాయానికి, అధర్మానికి విరుద్ధంగా పోరాటం జరుపుతూనే వుండినారు. ఆ పోరాటపు సింహనాదాలే మనకు మధ్యయుగాల నాటి భక్తివాణిలో వినిపిస్తున్నాయి. ఆ గంభీర స్వరాలన్నీ విమ్నజాతుల విముక్తి కోసం పెల్లుబికిన ఎలుగులే. సర్వమానవ సమానత్వమే ధ్యేయమైన వైష్ణవ చింతనే ఈ భక్తివాణికి మూలం."

* * *

# 5

# రవిదాసు అవతరణ

ఆచార్య శ్రీరామానందుని అనేక శిష్య సముదాయంలో భక్తిభావంలో, సాధనలో పేరెన్నికగన్నవాళ్లు, ఆయన ప్రగతిశీల భావాలు, ఉదారాశయాలను ఉత్తరాదిన విరివిగా వ్యాపింప జేసినవారు, నాటి భూస్వామ్య సంస్కృతి, సంకుచిత సాంఘిక వ్యవస్థలకు, సనాతనులు, ఛాందసుల కరడుగట్టిన ఆచారవ్యవహారాలకు వ్యతిరేకంగా పోరాడి సమాజంలో ప్రగతిశీల పరివర్తన తెచ్చిన వారు ద్వాదశ భక్తులని తెలుసుకున్నాం. వీరిలోనూ తమ కఠిన సాధన, విశిష్ట స్వభావాలరీత్యా ప్రధానులుగా గణుతికెక్కినవారు కబీరు, రవిదాసులు. ఈ ఉభయులలోనూ రవిదాసే వయసులో, సాధనలో పెద్ద అని పేరుపొందాడు. అయితే ఈ విషయమై పండితుల్లో ఏకీభావం కుదరక వివాదం చెలరేగింది. కాని కబీరే స్వయంగా, "భక్తుల్లో ఉత్తమ భక్తుడు రవిదాసు" అని ప్రశంసించడంబట్టి రవిదాసు పెద్దవాడన్నదే సరియని తోస్తున్నది. సుప్రసిద్ధ పరిశోధకుడు, సాహిత్యవేత్త స్వర్గీయ హజారీ ప్రసాద్ ద్వివేదీ కూడ వయస్సులో, సాధనలో రవిదాసే పెద్ద అని నిరూపిస్తూ అందుకు తార్కాణంగా యిలా పేర్కొన్నాడుః

కబీరు నొకసారి ఎవరో బ్రహ్మజ్ఞానం గురించి ప్రశ్నించగా,

మైతో ఆయా మా కీ గోద్ మే, క్యా జానూ మార్గ్ క్యా హైాయ్ ।
రాహ్ పూఛో రైదాస్ సే, జిన్ గఠరీ లాయా ఢోయ్ ।

*నేను తల్లి ఒడిలో కూర్చుని వచ్చినవాడిని, నాకేమి తెలుసు? రవిదాసు నడగండి. తల్లియిచ్చిన సరకుల మూట మోసుకు వచ్చిన వాడాయన. ఆ మార్గ మాయనకు బాగా తెలుసు*

నని సమాధానమిచ్చాడట. ఈ దోహా అర్థాన్ని స్వర్గీయ ద్వివేదీజీ ఇలా విశదం చేశారుః

తల్లి ఎక్కడికైనా ఇల్లు బైలుదేరి వెళ్లేటప్పుడు చంటిబిడ్డను చంకనెత్తుకొని చిన్న చిన్న సరకుల మూట ఎడబిడ్డ నెత్తిన పెడుతుంది. ఆ బిడ్డ మూట నెత్తిన బెట్టుకుని వెంట నడుస్తాడు. కనుక దారిలో వుండే గొప్పలు, గోతులు, ఒడుదుడుకులన్నీ ఆ బిడ్డకే బాగా తెలుస్తాయి.

అలాంటివాడు రవిదాసు. జీవితమంతా కష్టపడి బతికాడు. సొంతకాళ్లపై నిలబడి బతుకుతూ కష్టతరమైన భక్తిమార్గంలో సాధన చేశాడు.కనుక ఐహిక జీవితం, ఆధ్యాత్మిక సాధన రెంటిలోని కష్టసుఖాలు, లావాదేవీలు బాగా తెలిసిన అనుభవజ్ఞుడన్నమాట.

పీడిత తాడితులు, దీనులు, దుఃఖితులు అయిన నిస్సహాయులకు తోడ్పడేవాళ్లే నిజమైన భక్తులని, అటువంటి నిష్కామ, నిస్వార్థ సేవకులకు సునాయాసంగా దైవదర్శనం అవుతుందని పేర్కొంటాడు మహారాష్ట్ర భక్త శిఖామణి తుకారాం. ఈ విధంగా సరియైన సాధుసన్యాసులు, భక్తులు ఎవరో నిర్వచిస్తాడాయన. మధ్యయుగాలనాటి భక్తులంతా ఈ నిర్వచనానికి సరిపోయేవారే. మరి వారందరిలో మిన్న, స్పందనశీల హృదయుడు, గొప్ప అనుభూతిగలవాడు భక్త రవిదాసు. 15, 16 శతాబ్దాల సంధికాలంలో, కొత్తపాతల కలయిక వేళలో, ఒక విధంగా సాంస్కృతిక పునరుజ్జీవనకాలంలో జన్మించి, అప్పటి పాలకవర్గాల దౌర్జన్య ప్రవృత్తులు, పాలితుల దీనావస్థలు, ప్రజల దుస్థితులు అన్నీ తోటివారిపై అపారమైన సానుభూతి మమకారాలతో వీక్షించి అవగాహన చేసుకున్నాడు. అంతకు పూర్వకాలంనుండి వస్తున్న సంకుచిత కులమత కట్టుబాట్లను అధిగమించి ఒక విశిష్ట జీవనాదర్శం నెలకొల్పుకున్నాడు. ఒక నవ్య నూతన మార్గం ఎన్నుకొన్నాడు. తదనుగుణంగా సాంఘిక, మతవిషయిక సంకుచితతత్వాలకు అతీతంగా వుంటూ, సకల ప్రజలకూ తన సమన్వయ వాణి, సమతావాణి - విప్లవవాణి వినిపించాడు. నిద్రావస్థలో వున్న నాటి సమాజాన్ని తట్టి లేపాడు. ఆ భక్తుని వాణి సరళంగా, మధురంగా, ప్రజల హృదయాల్లో అపూర్వ శ్రద్ధాభక్తులు ప్రేరేపించేదిగా వుండేది. దానికితోడు ఆయన సరళ స్వభావి, నిరాడంబరుడు, నిరహంకారి, మితభాషి, వ్యవహారకుశలుడు. తన మతాన్ని ప్రతిపాదించడమే తప్ప అన్యులను దూషించువాడు గాదు; వారి మనస్సు నొప్పించువాడు గాదు. అంటే అతి నిరహంకారి, పరమ అహింసావాది అయిన వైష్ణవుడన్నమాట. ఆ కారణంగానే తన తోటి భక్త వరులతోబాటు సామాన్య ప్రజలందరికీ కూడ మహాత్మ రవిదాసు ఆదర్శప్రాయుడు, గౌరవనీయుడు అయినాడు.

యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి ... ...
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే

అనే గీతా వాక్యానుసారంగానే మహాత్మ రవిదాసుని అవతరణ జరిగిందేమో! ఎందుకంటే మతవిషయికంగా, సాంఘికంగా, రాజకీయంగా, ఒకటేమిటి అన్ని విధాలా మానవ జీవితమే ఘోరవిపత్తులో చిక్కుకుని వుండింది. దైవచింతన, స్వతంత్ర ఆలోచన పూర్తిగా లుప్తమై యుండినవి. పరంపరాగత మూఢ విశ్వాసాలు, దురాచారాలు, సంకుచిత తత్వాలకు స్వేచ్ఛా రాజ్యంగా వుండింది. అటువంటి తరుణంలో అసహ్య సాంఘిక బంధనాలను తెంచి మానవ జీవితానికి విముక్తి ప్రసాదించడానికిగాను మహాత్మ రవిదాసు అవతరించాడు. ఈ విధంగా అంధకారమయ మధ్యయుగాలలో అప్పటి మహామనీషి, విప్లవ చింతకుడు అయిన శ్రీ రామానందునికి తగిన శిష్యునిగా, ఆయన పిదప ఆయన అంతటి యుగకర్తగా కాగలిగినాడు మహాపురుషుడు రవిదాసు.

యుగకర్త రవిదాసు అసమాన సాధకుడు, పరమభక్తుడు, సిద్ధ యోగి ఆ సిద్ధయోగి ఖండన. మండనలు, తిరుగుళ్లలో పడకుండా నేరుగా, సూటిగా ఆ పరమపావన పరాశక్తినే, సర్వద్రష్ట, సర్వవ్యాపి అయిన ఏకేశ్వరుడ్నే ప్రతిపాదించి పూజించాడు. సర్వమానవులకు సమత, సదాచారాలు బోధించాడు. దైవానురక్తి, సత్యాభివ్యక్తి, పరోక్షానుభూతి - యిదే తాను అన్నింటికంటె మిన్నగా ఎంచుకున్న పరమ లక్ష్యం. అందుకోసమే జీవితాంతం సాధన చేశాడు. అందుకే ఆ సాధకోత్తముని గురించి, ఆయన విశిష్టవాణి గురించి ప్రసిద్ధ వైష్ణవ భక్తుడు నాభాదాసు తన "భక్తమాల"లో యిలా వర్ణించాడు:

సందేహగ్రంధి ఖండన నిపునవాని విమల రవిదాస కీ ॥
సదాచార శ్రుతివచన అవిరుద్ధ ఉచార్యో ।
నీర ఖీర వివరన పరమ హంసని ఉర ధార్యో ॥
భగవత కృపా ప్రసాద పరమగతి ఇహ తను పాయీ ।
రాజ సింహాసన బైఠి జ్ఞాతి పరతీతి దిఖాయీ ॥
వర్ణాశ్రమ అభిమాన తజి పదరజ బందహి జా సకీ ।
సందేహ గ్రంధి ఖండన నిపున వాని విమల రవిదాసకీ ॥

సత్యాసత్యాలను వేరుచేసి ఆధ్యాత్మిక రంగంలోని గూఢ సమస్యలను విడమర్చి చెప్పడంలో ఎంతో సహకారి అయిన నిర్మల నిర్దోష వాణి రవిదాసునిది. రవిదాసు బోధలుగాని, ఆచరణ గాని వేదశాస్త్ర

మర్యాదలకు విరుద్ధమైనవికావు. మంచి—చెడ్డలు, పాప—పుణ్యాల విచక్షణ గల, క్షీర నీర న్యాయం ఎరిగిన జ్ఞానులు, మునులందరూ ఆయన భావాలను, బోధనలను అంగీకరిస్తారు, ఆచరిస్తారు. ఈశ్వర కృపవలన రవిదాసు తన జీవితకాలంలోనే పరమగతి పొందాడు. అంటే, జీవన్ముక్తుడయ్యాడు. తద్వారా తన జాతి వైశిష్ట్యాన్ని, ఔచిత్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పాడు. అందుకే గొప్ప సాధకులు, విద్వాంసులు సైతం తమ కులమత అభిమానాలు త్యజించి ఆ పరమ భాగవతోత్తముని పాదరజం శిరసున కద్దుకున్నారు.

దక్షిణాదివారైన నందనారు (తమిళ నాడు), కనకదాసు (కర్ణాటక)లు కూడ యిలాంటి అంత్యజకుల భక్తులేనని యిక్కడ మనం గమనించాలి. ఇటువంటి పరమ భాగవతుడయిన రవిదాసు పుట్టి నేటికి యించుమించు 600 ఏండ్లు గడిచాయి. నేటికి ఆయన విజ్ఞులు, పరిశోధకుల దృష్టికి వచ్చాడు. ఆ సాధకుని కుల, నామ విశేషాలు చర్చనీయాంశాలైనాయి. దేశ విదేశాల పండితులు, పరిశోధకులు ఆయన జీవితం గురించి పరిశోధనలు జరిపారు, జరుపుతూనే వున్నారు. కొన్ని విశ్వవిద్యాలయాలు, పరిశోధనా సంస్థలు ఆయనపై పరిశోధనల్ని ప్రోత్సహిస్తున్నాయి. పట్టా అనంతర అధ్యయనాల కోసమని 'థీసిస్'లు రాయిస్తున్నారు కూడ. అయినప్పటికీ సాధక శ్రేష్ఠుడు రవిదాసు జీవిత వృత్తాంతాలు – పేరు, ఊరు, జననం, మరణం యిత్యాదులు – సరైన రుజువులతో ఇదమిత్థంగా తేలలేదు. ఇది దురదృష్టమేనని భావించాలి.

కనుక ఆయన సమకాలిక భక్తులు, తదనంతర రచయితల ప్రస్తావనలను బట్టి, ఇంకా ప్రచారంలో వున్న జనశ్రుతులను బట్టి, ఇంతవరకు జరిగిన పరిశోధనల ఫలితాలను బట్టి- భక్త రవిదాసు జీవన వృత్తాంతాన్ని ఊహించుకోవడం తప్ప అన్యథా మార్గం నాస్తి. అందుకుగాను మొదటగా ఆయన కుల, నామ నిర్ణయం ఎంతైనా అవసరం.

* * *

# 6

# కుల, నామ నిర్ణయం

శ్రీ రామానందుని శిష్యమండలిలో ప్రముఖుడైన రవిదాసుకు గురువుతోబాటు పలుప్రదేశాలు పర్యటించే అవకాశం లభించింది. అంతేగాక తన ఉత్తరార్ధ జీవితంలో తన శిష్యులు, అనుయాయుల పిలుపులపై అనేక ప్రాంతాలు తిరిగాడు, అనేక భాషల వారితో మెలిగాడుకూడ. కనుకనే కాబోలు రవిదాసు పేరు అనేక రకాలుగా ప్రచారమందున్నది. 'రవిదాసు, రైదాసు, రోహిదాసు, రయిదాసు, రుహదాసు,రుద్రదాసు' అని కించిత్ తారతమ్యాలతో, అనేక రూపాలలో ఆయన పేరు అగుపడుతున్నది. మరి యివి ఒకే వ్యక్తికి గల పలు పర్యాయనామములా లేక వేరు వేరు వ్యక్తులకుగల వేరు వేరు పేర్లా అనేది నిర్ధారించుకోవల్సి వుంటుంది.

రవిదాసు సమకాలికులైన 'ధన్నా', 'మీరా' భక్తులు ఆయన్ను "రవిదా, రైదాసు" అని సంబోధించారు. శిక్కుల "గురు గ్రంథ సాహెబ్"లో 40 పదాలు రవిదాసు పేర, మరికొన్నిపదాలు 'రైదాసు' పేర సంకలనం చేసారు. ఈ గురుగ్రంథ సాహెబ్‌లోని రవిదాసు, రైదాసు ఒకరేనని పండితులు నిర్ణయించారు. ఇంకా బహుసంఖ్యాక పండితుల అభిప్రాయం ప్రకారం 'రవిదాసు, రైదాసు' అనేవి ఒకే వ్యక్తి పేర్లని, వాటిలో 'రైదాసు' 'రవిదాసు'కు అపభ్రంశమని నిర్ణయమయింది. రవిదాసు రచనల్లో సర్వత్రా 'రవిదాసు, రైదాసు' అనే పేర్లే అగుపడుతున్నాయి.

రవివారం అనగా ఆదివారం నాడు పుట్టాడు గనుక ఆయనకు 'రవి' అని పేరు పెట్టారు. భగవద్భక్తుడు గనుక 'దాసు' అన్నారు. ఈ విధంగా రవిదాసు పేరు స్థిరమయింది. అదే ఆ భక్త శిరోమణి అసలు పేరుగా ప్రచారమయింది. ఇంకా ఆయన పుట్టినపుడు స్వయానా శ్రీరామానందుడే 'రవిదాసు' అని నామకరణం చేశాడని మరో వుదతం వున్నది.

ఇంతకూ రవిదాసుకుగల భిన్ననామాలకు కారణం ఆ భక్తుని అనుయాయుల్లో అధికాంశం నిరక్షరాస్యులు కావడం, కనుక వారు పేరు సరిగా ఉచ్చరించలేకపోవడమే. ఉచ్చారణ భేదానికి ప్రాంత, భాషా భేదాలు

తోడవడం వలన 'రవిదాసు' పేరుకు అనేక రూపాలు ఏర్పడ్డాయి. అంతే తప్ప 'రవిదాసు' అనేదే ఈ భక్తాగ్రేసరుని సరియైన నామమని ఆయన ప్రామాణిక జీవితచరిత్ర రచయితలు స్వర్గీయ రామానంద శాస్త్రి, ఎమ్.పి., శ్రీ వీరేంద్ర పాండేగార్లు నిర్ణయించారు. స్వర్గీయ రామానంద శాస్త్రిగారితో ఈ విషయమై ముచ్చటించే సదవకాశం మాకు లభించింది. సందర్భవశాత్తు చర్చవచ్చి మేమడిగినపుడెల్లా 'రవిదాసు' అనేదే సరైన పేరని, మిగతావన్నీ దానికి రూపాంతరాలని ఆయన సాధికారంగా చెబుతూండేవారు. అలాగే పంజాబు రాష్ట్ర మాజీమంత్రి, రవిదాసు జీవనచరిత్ర ప్రామాణిక రచయిత అయిన శ్రీ పృథ్వీసింగ్ ఆజాద్‌గారు కూడ 'రవిదాసు' అనేదే ఆ భక్తుని అసలు నామమని నాకు పరిపరి విధాల నచ్చజెప్పారు. కనుక 'రవిదాసు' అనేదే ఆ భక్తుని పేరని మనం నిరభ్యంతరంగా అంగీకరించవచ్చును.

**కుల నిర్ణయం :**

పోతే రవిదాసు కుల నిర్ణయం మరింత జటిలమైనది. ఎందుకంటే భక్త రవిదాసు సమకాలికుల్లో అనేకకులాలకు చెందిన భక్తులు, వీరు వారనకుండా అన్ని వర్ణాలలో, ముఖ్యంగా ఉత్తరాదిలో, ఈయనకు అనేకమంది అనుయాయులు వుండినారు. మహారాష్ట్ర, గుజరాత్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్‌లలో ఈయన అనుయాయులు బహుసంఖ్యాకులు. ఇంకా ఈ భక్తుని పేర అనేక సాంప్రదాయాలు కూడ వెలిశాయి. వీరిలో రవిదాసు కులం గురించి ఏకాభిప్రాయం లేదు. ఒకరు ఈయన నిమ్నకులస్తుడంటే, మరొకరు కాదు, అగ్రకుల సంజాతి అంటారు. అయితే మధ్యయుగాలనాటి భక్తుల్లో అధిక సంఖ్యాకులు ఏదో ఒక నిమ్నకులానికి చెందిన వారేననేది సర్వవిదితమే.

రవిదాసు అనుయాయుల్లో అనేకులు - వీరిలో అధిక సంఖ్యాకులు నిమ్నకులస్తులు - రవిదాసు నిమ్నజాతిలో, చర్మకారుల కులంలో, పుట్టాడని విశ్వసిస్తారు. ఇదే భావనతో ఆయన్ను పూజిస్తారు, ఆరాధిస్తారు. ఇంకా ఆయన సమకాలికులైన కొందరు భక్తులు, తరువాతి కాలపు అనేకమంది రచయితలు, పండిత పరిశోధకులు కూడ ఆయన చర్మకారుల కులంలో జన్మించాడని ధ్రువపరిచారు. శిక్కు సంప్రదాయంలో అర్జున దేవ రచయిత, పంచపరమేశ్వరుల్లో ఒకరైన భాయి గురుదాసు మతంకూడ

యిదే. ఇంతేకాక భారతీయ చమార్ల (మాదిగల) గురించి గొప్ప పరిశోధన చేసిన జనరల్ జి.డబ్ల్యు. బ్రిగ్స్ సైతం రవిదాసు చర్మకారుడనే నిరూపించాడు. అలాగే భక్త సాహిత్య పరిశోధకులు, ప్రామాణిక రచయితలు అయిన శ్రీ పరశురామ చతుర్వేది, సాహిత్య వాచస్పతి పండిత శ్రీ వియోగిహరి గార్లుకూడ రవిదాసు చర్మకారుడనే నిర్ణయించారు.

రెండవ వర్గంవారు ఎక్కువగా అగ్రకులాలకు చెందిన రవిదాసు అనుయాయులు. ఆయన చమార్ల జాతిలో పుట్టాడనేది ప్రతీతే తప్ప ఆయన వంటి పరమభక్తుడు చర్మకారుల్లాంటి కడజాతిలో పుట్టడం అసంభవమని అంటారు. లేదా ఏదో పూర్వజన్మ పాపఫలం అనుభవించడానికి గాను ఆ జాతిలో పుట్టాడేమోనని సంశయం వ్యక్తం చేస్తుంటారు.

ఇది కేవలం ఒక విశ్వాసం, ఒక ఊహే కాదు. ఈ భావవ్యాప్తి కోసం ఛాందస పండితులు, మతవ్యవహారాల గుత్తాధిపతులు అనేక కథలు, శాస్త్రాలు, జనశ్రుతులు, వదంతులు కల్పించారు. అవన్నీ సంకలనం చేస్తే అదే ఒక బృహద్గ్రంథం కాగలదు. మచ్చుకు రెండు మూడు ఉదాహరణలు:

1. స్వామి శ్రీ రామానందుడు తన శిష్యులు తెచ్చిన భిక్షాపదార్థాలతో తన ఆరాధ్య దైవానికి నైవేద్య మర్పించుకొనేవాడు. ఆ సందర్భంలో తన పొరుగున వున్న వైశ్యుని యింటమాత్రం భిక్ష స్వీకరించవద్దని తన శిష్యులకు ముందుగానే హెచ్చరిక చేసివున్నాడు. కనుక "నా భిక్ష స్వీకరించండి" అని ఆ వైశ్యుడెంత ప్రాధేయపడినా రామానందుడుగాని, ఆయన శిష్యులుగాని ఎన్నడైనా ఆ వైశ్యుని భిక్ష గైకొనలేదు. అయితే ఒకనాడు ఒక శిష్యుడు బాగా వానపడుతుండడంతో దూరం వెళ్లడానికి జడిసి దగ్గరేవున్న వైశ్యుని యింట భిక్ష తెచ్చి గురువుగారి కిచ్చాడు. రామానందుడు రోజూలా భిక్షాపదార్థాలను దేవునికి నైవేద్యం అర్పించుకున్నాడు గాని ఎప్పటిలా ఆ దేవుడు దర్శనమివ్వలేదు ఆ రోజు. దానితో వ్యాకుల చిత్తుడైన రామానందుడు యోగబలం వల్ల కొంత సేపటికి అసలు విషయం గ్రహించి ఆ భిక్షతెచ్చిన శిష్యుని పిలిపించి 'నీచుడా, నీవు మాదిగ కులంలో పుట్టు పో'మ్మని శపించాడు. ఆ శాపవశాత్తు ఆ బ్రాహ్మణ బ్రహ్మచారి పరమపదించి కొంతకాలానికి ఒక చర్మకారుని యింట 'రవిదాసు'గా జన్మించాడు. అయితే పూర్వజన్మ వాసన పోకపోవడం వల్ల తల్లిపాలు కుడవలేదు. అప్పుడు రామానందుడు వచ్చి చెవిలో

రామనామం వ్రాదిన పిమ్మటే ఆ బిడ్డ తల్లి రొమ్ముకుడిచాడు! ఇది 'భక్తమాల' లోని కథనం.

2. కలియుగంలో రాహు, కేతు, శని మొదలైన దుష్ట గ్రహాల ప్రకోపం పెచ్చరిల్లిడంతో దాని నివారణార్థం సూర్యభగవానుడు తన పుత్రులిరువురిలో 'పింగలాపతి'ని కసాయి కులంలో, 'ఇడాపతి'ని చమార్ల జాతిలో పుట్టమని పురమాయించాడు. తండ్రియానతి ఔదార్చి పింగలాపతి కసాయి యింట 'సధనా'గాను, ఇడాపతి మాదిగకులంలో రవిదాసుగాను జన్మించారు. ఇది భవిష్యపురాణ కథనం.

3. రవిదాసుని ఉత్తరార్థ జీవితంలో ఆయన కీర్తి ప్రతిష్టలు బాగా వ్యాపించిపోయాయి. అది విన్న ఝూలీ రాణి లేక మీరా భక్తురాలు ఆయనను చిత్తోడ్‌గఢ్‌కు ఆహ్వానించింది. రవిదాసు సిద్ధుడు సమ్మతించి అక్కడికి వెళ్లాడు. ఆయన ఆగమన సందర్భంగా అక్కడ సహపంక్తి భోజనం ఏర్పాటయింది. అయితే కొందరు సనాతన బ్రాహ్మణులు మాత్రం అందులో పాల్గొన నిచ్చగించలేదు. కాని ముడిపదార్థాలు మాత్రం తీసుకుని, ప్రత్యేకంగా వంటచేసుకుని, వేరుగా కూర్చొని భోజనం చేయసాగారు. అయితే అపుడు వారికి తమలో ప్రతి యిరువురి మధ్యన ఒక రవిదాసు కూర్చొని భోజనం చేస్తున్నట్లగుపించాడు. దిగ్భ్రాంతి చెందిన ఆ బ్రాహ్మణులు కొంత సేపటికి తమ తప్పు తెలుసుకుని ఆ సిద్ధుని క్షమార్పణ వేడుకున్నారు. అప్పుడు రవిదాసు "భయపడకండి! నేను పూర్వ జన్మలో బ్రాహ్మణుడినే" నంటూ తన రొమ్ము చీల్చి లోనున్న సువర్ణ యజ్ఞోపవీతం నిదర్శనంగా చూపాడు. ఇదీ 'భక్తమాల' లోని కథనమే.

•

ఈ 'భక్తమాల' టీకాకారుడైన ప్రియదాసు, "బహుశా పూర్వజన్మలో రవిదాసు ద్విజుడై యుండవచ్చును. కాబట్టే చర్మకారుల కులంలో పుట్టికూడ స్వామి రామానందుడు అతని చెవిలో రామనామమంత్ర ముపదేశించనంత వరకు మాతృస్తన్యం పానం చేయలే" దని అంటాడు. అలాగే 'దాదు' సంప్రదాయపు 'రజ్జబ్‌దాసు' తన రచన 'సర్వాంగీ'లో రవిదాసు మాదిగతల్లికి పుట్టాడుగాని రామనామస్మరణ మహిమచే మహాముని అయ్యాడని పేర్కొన్నాడు. పోతే భక్త సైనీ, అనంతదాసు లిరువురూ పూర్వజన్మలో రవిదాసు ద్విజుడని, పొరపాటున మాంసం తిన్న

కారణంగా చర్మకారు నింట జన్మించాడని నిర్ణయించారు. ఇదేవిధంగా తర్వాతి కాలపు రచయితలు మరికొందరు సైతం రవిదాసు పూర్వజన్మలో అగ్రకులజుడేనని నిరూపించడానికే ప్రయత్నించారు.

వీటినిబట్టి నాటి సమాజంలోకూడ యిలాంటి విపరీత, ప్రజావ్యతిరేక భావాలు లేకపోలేదని విదితమవుతుంది. ఇవన్నీ సమాజంలో చెలామణీ అవుతున్న కులదురహంకార భావనలు తప్ప మరేవీ కావని కాస్త ఇంగిత జ్ఞానం వున్న విజ్ఞులకు సైతం తోచక పోదు. ఈ విషయమై కాన్పూర్ విశ్వవిద్యాలయంలో పరిశోధనా థీసిస్‌గా "సంత్ రవిదాసు" అనే ప్రామాణిక గ్రంథం రచించిన డాక్టర్ యోగేంద్రసింగ్ వెలిబుచ్చిన ఈ అభిప్రాయాలు ఎంతైనా గమనార్హం :

> పై కథనాలలో తథ్యాతథ్యాలు, శాస్త్రీయత ఎంతవరకున్నవో అది వేరే విషయం. కాని ఉత్తమశ్రేణి భక్తులను పుట్టించగల గుత్తాధికారం (monopoly) ఒక్క బ్రాహ్మణ కులానికి తప్పయితర కులాలకు లేదనే ఒక మనో ప్రవృత్తి మాత్రం గోచరిస్తున్నది: సంయోగవశాత్తూ కడజాతిలో పుట్టిన రవిదాసనే భక్తుడు తన భక్తిచేతనో, ప్రతిభవల్లనో సర్వులకు పూజ్యుడయ్యాడన్న సంగతి సహించలేక సమాజం కళ్లు గప్పడానికిగాను పై కథలల్లినట్లున్నది. మరొకటేమంటే యిదంతా ఆ కాలంలో బ్రాహ్మణవాదం, శాస్త్రవాదాల పేర చెలామణీ అవుతూండిన అతివికృత కర్మకాండలు, ఆడంబరాలు, పురోహిత వాదాలను సరిదిద్దడంకోసం "ఆళ్వారు" లాదిగాగల భక్త సముదాయం పడుతూండిన ప్రయాసలన్నిటినీ సమూలంగా తుడిచివేయడానికి చేసిన కుట్ర లాగున్నది. ఇట్లాగే బ్రాహ్మణ విధవకు పుట్టినాడని చెప్పి కబీరుకు కులీనత ఆరోపించారు. అయితే కడ కెవరేమనుకున్నా భక్త రవిదాసు చర్మకార కులజుడే. ఈ విషయం తాను స్వయంగా పలుపర్యాయాలు చెప్పుకున్నాడు. అలాగే పలువురు పండిత పరిశోధకులూ తేల్చిచెప్పారు.

ఇక రవిదాసు రచనల్లోని అంతర్గత సాక్ష్యప్రమాణాలు అన్వేషించినట్లయితే, 'ఓచీ జాతి, ఓచీ కర్మ, ఓచీ క సబ్'(నాది నీచజాతి, నీచకర్మ), 'నాగరనా మేరీ జాతి లిఖియాత చమారో'(నాగరికులు నేను చర్మకార జాతికి చెందినవాడని చెప్పారు); 'నీచె సే ప్రభు ఊంచే కియా హై'(కింది కులంలో వాడిని నన్నా పరమాత్ముడు పైకి తీసుకొచ్చాడు)

అని నిగర్వచూడామణి భక్త రవిదాసు తనను గురించి తాను సవినయంగా చెప్పుకున్నాడు. ఇలాంటి ఉదాహరణలు యింకా అనేకం వున్నాయి.

భక్త రవిదాసు జాబాలివలె సత్యవాది. కనుకనే ఎలాంటి మాయమర్మం లేకుండా, నిస్సంకోచంగా తాను చర్మకారుడినని చెప్పుకున్నాడు. చెప్పుకోవడమే కాదు, కుల దురభిమానాలతోను, ఉచ్చ-నీచ అంతరాలతోను సతమతమవుతూండే నాటి సమాజంలో జీవితాంతం చర్మకార వృత్తినే ఆచరించాడు. రాగపూరిత భక్తి, నిష్ఠాపూరిత విశ్వాసం, సాటిలేని సాధనలద్వారా మానవాతీతునిగా ఎదిగాడు. నాడూ నేడూ కూడ వారు వీరనక అన్ని వర్ణాలవారికీ ఆరాధ్యుడైనాడు. అంతేకాదు, పవిత్ర హృదయంతో, ఆత్మవిశ్వాసంతో భగవంతుని ఆరాధించడానికి కులగోత్రాలు, జాతి మతాలు అవరోధం కాజాలవని, సాధకులు, భక్తులు సకల జాతుల్లోనూ జన్మించవచ్చని తన జీవితమే ఒక ఉజ్వల ఉదాహరణగా సాధికారంగా, సప్రమాణికంగా నిరూపించి చూపా డా సాధక శ్రేష్ఠుడు రవిదాసు.

* * *

# 7

# మహాత్ముని పుట్టుక

మహాపురుషులు దేశకాల పరిస్థితులకు, కులమతాలకు అతీతులుగా వుంటారు. వారి మనుగడ పరుల కొరకేగాని తమ కొరకై వుండదు. హమేషా ఆధ్యాత్మిక చింతనాతత్పరులై వుంటారు. కనుక లౌకిక జీవితాన్ని పూర్తిగా ఉపేక్షిస్తారు. మధ్యయుగాలప్పటి భక్తులందరూ యిలాంటివారే. వారిలో ఎవరో కొందరు తప్ప తక్కినవారెవరూ తమ పుట్టుపూర్వోత్తరాలు ఇసుమంతైనా చెప్పుకొని వుండలేదు. పర్యవసానంగా ఆ భక్తులను గురించిన జిజ్ఞాసువులకు వారి ఉదంతాలు యిదమిత్థమని తెలియడంలేదు. వారి జీవిత విశేషాలకు సంబంధించి తగినంత ఆంతరంగిక, బాహ్య సాక్ష్యాధారాలు అంతగా లభించడంలేదు. లభించినమట్టుకు వాటికి సరియైన ప్రామాణికత లేదు. మన కథానాయకుడు రవిదాసు ఆ కోవకు చెందినవాడే.

భక్త రవిదాసు జన్మస్థలమేది అన్న విషయం చర్చనీయం. తన జీవిత ఉత్తరార్ధంలో రవిదాసు విరివిగా దేశాటన చేసినట్లు తెలుస్తున్నది. తాను వెళ్లిన చోటల్లా ప్రజలెంతో గౌరవాదరాలతో సన్మానించారు. భక్తిశ్రద్ధలతో పూజించారు. అంతేకాదు, ఆ భక్తుని పేర మఠాలు, మందిరాలు నిర్మించారు. అనునిత్యం భక్తి కీర్తనలతో రవిదాసును ఆరాధించారు. నేటికీ ఆరాధిస్తున్నారు. వారణాసి, గుజరాత్, రాజస్థాన్, మహారాష్ట్రాలలో నేటికీ యీ మఠాలు ప్రబలంగా వున్నవి. ఆయన అనుయాయుల సంఖ్య కూడ ఈ చోట్ల అత్యధికం. దక్షిణాదిన కూడ ఔరంగాబాద్ సమీపాన ఎల్లోరాలో 'రవిదాస్ కుండ్', తిరుపతిలో కొండకింద రవిదాసు పీఠం వున్నాయని నిదర్శనాలు గోచరిస్తున్నాయి. ఈ కారణంగా ఎక్కడి కక్కడ ఎవరికి వారే 'మా పీఠమే రవిదాసుని అసలు పీఠం' అని నమ్ముతున్నారు. ఆ విశ్వాసం ప్రకారమే ప్రచారం చేసుకుంటున్నారు. అయితే జిజ్ఞాసువులు సత్యాన్వేషణకు పూనుకోవడం సహజమేగదా.

ఇక్కడ రెండు పక్షాలవారున్నారు. ఒక పక్షంవారు రవిదాసు పడమటి ప్రాంతంలో పుట్టాడంటారు. కాదు, ఆయన తూర్పు సీమలో జన్మించాడని అంటారు రెండో పక్షం వారు. గుజరాతు లేక రాజస్థాన్‌లలో రవిదాసు జన్మస్థానం వుందంటారు మొదటి పక్షంవారు. ఒకసారి రవిదాసీయుల మహాసభలో అధ్యక్ష పీఠంనుండి ప్రసంగిస్తూ, "గురు రవిదాసు జీవితంలో అధిక భాగం వారణాసి సమీపంలో గడిచింది. కాని ఆయన పుట్టడం మాత్రం గుజరాతులోనో, రాజస్థాన్‌లోనో పుట్టి వుంటాడని నా మతం" అని స్వర్గీయ లాలా లజపత్ రాయ్ చెప్పిన మాటలు దీనికి ప్రామాణిక పుష్టిగా పేర్కొంటారు. ఇంకా యిక్కడున్న రవిదాసీయుల సంఖ్యాధిక్యతను, రవిదాసు రచనల్లో గుజరాతీ, రాజస్థానీ భాషా పదాల ఆధిక్యతను తార్కాణాలుగా చూపుతారు. అంతేగాని యింతకు మించిన పక్కా రుజావులేవీ ఈ పక్షంవారి వద్ద లేవు.

ఇక రెండవ పక్షంవారు రవిదాసు జన్మస్థానం తూర్పుదేశంలో, వారణాసికి రెండు మూడు మైళ్లదూరంలో గ్రాండ్‌ట్రంకు రోడ్డు నానుకుని వున్న 'భాండూర్' లేక 'మాండూర్' గ్రామమని నమ్ముతారు. అత్యధిక శాతం పండితులు, పరిశోధకులు కూడ యిప్పటి వరకు లభించిన ఆధారాలను బట్టి యిదే సరి అని విశ్వసిస్తున్నారు. "మహు ఆడీహ" అని ఈ గ్రామ ప్రాచీన నామం. దీని సమీపంలోనే భక్త కబీరుని పుట్టిన వూరని పేరుబడిన 'లహర్ తారా' అనే గ్రామం వున్నది. ఈ లహర్‌తారా, మాండూర్ గ్రామాలలో నేటికీ అత్యధిక సంఖ్యలో రవిదాసు కులస్థులు - మాదిగలు - వున్నారని పరిశోధకులు గమనించి చెప్పారు.

ఇంకా కాశీ పట్టణంలోని గోపాల మందిరం, దాన్ని చేరివున్న ఒక జలాశయం రవిదాసు నిర్మించాడని, ఆ మందిరం అడుగున 'తులసీ గుహ' అనే ఒక నేలమాళిగ వుందని, అందు రవిదాసు వాడిన పనిముట్లు వున్నాయని పండితుల నమ్మకం. పోతే ఒకానొకప్పుడు కాశీనగరంలో శంకరాచార్యునికీ, ఒక చండాలునికీ ఆధ్యాత్మిక సంవాదం జరిగిందనే జగత్ ప్రసిద్ధమైన వుదంతంలోని చండాలుడు రవిదాసే కావచ్చునేంతవరకు వెళ్లే పండితులుకూడ కొందరు లేకపోలేదు.

ఈ బాహ్య సాక్ష్యాధారాల సంగతెలావున్నా, రవిదాసు స్వయంగా-

1. మేరీ జాతి కుటబాండలా
   ఢోర్ ఢొవంత వితహి బనారస్ అనపాసా
2. కాశీఢింగ్ మాండూర్‌స్థానా శూద్రవరణ కరత గుజరానా
   మాండూర్ నగర లీన అవతారా రవిదాసు శుభనామ హమారా

1. నా వంశీకులు బనారస్ పరిసరాల్లో మృతపశువుల నెత్తి జీవనం గడుపుతూండేవారు. నా కులం కుట బాండలా (చమార్ జాతి విశేషం).
2. కాశీ వద్ద మాండూర్ అనే గ్రామంలో, శూద్రజాతిలో పుట్టాను. నా పేరు రవిదాసు.

అని తన్ను గురించి తాను చెప్పుకున్నాడు. ఈ పదాలకు సంబంధించికూడ కొన్ని వాదవివాదాలున్నాయి. అయినా పండిత పరిశోధకులకు యివి ప్రబల ప్రామాణికాలుగా వున్నాయి. కొన్నేండ్ల పాటు గుజరాతు, రాజస్థాన్, పంజాబు, మహారాష్ట్ర, ఉత్తర ప్రదేశ్‌లలో విస్తృతంగా పర్యటించి, అక్కడి రవిదాసీ మఠాధిపతులను, కొందరు పరిశోధకులను, ప్రజానాయకులను కలుసుకొని చర్చించి, అనేక సాక్ష్యాధారాలు సేకరించి తేల్చిన తథ్యాతథ్యాల ఆధారంగా స్వర్గీయ రామానంద శాస్త్రి, ఎమ్.పి., రవిదాసు జన్మస్థానం వారణాసేనని స్థిరపరిచారు. ఇంకా ఆయన్ను మేము కలిసి అడిగినప్పుడెల్లా ఇంతకుమించి బలమైన రుజువులు దొరకనంతవరకు ఈ నిర్ణయమే సరైనదని నమ్మడంలో అనౌచిత్యమేమీ లేదని మా సంశయ నివారణ చేస్తూండేవారు.

ఈ నిదర్శనాలను బట్టి రవిదాసు జన్మస్థానం బనారసేనని విశ్వసించడమే సబబని తోస్తున్నది.

ఇక రవిదాసు జన్మతిథికూడ ఆయన నామం వలెనే బహు వివాదాస్పదమైనది. వివిధ వాదాలు, ఉదంతాల ప్రకారం రవిదాసు శతాధిక సంవత్సరాలు జీవించాడని విదితమవుతున్నది. కొందరు ఆయన 120 ఏళ్లు బతికాడంటే మరికొందరు 130 ఏళ్లని, యింకొందరు 140 ఏళ్లని, మరీ కొందరైతే 151 సంవత్సరాలు జీవించాడని అంటారు. ఏమైనా రవిదాసు దీర్ఘజీవి అయివుంటాడనే అధికాంశ పండితుల ఏకాభిప్రాయం.

'పదుగురాడు మాట పాడియై ధరజెల్లు' నన్నట్లు బహుమతాన్ని బట్టే ఆ భక్తుని జనన మరణాది ఉదంతాలు విశ్వసించి, కాలనిర్ణయం చేయవల్సి వస్తున్నది. ఇక జన్మతిథి విషయానికొస్తే, బహుసంఖ్యాక రవిదాసీ మఠాధిపతుల మతానుసారం ఆయన విక్రమ సంవత్ 1433 (క్రీ.శ. 1376) మాఘపూర్ణిమ ఆదివారం నాడు జన్మించాడు. రవివారం నాడు పుట్టాడు గనుక 'రవి' అని పేరుపెట్టారు. ఆనక ఈశ్వర భక్తుడవడం వల్ల "దాసు" అన్నారు. ఈ విధంగా ఆయన రవి+దాసు = రవిదాసు నామా లంకృతుడయ్యాడు. ఈ అసలు పేరుకు కాలక్రమాన అనేక రూపాంతరాలు ఏర్పడ్డాయి.

పై జన్మతిథి ననుసరించి క్రీ.శ. 1977 ఫిబ్రవరి 4వ తేదీనాటికి ఆ భక్తుడు జన్మించి 600 ఏండ్లు పూర్తయినాయి. ఆ సందర్భంగా నాడు బనారసు దగ్గరి మాండూర్ గ్రామంలోనూ, దేశ వ్యాప్తంగా యింకా పలుచోట్ల ఆయన అనుయాయులు రవిదాసుని ఆరు శతాబ్దాల మహోత్సవం అతి వేడుకగా జరుపుకున్నారు. మన భారత ప్రభుత్వం వారుకూడ ఆ రోజున ప్రభుత్వ శెలవు దినంగా ప్రకటించి ఆ భక్తాగ్రేసరునికి జాతీయ సన్మానం చేశారు. ఆ విధంగా ఆ మహాసాధకునికి శ్రద్ధాంజలి ఘటించారు.

* * *

# 8

# కుటుంబ జీవితం

రవిదాసు తల్లిదండ్రులను గురించికూడ పండితుల్లో ఏకాభిప్రాయం లేదు. మానదాస్, మాణ దాస్, రాహు, రగ్గు అనే పేర్లు తండ్రివిగానూ, భగవతి, ధుర్‌బనియా, కర్మా అనే పేర్లు తల్లివిగానూ పలుచోట్ల పలువిధాలుగాప్రచారంలో వున్నాయి. అయితే బహుసంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం తండ్రి రగ్గు అని, ధుర్బినియా తల్లియని నిర్ణయమయింది. ఇంతవరకు లభించిన అనేక సాక్ష్యాధారాలను బట్టి, ముఖ్యంగా రవిదాసీయుల్లో అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం ఈ రగ్గు-ధుర్బినియా దంపతులకు రవిదాసు విక్రమ సంవత్ 1433 (క్రీ.శ. 1376) మాఘపూర్ణిమ ఆదివారంనాడు పుట్టాడు.

ధుర్బనియా, రగ్గూలు నాటి సమాజంలో పెద్ద శ్రీమంతులు కాపోయినా, తిండికీ తాగుడుకూ లోటులేని కొద్దిపాటి స్థితిమంతుల కిందే లెక్క. సామాన్య కుటుంబీకులైనా వారు ఆత్మగౌరవంతో, ఒకరివద్ద చేయి చాచకుండా వంశపారంపర్యంగా వస్తున్న తమ కులవృత్తి నిర్వర్తించు కుంటూ జీవిస్తుండేవారు. నిష్ఠ నిజాయితీలుగల కుటుంబం అది. ఆస్తికులు, ఈశ్వర భక్తి పరాయణులు వారని తెలుస్తున్నది. కనుక తల్లిదండ్రుల భక్తి భావాలు, వారి సద్గుణాలు వారి సంతానానికి అబ్బడం అసహజమేమీ కాదుగదా! దానికి పూర్వజన్మ సంస్కారం కూడ తోడైతే యింకా చెప్పవలసినదేముంది? సువర్ణానికి తావి అబ్బినట్లే!

రవిదాసు పుట్టుకతో సాత్విక స్వభావుడు. తల్లిదండ్రులు ఆశించినట్లుగా పైతృకవృత్తియైన చెప్పులు కుట్టుకోవడం మొదలుపెట్టి కొనసాగించసాగాడు. కాని ప్రధానంగా సదా సాధుసన్యాసుల సేవలోను, భక్తి పారవశ్యంతో కఠిన సాధనలోను లీనమై వుండేవాడు.చిన్ననాటినుండి సీతారాముల విగ్రహాలు చేసి వాటిని పూజిస్తూండేవాడు. క్రమక్రమంగా వయసుతో బాటు పారమార్థిక చింతనకూడ బాగా హెచ్చయింది. తన 18వ ఏట కూడ రవిదాసు పూర్తిగా పారమార్థిక చింతనలోనే లీనమై వుండినాడని మేజరు జి.డబ్ల్యు. బ్రిగ్స్ మహాశయుని కథనం. రవిదాసుని

యీ భక్తి తత్పర స్వభావం, లౌకిక విషయాల పట్ల అతనికి గల పూర్తి ఉపేక్షాభావం అతని తల్లిదండ్రులకు, బంధువర్గానికి ఎంతమాత్రం నచ్చలేదు. అందుచేత "వంశంలో చెడబుట్టాడే వీడు!" అని వగస్తూ ఏ విధంగానైనా ఆ బాలుని మనసు మార్చాలని శాయశక్తుల ప్రయత్నించారు. కాని ఆ ప్రయత్నాలన్నీ వ్యర్థమైనాయి. చివరికి తన మెడకు ఒక గుదిబండ తగిలిస్తేగాని చచ్చినట్టు దారికి రాడని నిర్ణయించుకున్నారు తల్లిదండ్రులు, కులపెద్దలు, బంధువర్గమూనూ. ఆ నిర్ణయం ప్రకారం ఒక సుముహూర్తంలో 'లోణా' అనే ఒక సుగుణవతితో రవిదాసుకు పెళ్లిముడి వేశారు. "ఇక చిలిపి చేష్టలు, కుర్ర వేషాలు వీడి ఇల్లు చక్కబెట్టు, వృద్ధులయిన నీ తల్లిదండ్రులు యింకెంత కాలం కష్టపడగలరు? ఎంత కాలం బతికి వుండగలరు? వీరి తాపత్రయమంతా నీ కోసమేగాని తమకోసం కాదుగదా. అంతా నీ భవిష్యత్తు కోసమే. కనుక నాయనా, ఈ సంగతులన్నీ గుర్తెరిగి వంశపరంపరాగత వృత్తిని నిలబెట్టుకో. దుకాణం చక్కగా నడుపుకో, వంశగౌరవం కాపాడు. వేన్నీళ్లకు చన్నీళ్లలాగ నీ తల్లిదండ్రులకు తోడ్పడు" అంటూ హితోపదేశం చేసారు దుకాణంమీద కూర్చోబెట్టారు ఆ పెద్దలు, బంధువులు రవిదాసుని.

"ఇదివరలా వంటరిగాడా ఏమి? మెడలో గుదిబండ, కాళ్లకు బేడీలు తగిలించాముగా. ఇకనైనా కుదురుగా వుండకపోతాడా, మహారాజులా వుంటాడులే. అలా వుండకపోతే వచ్చినమ్మ (భార్య) మట్టుకు వూరకుంటుందా?" అని తమకు తాము నచ్చ జెప్పుకున్నారు కుల పెద్దలు, పెద్దమ్మలూనూ. దానితో ఒక విధమైన మనస్తృప్తి పొందారు వారందరూనూ.

తల్లిదండ్రులు, పెద్దలు ఉపదేశించిన రీతిగా రవిదాసు రోజూ ప్రాతఃకాలమే లేచి ఇష్టదేవతార్చన చేసుకొని దుకాణం మీద కూర్చుంటూండేవాడు. వానొచ్చినా, వరదొచ్చినా, కాలొంగినా, చెయ్యొంగినా నిత్యం నియమం తప్పకుండా పెద్దల ఆజ్ఞ పాలించేవాడు. అయితే ఆయన మానసిక ప్రవృత్తిలో, ఉదార స్వభావంలో ఇంచుకైనా పరివర్తన కలుగలేదు. చెప్పులు కుడుతూండేవాడు. కొనవచ్చిన వారికి అమ్ముతుండేవాడు. కాని యథాప్రకారం సాధు సన్యాసుల పట్ల ఔదార్యం ప్రదర్శిస్తూండేవాడు. కొందరికి దానం కూడ చేస్తూండేవాడు. సాయంత్రానికి చేతమిగిలింది జాగ్రత్తగా తీసుకువెళ్లి తండ్రి చేతిలో పెడుతుండేవాడు.

దీనితో క్రమక్రమంగా కూడికట్టులో నడవవలసిన దుకాణం తీసికట్టులో నడవసాగింది. జాగ్రత్తగా గమనిస్తున్న తల్లిదండ్రులకు తమ కుమారుడు క్రమ పద్ధతిన దుకాణంమీద కూర్చోవడం, పనిచేయడం బాగా నచ్చింది. కాని బేరసారాల్లోనూ, ధరవరల్లోను, యిచ్చిపుచ్చుకోళ్లలోను చూపించే ఔదార్యం మాత్రం వారికి నచ్చలేదు. ఈ విషయమై కొడుకుకు నయానా భయానా నచ్చ జెప్పజూశారు. చేయంగల ప్రయత్నాలన్నీ చేశారు.కాని అదంతా పాకుడు గట్టిన పాషాణం మీద ప్రవాహచందమయింది. రవిదాసు ప్రవర్తనలో మార్పేమీ రాలేదు. దానితో తండ్రి రగ్గా చింతా క్రాంతుడయ్యాడు. ఎంత ఆలోచించినా తరుణోపాయం తట్టలేదు. చివరికి కుమారుని భారంగా తలిచి, 'నీ బతుకు నీవే బతుకు పొ'మ్మని చెప్పి ఇంటినుండి వేరు చేశాడు. వేరు చేశాడే గాని తన సంపదలో ఇసుమంత భాగమైనా యివ్వలేదు. పాపం జీవనోపాయం యెరుగని ఆ కొడుకును బరువని తలిచి వెళ్లగొట్టారు. ఇంటినుండి వెడలగొట్టడంతోనే తమ బరువుబాధలు విరగడైపోయాయని భావించారా తల్లిదండ్రులు. కులపెద్దలు, బంధువర్గమూ కూడ ఆ తల్లిదండ్రులు చేసిన పనిని సమర్థించారు.

చేతిలో చిల్లిగవ్వలేకుండా భక్త రవిదాసు తల్లిదండ్రుల నుంచి వేరు కావాల్సివచ్చింది. అయితే ఆయన మేర కదే మేలయింది. ఉన్న భౌతిక బంధం కాస్త తెగిపోయింది. సర్వస్వతంత్రుడయ్యాడు. ఆధ్యాత్మిక చింతన, ఈశ్వరోపాసనలకు పూర్తి అవకాశం లభించింది. లౌకిక విషయాలకు, ధన కనక వస్తు వాహనాలకు రవిదాసు ఎన్నడూ ప్రాధాన్యత నిచ్చి యెరుగడు. తన భక్తి, సాధనల ద్వారా అన్నింటినీ మించిన ఆధ్యాత్మిక ధనం - రామనామ ధనం - సంపాదించుకున్నాడు. మరి అంతకన్నా తనకు కావలసినదేమున్నది?

తండ్రి ఇంటి వెనుక భాగంలో రవిదాసు ఒక గుడిసె వేసుకున్నాడు. భార్యాభర్త లిరువురూ సుఖ సంతోషాలతో కాపురం చేయసాగారు. ఉదరపోషణార్థం కులవృత్తి నవలంబించి చెప్పులుకుట్టుకోవడం, ఆధ్యాత్మిక ఆకలి పూర్తికి ఈశ్వరోపాసన, పూజాపునస్కారాలు మనసారా చేసుకోవడం! రవిదాసు మహాభక్తుడు, సహజ సాధకుడు, అల్పసంతోషి. ఆ చిన్న గుడిసే ఆయనకు ఒక మహాప్రాసాదంగా అలరారింది. సుఖశాంతులకు నిలయమయింది. జన్మతః చర్మకారుడయినప్పటికీ ఆచరణలో ఏ

వైష్ణవునికీ తీసికట్టుకాకుండా ప్రవర్తించసాగాడు. తన పనికి మృతపశువుల చర్మమే వాడేవాడు. చర్మం కావు బట్టడం, బాగుచేయడం మొదలైన పనులన్నీ స్వయంగా చేసుకునేవాడు. అలా తయారైన చర్మంతో రోజుకు రెండే జతల చెప్పులు కుట్టేవాడు. అందొకటి భుక్తి కొరకైతే, మరొకటి ముక్తికొరకు సరిపోయేది. ఈ విధంగా కుటుంబ పోషణ, సాధుజనుల సేవ, ఈశ్వర సాధన – నిర్విరామంగా సాగిపోతూండేవి. తల్లిదండ్రుల నుండి వేరైనంత మాత్రాన తన ఆధ్యాత్మిక సాధన కేమీ లోపం కలుగలేదు. తన మనస్సు మాత్రం తల్లిదండ్రులాశించినట్లుగా మారలేదు.

భక్త రవిదాసుకు ఆర్థిక లోటుపాట్లు సంభవించక పోలేదు. కటిక దారిద్ర్యం అనుభవించిన రోజులు కూడ వుండినవి. కాని ఎన్ని ఆపదలు వచ్చినా, ఎన్ని ఇక్కట్లు కలిగినా 'అంతా రామునిదే భారం, నాకేమిటి విచారం?" అని భావించేవాడు. ఆయన పేదరికం చూచి యితరులు అపహసించేవారు. సొంతకులస్తులు, బంధువులు, స్నేహితులు సైతం ఎగతాళి చేసేవారు. అయ్పటికీ ఆధ్యాత్మిక చింతనాపరుడు, రామనామ సుధాపానోన్మత్తుడైన భక్త రవిదాసు అవేవీ లెక్కచేయలేదు. తన పేదరికానికి ఆయన ఎన్నడూ విచారించి ఎరుగడు. అయితే ఎప్పుడో ఒకప్పుడు మాత్రం, 'అపరాధిని, నీచకులంలో పుట్టాను, స్వజనులే పరిహసిస్తున్నారు' అనీ, 'నా పేదరికానికి ప్రజలు నవ్విపోతున్నారు' అనీ తన ఆరాధ్యదైవంతో విన్నవించుకున్నట్లు అరుదుగా కొన్ని రచనలు అగుపడుతున్నాయి. అవి తప్పితే రవిదాసు సర్వసాధారణంగా తన పదాలలో ప్రజాజీవితాన్నే ప్రతిబింబించాడుగాని సొంత జీవితాన్ని ప్రదర్శించుకోలేదు. ఐహిక సుఖ సంపదలను అతడెప్పుడూ గొప్పదనానికి ప్రతీకలుగా భావించలేదు. పరుగెత్తి పాలుతాగడంకంటె నిలబడి నీరు త్రాగడమే మేలని యెంచాడు. కష్టార్జితంతో పొట్టపోసుకుంటూ సాధుపురుషుల సేవాసాంగత్యాలతో ఆనందం పొందుతూండేవాడు.

అదృష్టం కొద్దీ భక్తశిరోమణి రవిదాసుకి భార్యకూడ అనుకూల వతియే లభించింది. ఆయన తల్లిదండ్రులు యెంచినట్లుగా భర్తమెడకు గుదిబండగాగాని, కాళ్లకు బేడీలుగా గాని కాలేదు ఆమె. కాకపోగా ఆధ్యాత్మిక చింతనలోను, ఈశ్వరోపాసనలోను భర్త రవిదాసుకు చేదోడు వాదోడయ్యింది. ఇంకా ఆ భక్త పుంగవుని దర్శనం, సాంగత్యాలకోసం

సదావస్తూపోతూండే సాధు సన్యాసులు, యితర అతిథుల పాలిట అన్నపూర్ణగా వుండేది. ఈ విధంగా సర్వావస్థల్లోనూ భర్తకు తోడునీడగా మసలుకొన్నదా ఉత్తమ యిల్లాలు. అందుచేతనే ఆయమ నేటికీ 'లోణాదేవి'గా పూజింపబడుతున్నది. సంతానప్రాప్తి కాంక్షించేవాళ్లు, పిల్లల ఆయురారోగ్యాలు కోరుకునేవాళ్లు అందరూ కులమత వివక్ష లేకుండా సర్వులూ ఈ దేవి ఆశీస్సులకోసం తమ బిడ్డలతోసహా వచ్చి మొక్కుకుంటూంటారు.

గురు రవిదాసు అల్ప సంతోషి. ఉన్నదానితోనే సంతృప్తి చెందే స్వభావం. ఆస్తిపాస్తులు కూడబెట్టుకోవాలనే కాంక్షలేని వాడు. అనాసక్త జీవి. ఆ కారణంగానే తాను కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నప్పటికీ యితరులను చూచి అసూయపడేవాడు కాదు. పరుల ధనానికి ఆశపడే వాడు కాదు. హరినామ సంస్మరణలోనే హమేషా లీనమై వుండేవాడు. భక్త రవిదాసుని నిష్కామ ప్రవృత్తికి సంబంధించి అనేక కథలు ప్రచార మందున్నాయి. మచ్చున కొకటి :

నిర్మల హృదయంతో తనను పూజించే భక్తులను వేయికళ్లతో కాపాడే ఆ భక్తవత్సలుడైన శ్రీకృష్ణ భగవానుడు పరమభక్తుడైన రవిదాసుని దారిద్ర్యం, దీనావస్థలను ఆకళింపుచేసుకుని ఒకసారి ఆయనకు సాయపడాలని ఒక వృద్ధ సాధువువేషంలో వచ్చాడు. తన గుడిసె గుమ్మం వద్ద చెప్పులుకుట్టే పనిలో లీనమైవున్న ఆ భక్తునితో "ఈ కష్టాలన్నీ ఎందుకు? ఇదుగో పరుసవేది. దీనితో సుఖంగా బతుకు" అంటూ రవిదాసుకు పరుసవేది నివ్వబోయాడు. కాని పరుసవేది నాకెందుకని రవిదాసు నిరాకరించాడు. బహుశా యిది సరియైనదో కాదోనని సంశయిస్తున్నాడేమోనని ఆ వృద్ధ సాధువు రవిదాసు చేతనున్న ఇనుప రంపెకు దాన్ని తాకించాడు. దానితో ఆ ఇనుప రంపె కాస్త రెప్పపాటులో బంగారు రంపెగా మారిపోయింది. అది నిదర్శనంగా చూపి, "నీకు అవసరమైనప్పుడే ఏ ఇనుప వస్తువునైనా బంగారంగా మార్చుకోవచ్చు. తీసుకో" అని ప్రోత్సహించాడా సాధువు. దానికీ రవిదాసు సమ్మతించక పోవడంతో, "సరే, మున్ముందు ఎప్పుడైనా అవసరం పడినప్పుడు ఉప యోగించుకుందువులే" అంటూ ఆ స్పర్శమణిని చూరులో దోపి వెళ్లి పోయాడా వృద్ధ సాధువు.

ఆనక సుమారు ఒక ఏడాది తర్వాత ఆ వృద్ధ సాధువు మళ్లీ వచ్చి

"ఏమయ్యా! నేనిచ్చి వెళ్లిన పరుసవేది ఎక్కడ?" అని రవిదాసుని ప్రశ్నించాడు. "తమరు పెట్టివెళ్లిన చోటే వుంటుంది చూడండి" అని జవాబిచ్చాడాయన. ఆ వృద్ధ సాధువు చూస్తే తాను దోపివెళ్ళిన చోటే చూరులో భద్రంగా వుందా పరుసవేది. తాను పెట్టినది పెట్టినట్లే వుండడం చూచి ఆ సాధువు దాన్ని వెలికి తీసి మళ్లీ రవిదాసు కివ్వబోయాడు. అయితే రవిదాసు చేతులు జోడించి,

**మాధవే! పారసమణి లయి జా ఊ**
**మోహి సోనే కా నహి కామ్ ।**

*హే మాధవా! బంగారంతో నాకేమి పని? పరుసవేదిని మీరే తీసుకుని వెళ్లండి.*

అని వేడుకున్నాడు. నిజమైన భక్తుడు స్పర్శమణి ప్రలోభానికి లోనయి ధర్మభ్రష్టుడు కాగల్గుతాడా? ఆ భక్తుని నిష్కామ చింతనకు విస్మయం చెందుతూ వెళ్లిపోయాడు ఆ వృద్ధ సాధువు.

స్వావలంబిత జీవనం, సాధుపురుషుల సేవాశుశ్రూషలే తన పరమ కర్తవ్యాలుగా యెంచుకున్న భక్త రవిదాసు చెప్పులుకుట్టే కులవృత్తిని ఈశ్వర సన్నిధికి చేర్చే సాధనంగా యెన్నుకున్నాడుగాని కేవలం ఉదర పోషణార్థంగాదు. జీవితాంతం ఈ పవిత్రభావనే ఆచరణలో పెట్టాడు. ఆయన తన యీ భావాన్ని యెలాంటి అరమరికలు లేకుండా యిలా స్పష్టంగా వెల్లడించాడో చూడండి :

**జిహ్వా సో ఓంకార్ జప, హత్థన సో కర్ కామ్,**
**రామ మిలహి ఘర ఆయి కర, కహి రవిదాస్ విచార్.**

*జిహ్వతో ఓంకారం జపిస్తూ, చేతులతో పని చేస్తుంటే ఆ భగవంతుడే యింటికి వచ్చి దర్శనమిస్తాడు.*

ఆహా... ఎంత ప్రగాఢ విశ్వాసం! ఎంత సుదృఢ ఆత్మబలం!! ఆద్యంతాలు ఇలాంటి విశ్వాస ప్రపత్తులతోనే రవిదాసు కరయుగళంతో పాదరక్షలు కట్టాడు, వ్యాకుల హృదయంతో ఈశ్వరోపాసన చేశాడు.

తన ఆరాధ్య దైవం విగ్రహాన్ని, ఆ విగ్రహాన్ని భరించే సింహాసనాన్ని రోజూ ఉదయం కడిగి శుభ్రపరచి ధూపదీపనైవేద్యాలర్పించినాక గాని భక్త రవిదాసు భోజనం చేసేవాడు కాదు. ఇది ఆయన దినచర్యలో నిత్య

నియమం. ఆ ప్రకారమే ఒకనాడు దేవతా ప్రతిమను, దాని గద్దెను శుభ్రపరచడానికిగాను ఎత్తేసరికి దానికింద ఐదు బంగారు నాణాలు అగుపడ్డాయి. అది చూచి ఆశ్చర్యపడి, తనను ప్రలోభ పెట్టడానికి ఎవరో యెత్తిన ఎత్తు అని సంశయించి రవిదాసు వాటిని కనీసం ముట్టనైనా ముట్టలేదు. కాని ఆ రాత్రి కలలో శ్రీ కృష్ణ భగవానుడు సాక్షాత్కరించి, "నీ సహాయార్థం ఆ నాణాలు నేనే అక్కడ పెట్టాను. స్వీకరించు" మని ఆదేశించాడు. అప్పుడు ప్రభునాజ్ఞ తిరస్కరించలేక రవిదాసు ఆ సువర్ణ నాణాలు స్వీకరించాడు. కాని వాటిని స్వప్రయోజనం కొరకు గాక శ్రీ కృష్ణ భగవానుని పేర ఒక మందిరం, ధర్మసత్రం, వాటిని చేరి ఒక కొలను నిర్మించడానికి ఉపయోగించాడు. ఆ మందిరంలో ప్రతి నిత్యమూ కులమత నిర్మూలన, సర్వమానవ సమానత్వం, ఈశ్వర సాన్నిధ్య సాధన మొదలైన అంశాలపై ప్రవచనాలు చేస్తూండేవాడు భక్త రవిదాసు. దూరదూర ప్రదేశాల నుండి వచ్చిన భక్తజనులు, గురుదర్శనాభిలాషులు ఆ ధర్మశాలలో బస చేసేవారు. అక్కడి జలాశయంలో స్నాన సంధ్యలు నెరవేర్చుకుని మందిరంలో గురు రవిదాసు ఉపదేశామృతపానం జేస్తూండే వారు. బనారసు నగరంలో నేడా జలాశయం 'రవిదాసు కుండ్' పేరిట అలరారుతున్నది.

* * *

# 9

# మహిమాన్విత జీవితం

భక్త రవిదాసు కుటుంబ జీవితం నిజానికి అతడు తన తల్లిదండ్రుల నుండి వేరయినప్పటినుండీ మొదలయిందని తెలుసుకున్నాము. అయితే నాటినుండి తన ఆధ్యాత్మిక చింతన, సాధనలు కూడ నిర్విఘ్నంగా, సాఫీగా సాగిపోయినాయి. కుటుంబ జీవితంలో కలతలేవీ లేవు. రవిదాసు, లోణా దంపతులకు ఒకే ఒక కుమారుడు కలిగాడని, ఆ బిడ్డకు విజయదాసని పేరుపెట్టారని తెలియవస్తున్నది. కాని అంతకుమించి రవిదాసు కుటుంబజీవితంలో చెప్పుకోదగ్గ పరిణామమేమీ లేదు. భార్య అనుకూలవతి, పరమసాధ్వి కావడంవల్ల అతిథి సత్కారం, సాధుసన్యాసుల సేవాసాంగత్యాలలో ఆయనకాలం ఆనందంగా గడిచిపోయింది. రానురాను ఆధ్యాత్మిక జీవితమే ఏకైకం కాసాగింది.

భక్త రవిదాసు లౌకిక జీవితం కొద్దిపాటిదే అయినా ఆధ్యాత్మిక జీవితంమట్టుకు బహుగొప్పది. ఆయన తన జీవితకాలంలో అనేక పరీక్షలకు లోనయ్యాడు. విమర్శలకు గురయ్యాడు. ఆయన భక్తిప్రపత్తులు, ఆధ్యాత్మిక సాధనలు ఏ గీటురాయిపైనైనా వన్నెకెక్కాయి. అన్నింటిలోనూ విజయలక్ష్మి వరించింది ఆ భక్తుని. విమర్శల అగ్నిలో బాగా తపించి, తపించిన కుందనంలా వన్నెకెక్కిందాయన జీవితం. అప్పుడే ఆయన జీవితం నిజంగా వికసించింది. భక్తిసాధన మరింత పరిపక్వమయింది. కామిత ఫలం సిద్ధించింది. సామాన్య మానవునిగా ఒకవైపు బతుకు గడుపుతూనే మరొకవైపు పరమార్థ సిద్ధునిగా ఎదిగి పైకి వచ్చాడు. ఆ కారణంగా ఆ భక్తుని జీవితం బహుళజనరంజకంగా వ్యాపించింది. కుటుంబ జీవనం ఆయనకు స్వల్పం అనడం కంటె ఆయన భక్తజీవనం బహుళవ్యాపకం అని చెప్పుకోవడమే మెరుగేమో. దీనికంతటికి సృష్టి స్థితి, విలయాలకు కర్త అయిన ఆ ఏకేశ్వరునితో మన భక్తునికిగల ఆత్మ బాంధవ్యమే హేతువు అనుకోవడానికి సందేహమెందుకు?

భక్త రవిదాసు జీవితం యావత్తూ పారమార్థిక చింతనలో, అందులోనూ గంగామాత ఉపాసనలో గడిచింది. దానితో ఆయన పేరు

ప్రతిష్టలు దూరదూరాలకు ప్రసరించాయి. సాత్విక జీవనం, సదాచార వర్తనం, భక్తిపారవశ్యతలకు రవిదాసు పేరుపొందాడు. అందువల్ల వారు వీరనకుండా అన్నివర్గాల ప్రజలు ఆ సాధకుని దర్శనార్థం రాసాగారు. కొందరు ఆయన ఆశీర్వాద లాభం కొరకు, ఇంకొందరు తమ సంశయ నివారణకు, మరికొందరు కేవల దర్శన భాగ్యం కొరకు వస్తూండేవాళ్లు. వారిలో కొందరు విమర్శకులు, రంధ్రాన్వేషకులు కూడ లేకపోలేదు. ముఖ్యంగా అగ్రకులాలవారు ఆయన ఉపదేశాలను చులకనగా చూస్తూ ఆయన భక్తిప్రపత్తులను సందేహించసాగారు. కొందరాయన్ని పరీక్షించ నెంచారు కూడ. వీలైనప్పుడల్లా హేళన చేయడానికి వారు వెనుకాడలేదు.

రవిదాసుని జీవితంలో సుఖాలకంటె కష్టాలే అధికంగా ఎదురయినా భార్య అనుకూలవతి కావడం వలన కుటుంబ కలహాలైతే ఏవీ సంభవించ లేదు. ఇతరులవల్ల తలెత్తిన సమస్యలన్నీ కులపరమైనవి, భక్తిమత పరమైనవే. కడకు ఆ కష్టాలు కూడ ఆయన భక్తి సాధనవల్లే సుగమంగా తీరిపోయాయి. భక్తవరుల జీవితకాలాల్లో అనేక తీవ్ర సమస్యలు, అనేక విచిత్ర ఘటనలు సంభవిస్తుంటాయి. అవి సహజంగానే సుగమంగా తీరిపోతాయి కూడ. కాని ప్రజలకు అవి అద్భుతాలుగా అగుపడతాయి లేక వారలా భావిస్తారు. మహాపురుషుల జీవితాలతో యిలాంటి అద్భుతాలు, మహిమలు ముడివడివుండడం సర్వసాధారణం. కనుక బహుశా వారి జీవితాల కవి విశేషణాలవంటివేమో, ఆ విశేషణాలు, అలంకారాలు లేనివారు భక్తవరులుకారేమో ననుకోవల్సివస్తుందికూడ. రవిదాసు జీవితంలో యిలాంటి మహిమాన్విత, మానవాతీత శక్తి ప్రదర్శక ఘటనలు అనేకం.

కాశీరాజా తరఫున ఒక పురోహితుడు రోజూ గంగానది వద్దకు పోయి గంగామాయిని పూజించి వస్తూండేవాడట. ఒకనాడా బ్రాహ్మణుడు గంగానదికి వెడుతూంటే దారిలో చెప్పొకటి తెగిపోగా సరిచేయించుకోవ డానికి రవిదాసు భక్తుని వద్దకు వచ్చాడు. అప్పుడు రవిదాసు తాను కుట్టి వుంచిన ఒక చెప్పులజోడే ఆ పూజారికి కానుకగా యిచ్చాడట. ఆ బ్రాహ్మణుడు ఎంతో సంతోషపడి వెడుతూ వెడుతూ 'గంగా స్నానానికి రావా భక్తజీ?' అని ప్రశ్నించాడు. దానికి రవిదాసు, 'ఇంటివద్దనే రోజూ గంగమ్మ తల్లిని దర్శించుకుంటున్నాను. తమరు వెడుతున్నారు గనుక నా పేర గంగామాయికి అర్పించండి' అని పూజారికొక పోకముక్క నిచ్చాడు. సరేనని చెప్పి ఆ బ్రాహ్మణుడు గంగానది వద్దకు వెళ్లి, స్నాన

జపాదులు ముగించుకొని తిరుగుదారి పట్టాడు. కొంతదూరం వచ్చిన పిమ్మట ఆ పురోహితునికి రవిదాసు యిచ్చిన వక్కముక్క సంగతి గుర్తుకు వచ్చింది. దానితో తిరిగి వెనక్కువెళ్లి, ఆ పోకచెక్క గంగామాత కర్పించబోతుండగా ఒక అద్భుతం ఘటించింది. స్వయంగా గంగమ్మ తల్లే కెరటాలపైనుండిగా తేలివచ్చి ఆ వక్కముక్కను స్వీకరించి, దానికి బదులుగా ఒక స్వర్ణకంకణం యిచ్చి దాన్ని భక్త రవిదాసుకు యివ్వమని ఆదేశించింది.

గంగామాత దర్శనానికీ, తన కామె సువర్ణ కంకణం యివ్వడానికీ అమితానందంతో పొంగిపోయి వస్తున్న బ్రాహ్మణునికి దారిలో దుర్బుద్ధి పుట్టింది. ఆ కంకణం తీసుకువెళ్లి రాజుగారికిస్తే తనకు బహుమతి, ప్రశంసలు రెండూ లభించగలవనే ప్రలోభంతో ఆ పూజారి కంకణం తీసుకువెళ్లి రాజుగారికి యిచ్చాడు. రాజుకది విలువైనదేగాక ఎంతో విలక్షణమైనదిగా కూడ కనిపించింది. ఆయన దానిని తన రాణికి కానుకగా యిచ్చాడు. ఆ బంగారు కంకణం చూసి రాణి ఆనందపరవశురాలైంది. అలాంటిదే యింకో కంకణం కావాలని కోరింది. వెంటనే రాజు కంసాలులను పిలిపించి ఆ అపూర్వ కంకణం చూపించి సరిగ్గా అలాంటి కంకణమే మరొకటి చేయమని ఆజ్ఞాపించాడు. విలక్షణమైన ఆ కంకణాన్ని చూచి విస్మితులైన ఆ కంసాలులు 'మేమిలాంటి కంకణం చేయలేము ప్రభూ' అని విన్నవించుకున్నారు. దూరదూర ప్రదేశాల నుండి ఎందరో నిపుణులైన కంసాలులను పిలిపించినా వారూ అదేవిధంగా తమ అశక్తత వెల్లడించారు. రాజుగారు కడకు విసిగి వేసారి అలాంటి కంకణమే మరొకటి దొరికే మార్గమేమైనా వుందా అని విచారించసాగారు.

ఇంతలో కంకణం బెంగతో రాణి జబ్బుపడింది. నానాటికీ జబ్బు ముదిరి రాణి ప్రాణాలకే ముప్పుగా పరిణమించింది. రాజవైద్యులు ఆమెను పరీక్షించి, 'ఇది మనోవ్యాధి. రాణిగారి మనోవాంఛ ఈడేరే వరకు ఈ వ్యాధి కుదరదు' అని పెదవి విరిచారు. దానితో రాజుగారికి ఆందోళన అధికమైంది. కంకణం తనకు కానుకగా యిచ్చిన ఆ పూజారిని పిలిపించి అసలా కంకణం ఎక్కడిది అంటూ గట్టిగా వాకబు చేశాడు. దానితో భయపడిన పూజారి జరిగిన సంగతి అంతా రాజుకు చెప్పాడు. వెంటనే పూజారిని వెంటబెట్టుకుని రాజు రవిదాసు గుడిసె వద్దకు వచ్చి ఈ ఉదంతమంతా భక్తునికి చెప్పి, పూజారిని క్షమించమని, తన రాణిని

కాపాడమని కోరాడు. 'తథాస్తు' అంటూ రవిదాసు గంగామాయిని స్మరించి తన ముందరి నీటిబుంగలో చేయిపెట్టాడు. ఏకాధిక కంకణాలు చేతికి వచ్చాయి. వాటిలో ఒకటి రాజుకిచ్చి మిగతావి నీటి బుంగలోనే వేసేశాడు రవిదాసు. కోరిన కంకణం లభించడంతో రాణికూడ యథాపూర్వం స్వస్థురాలయింది.

ఈ ఘటనతో భక్త రవిదాసు కీర్తి చంద్రిక వేగంగా, విస్తృతంగా వ్యాపించింది. పలుచోట్లనుండి ఆయన ప్రవచనాలు కోరి ఆహ్వానాలు రాసాగాయి. వెళ్లిన చోటల్లా ఘనసన్మానాలు జరగసాగాయి. కడజాతివాడు, చర్మకారుడు అయిన రవిదాసుకు భక్తునిగా, సిద్ధునిగా యింతగా గౌరవ సన్మానాలు జరగడం అసూయాపరులైన ఛాందస పండితులు ఏమాత్రం సహించలేకపోయారు. ఆ కాలంలో అన్నిరకాల బ్రాహ్మణవాద కర్మ కాండలకు నిలయమైనది కాశీనగరం. ఆ నగరంలోనే భక్త రవిదాసుకు సన్మానాలు జరగడం సనాతనవాదులకు మరింత కన్నెర్ర కలిగించింది. "కడజాతి వాడేమిటి? మందిరాలు, మఠాలలో ప్రవచనాలు చేయడమేమిటి? చర్మకారుడు ధర్మోపదేశాలు చేయడమా, ఏమి కాలవైపరీత్యం!" అన్న కులదురభిమానం జనించింది. దానితో ఛాందసులు, సనాతనవాదులు అంతా కలిసి ఆ కాలపు కాశీరాజయిన శ్రీ వీర సింహదేవ్ బఘేలా సమ్ముఖంలో, "రవిదాసనే చర్మకారుడు కులాచారవిరుద్ధమైన నడవడి చూపుతున్నాడు, ధర్మసంస్కరణ అంటూ వేదిక లెక్కి ఉపదేశాలు చేయిస్తున్నాడు, ఈ విధంగా సనాతన హిందూ సమాజంలో తిరుగుబాటు రేపుతున్నాడు; ఉపద్రవం తెచ్చిపెడుతున్నాడు, ధర్మం పాడుజేస్తున్నాడు" అని ఫిర్యాదు చేశారు.

రాజు వెంటనే భక్త రవిదాసుతో సహా ఉభయపక్షాలవారిని దర్బారుకు రప్పించి, తన సమక్షంలో శాస్త్రపరీక్ష జరిపించాడు. సనాతనుల ప్రశ్నలన్నింటికీ వైష్ణవ మతానుసారంగా సుయుక్తమైన సమాధానాలిచ్చి రవిదాసు ఎదుటివారిని నిరుత్తరుల్ని చేశాడు. దానితో ఛాందస పండితుల్లో కలకలం చెలరేగింది. అప్పుడు రవిదాసును అభాసుపాలు చేసే ఉద్దేశ్యంతో వారు మరో సవాలు విసిరారు. సభామధ్యభాగంలో ఒక సింహాసనంపై శ్రీ కృష్ణభగవానుని విగ్రహం అమర్చారు. భక్తి కీర్తనలు, శాస్త్ర మంత్రోచ్చారణల ద్వారా ఎవరైతే ఆ ప్రతిమను తమ ఒళ్లోకి రప్పించుకుంటారో వారిదే

విజయమన్నారు. అప్పుడు, "ఓడినవారు గెలిచినవారిని పాలకీమోసి వూరేగించా"లని రాజు ఒక షరతు పెట్టాడు. అందరూ దానికి సమ్మతించారు.

వేదాలు, ఉపనిషత్తుల్లోని శ్లోకాలతోను, శాస్త్రమంత్రాలతోను మొదట ఛాందస పండితులు స్తోత్రపాఠాలు చదివారు. కాని వీసమంతైనా కదలి లేదా ప్రతిమ. అనంతరం "పతితపావన బిరుదా, నన్ను కాపాడుము దేవా!" అంటూ తన్మయుడై పాడాడు మన భక్త శిరోమణి. రెప్పపాటులో శ్రీ కృష్ణ భగవానుని విగ్రహం రవిదాసుని ఒడిలో వాలింది. సభాసదులు విస్మయం చెందారు. సింహాసనం దిగివచ్చి రాజు భక్తునికి నమస్కరించాడు. ఫిర్యాదుచేసిన పండితులను శిక్షించాడు. షరతు ప్రకారం ఆ ఛాందస పండితులు భక్త రవిదాసును పల్లకీలో కూర్చొబెట్టి, కొమ్ములుకాసి వారణాసి పురవీధుల్లో వూరేగించారు. 'భక్తుడెందు జనిన పరదెంతు వెనువెంట గోవు వెంట దగులు కోడెభంగి' అన్న భాగవత వచనం వృథా కాదు, కాలేదు సుమా...

ఈ సంఘటన పిదప రవిదాసు కీర్తిచంద్రికలు నలుదిశలా వ్యాపించినవి. అసూయాపరులు ఆయన్ను ఎంతగా కించపరచదలచారో, అవమానపరచాలనుకున్నారో అంతకు అనేకరెట్లుగా గౌరవ మర్యాదలు, బహుముఖ ప్రశంసలు లభించాయి ఆ భక్త శిఖామణికి. ఆయన భక్తి మహిమలు, ప్రశంసలు ఆనోటా ఈ నోటా విన్న సికిందర్ లోడీ ఒకసారి రవిదాసును ఢిల్లీ దర్బారుకు పిలిపించి కొన్ని సందేహాలు తీర్చమని అడిగాడట. సుల్తాను మనోభావం గ్రహించిన భక్త రవిదాసు,

> అబల ఆఖిర్ ఇల్లాహ్ ఆరమ్ మౌజు పరిస్తా బందా ।
> జిస్‌కీ ఫనాహ పీర్ పైగంబర్ క్యా గరీబ్ క్యా గందా।
>
> *ఆది నుండి నేటిదాకా రాజూ-పేదా, పీర్ పైగంబర్లందరూ అవసాన దశలో ఆ ఏకేశ్వరుని సన్నిధికి చేరవల్సినవారే. కనుక అందరికీ ఆశ్రయదాత, పరిరక్షకుడు, పరమపిత ఆ ఏకేశ్వరుడే!*

అని ప్రశాంత చిత్తంతో పలికాడు. మధురాతి మధురమైన ఆ మాటలకు సికిందర్ లోడీ నతమస్తకుడయ్యాడు.కొంతకాలం పిదప కాశీకి వెళ్లి భక్త రవిదాసుచేత దీక్ష పొందాడు. నేడు ఆ స్థానం 'జ్ఞానవాపీ మసీదు' పేరిట బనారసునగరంలో అలరారుతున్నది. భక్త రవిదాసు ప్రేరణవల్ల సికిందర్ లోడీ నాటినుండి పరరాజ్యాలను ఆక్రమించడం

మానుకొన్నాడని, హిందూ ముస్లింల నడుమ సహకార సామరస్యాలు నెలకొల్ప ప్రయత్నించసాగాడని అంటారు.

రవిదాసుకు లభించిన ప్రశంసలు, గౌరవమర్యాదల మూలంగా ఆయన జీవితం అంతిమ భాగంలో పలుప్రదేశాలు పర్యటించే సదవకాశం కలిగింది. పలు భాషీయులతో సంపర్కం కలిగింది. ఆ భక్తుని మహిమలు, సాధనా, సిద్ధుల గురించి విన్నవారనేకమంది ఆయనకు శిష్యులుగా, అనుయాయులుగా అయ్యారు. వారంతా ఆయనను తమ తమ స్థలాలకు ఆహ్వానించి సన్మానించారు. ఆయన వెళ్లిన చోటల్లా ఆ భక్తుని పేర మందిరాలు, మఠాలు, పీఠాలు భక్తిశ్రద్ధలతో నిర్మించారు. నేటికీ ఆయా తావుల్లో భజనకీర్తనలతో ఆయన్ను ఆరాధిస్తుంటారు.

అలాంటి సందర్భంలో ఒకసారి అలహాబాదు 'కుంభ మేలా'కి ఆయన వెళ్లడం జరిగింది. తీర్థరాజమైన ప్రయాగలో పవిత్ర త్రివేణీ సంగమంవద్ద అనేకమంది సాధుసన్యాసులు గుమిగూడారు. మఠాధిపతులు వేరువేరు డేరాలు వేసుకొని తమతమ అనుయాయులతో యుక్తంగా బస చేయసాగారు. అదేవిధంగా రవిదాసుకూడ ఒక గుడారం వేసుకొని తన అనుయాయులతోబాటు బసచేశాడు. ఉపదేశాలు, ప్రవచనాలు చేయడం ఆరంభించాడు. క్రమక్రమేపీ రవిదాసు చర్మకారుడు, కడజాతివాడని తెలుసుకున్న పిదప అక్కడి మఠాధిపతులు, పూజార్లు రవిదాసుని, "నీవు చర్మకారుడవు, అంత్యజుడివి. కనుక ధర్మపీఠాలెక్కి ధర్మోపదేశాలు చేసే అధికారం నీకు లేదు" అని నిరసించారు. "రవిదాసు గొప్ప భక్తుడు, పరమార్థ సిద్ధి పొందిన సిద్ధుడు. గొప్పసాధకుడు, సదాచార సంపన్నుడు. కనుక ధర్మపీఠాలు ఎక్కవచ్చు, ఉపదేశాలు యివ్వవచ్చు"నని రవిదాసు అనుయాయులు ప్రతివాదం చేశారు. "అలాగా...రవిదాసు అంతటి సాధకుడు, సిద్ధుడు అయితే త్రివేణిలో సాలగ్రామాన్ని తేలేలా చేయ మనండి" అని సవాలు విసిరారు ఆ ఛాందస పీఠాధిపతులు.

భక్త రవిదాసు మొదట అందుకు సమ్మతించలేదు. "వాదవివాదాలతో, తర్కవితర్కాలతో నాకు పనిలేదు. జీవనోపాధి సాధనమైన ఈ రాతిబండే నా సాలగ్రామం, నా ఆరాధ్యదైవం. నేను ఎవరితోనూ పందె మొడ్డను" అన్నాడు. అయితే నీవు అసలు భక్తుడవుగాదు, డేరా లేవ దీసుకొని పొమ్మని వత్తిడి చేయసాగారు పీఠాధిపతులు. ఇక తప్పనిసరయింది ఆ భక్తునికి. అవమానం భరించలేకపోయాడు. తన రాతిబండమీద 'రామ్'

శబ్దం రాసి, ఇష్టదైవాన్ని స్మరించుకుంటూ పండితులందరి సాలగ్రామాలతోబాటు త్రివేణీ ప్రవాహంలోకి విసిరాడు. అప్పుడు పండితులు విసిరిన సాలగ్రామాలన్నీ నీటమునిగిపోగా, రవిదాసుని రాతిబండ మాత్రం ఆయన భక్తిమహిమవల్ల నీటిపై తెప్పలా తేలింది. ఇది ప్రత్యక్షంగా చూచిన ఆ పండితులు, పీఠాధిపతులు సిగ్గుపడి ఆ భక్తునికి నతమస్తకులయ్యారు.

భక్త రవిదాసు జీవితంలో యిలాంటి సంఘటనలు, సన్నివేశాలు కోకొల్లలు. వాటన్నిటిలోనూ విజయలక్ష్మి సదాచార సంపన్నుడు, సాత్విక స్వభావుడు, సాటిలేని సాధకోత్తముడు అయిన రవిదాసునే వరించింది.

పుణ్య శ్లోకుడు, భక్తశిరోమణి రవిదాసు తన జీవితపు ఉత్తరార్ధంలో తీర్థాటన నిమిత్తమేగాని, భక్తుల ఆహ్వానాలపైనేగాని దక్షిణాదిన తిరుపతి నుంచి ఉత్తరాదిన ముల్తానువరకు విస్తృతంగా దేశాటన చేసినట్లు తెలియ వస్తున్నది. రాను రాను ఆయనపట్ల ప్రజల్లో శ్రద్ధాభక్తులు పెరిగాయి. భక్తగణం హెచ్చయ్యారు. వెళ్లిన చోటల్లా ఘనంగా స్వాగత సత్కారాలు జరిగాయి. ఆ భక్తునిపేర మందిరాలు, మఠాలు, జలాశయాలు నిర్మింపబడ్డాయి.

ఇక చివరకు ఆ భక్తపుంగవుని భౌతికకాయం ఎక్కడ కాలగర్భంలో కలిసిపోయిందో మాత్రం ఎవరికీ ఖచ్చితంగా తెలియదు. ఈ విషయమై పండితులు, పరిశోధకులలో ఏకాభిప్రాయం లేదు. విక్రమ సంవత్ 1597లో చితోడ్‌గఢ్ సమీపాన భక్త రవిదాసు బ్రహ్మసాయుజ్యం పొందాడని పండితులు అభిప్రాయపడుతున్నారు. కాదు, గంగాతీరాన్నే జీవన్ముక్తుడయ్యాడని మరికొందరు భావిస్తున్నారు. "మీరా స్మృతి గ్రంథం" ప్రకారంగానైతే వి.సం. 1575లోనే ఆయన ఇహలోక యాత్ర పరిసమాప్తమైనట్లు అగుపడుతుంది. కడకు ఆ భక్తునికి సహజమృత్యువే దాపురించిందో లేక బొందితో కైలాసమేగాడో ఎవరికీ తెలియదు. అత్యధిక సంఖ్యాక రవిదాసీయుల విశ్వాసం ప్రకారం వి.సం. 1587లో ఆ భక్తుని జీవన లీల సమాప్తమైనట్లే. ఈ నిర్ణయం ప్రకారం భక్త రవిదాసు 151 ఏళ్ల సుదీర్ఘ జీవితం గడిపినట్లు తేలుతున్నది. రవిదాసును గురించి ప్రత్యేక పరిశోధన చేసిన పంజాబు రాష్ట్ర మాజీమంత్రి శ్రీ పృథ్వీసింగ్ ఆజాద్, పండిత శ్రీ వేణీ ప్రసాద్ శర్మగార్లు ఈ గణనను సమర్థిస్తున్నారు. ఇంతకుమించిన మెరుగైన ప్రమాణాలు లభించనంతవరకు ఈ గణనను మనం సుమారుగా విశ్వసించవచ్చని మరికొందరు పండితులు, ముఖ్యంగా శ్రీ పరశురామ్ చతుర్వేదీగారు, అభిప్రాయం వెలిబుచ్చుతున్నారు.

భక్త రవిదాసు అనుయాయుల, కొందరు పండితులు, పరిశోధకుల నమ్మకం ప్రకారం చిత్తోడ్‌గఢ్ యాత్ర ఆ భక్తుని అంతిమ యాత్రగా కన్పట్టుతున్నది. దాని స్థూలవర్ణన యిది :

భక్త ప్రవరుడు రవిదాసుని కీర్తి ప్రశంసలు, భక్తిమహిమలు పలునోట్ల విన్న ఝూలీ రాణి లేక మీరా భక్తురాలు ఆ భక్తుని చిత్తోడ్‌గఢ్‌కు రావల్సిందిగా అహ్వానించింది. ఆ ఆహ్వాన మందుకొన్న రవిదాసు అక్కడకు వెళ్లాడు. కొంతకాలం అక్కడ వున్నాడు. నిత్యం ధూపదీప నైవేద్యాలతో పూజా పునస్కారాలు జరుగుతుండేవి. పూజానంతరం భక్తుని ప్రవచనాలు జరుగుతుండేవి. అయితే అక్కడి సనాతన వాదులు, ఛాందస పండితులకు ఈ వరస నచ్చలేదు. వాళ్లు రవిదాసును సదా వ్యతిరేకిస్తూ వుండేవాళ్లు. అయితే భక్తుడు రవిదాసు రాణి ఆశ్రయంలో వుండడవల్ల వారి విరోధ చేష్టలు పైకి పొక్కక లోలోనగా సాగుతూండేవి.కాని రవిదాసుకు, ఆయన అనుయాయులకు వాటి ప్రత్యక్షఫలితాలు అనుభవించక తప్పేదికాదు.

ఒకనాడు ఈ విరోధుల నిరసన, వెకిలి చేష్టలు చరమస్థాయికి వెళ్లాయి. ఆనాడు రవిదాసు పూజాపీఠం నుండి లేచేసరికి ఈ సనాతనులంతా చేరి "ఒక చర్మకారునికి, యజ్ఞోపవీతరహితునికి పూజలు, ప్రవచనాలు చేసే అర్హత లేదు!" అంటూ కేకలు వేయసాగారు. అప్పటికే వారి చేష్టలకు విసిగివేసారి వున్న ఆ పరమ సాధువు పట్టరాని ఆవేశంతో "ఎందుకులేదు యజ్ఞోపవీతం? ఇదుగో చూడండి!" అంటూ తన ఛాతీ చీల్చి చూపాడట. లోనున్న (రక్తనాళాల) యజ్ఞోపవీతం కోటిసూర్యుల కాంతితో భాసించింది. ఆ దివ్యతేజస్సును చూడలేక అక్కడ వున్న వారంతా కళ్లు మూసుకున్నారట. కాసేపటికి తిరిగి కండ్లు తెరిచి చూచేసరికి పరమభక్తుడు రవిదాసు భౌతిక కాయం అంతర్ధానమైపోయి వుంది. అక్కడ కేవలం ఆయన పాదాల గుర్తులు రెండు మాత్రం మిగిలి వుండినాయి. అప్పుడు ఛాందస పండితులు, సనాతనవాదులతో సహా అక్కడవున్నవారంతా భక్తివినమ్రతలతో ఆ పాద చిహ్నాలకు ప్రణమిల్లారట. నేటికీ చిత్తోడ్‌గఢ్ కుంభన శ్యామ మందిరానికి కుడివైపున అంకితమై వున్న భక్త రవిదాసు పాదచిహ్నాలకు సకల వర్ణాల ప్రజలు భక్తి శ్రద్ధలతో ప్రణమిల్లుతూ, పూజలు చేస్తూవుంటారు.

* * *

# 10

# భక్తుని చదువుసంధ్యలు

భక్త రవిదాసు అంతగా చదువుకొన్నవాడు కాదని ఇప్పటివరకు లభించిన ఆధారాలను బట్టి అత్యధిక పండితులు, పరిశోధకుల అభిప్రాయం. కాని తత్త్వవేదులైన సత్పురుషులు, సాధువుల సాంగత్యంలో కారణజన్ముడైన ఆ మహానుభావుని నిర్మల, నిశ్చల సహజ ప్రతిభ అద్భుతంగా వికసించింది. కనుక మానవ జీవితానికి ఎంతో అవసరమైన యథార్థతత్వం గ్రహించగలిగాడు భక్త రవిదాసు.

చదువు సంధ్యలకు నేటి సమాజంలో గల ప్రచారం, సదుపాయాలు భక్త రవిదాసు కాలంలో లేకపోవచ్చు. ఒకవేళ ఏవైనా సదుపాయాలు వున్నా కరడుగట్టిన సనాతన మూఢాచారాలకునిలయమైన నాటి సామాజిక వ్యవస్థలో రవిదాసులాంటి అంత్యజునికి అగ్రవర్ణాలకు చెందినవారితో కలిసికాదుగదా కనీసం తోటి కులస్తులతో కలిసి అయినా విధివత్తుగా చదువుకోవడానికి ఆస్కారం లేకపోయిందేమోకూడ. అయినా భగవద్భక్తుడవడానికి, ఆత్మజ్ఞాని కావడానికి విశ్వవిద్యాలయాలు, గురుకులాల యోగ్యతాపత్రాలు సాధకులు, భక్తశ్రేష్ఠులకు అసలే అనవసరం. నిరామయుడు, నిరాకారుడు అయిన ఏకేశ్వరునిపట్ల నిజమైన శ్రద్ధాసక్తులు, ఈ లౌకిక జీవితం, ఐహిక ప్రపంచం అనిత్యమనే పరిపూర్ణ జ్ఞానం - ఇవే భక్తునికి కావలసిన ప్రాథమిక లక్షణాలు. రవిదాసుకు యీ లక్షణాలు పుట్టుకతోనే అబ్బినవి. ఆయన జన్మతః భక్తుడు గనుక సహజ సాధన, సత్సాంగత్యం, అన్నిటినీ మించి స్వయంప్రజ్ఞలద్వారా ఆత్మజ్ఞానం సముపార్జించుకొన్నాడు. చదువుసంధ్యలు, భాషాజ్ఞానం అసలే లేకపోలేదు గాని ఈ విషయమై ఆ భక్తుడు ఏ లౌకిక గురువుల వద్ద లేక ఏ లౌకిక పాఠశాలల్లో చదవలేదు. ఒక విధంగా కబీరుదాసు గురించి వాడుకలో వున్న

మసి కాగద్ ఛువో నహి, కలం గహియో నహి హాథ్

మసి కాగితం ముట్టలేదు, కలం చేతబట్టలేదు

అనే ఉక్తి భక్త శిఖామణి రవిదాసు విషయంలోకూడ పదహారణాలా వర్తిస్తుందనవచ్చు.

అయినప్పటికీ గురు రవిదాసు జీవితం, ఆయన ప్రబోధాలను గురించి అధ్యయనం, పరిశీలన చేసినవారికి అజ్ఞానాంధకారంలో మగ్గుతూ, మూఢాచారాలతో సతమతమవుతున్న మానవ సమాజానికి ఆ పరమ సాధకుని పవిత్ర వాణి, పావన ఉపదేశాలు ఎంత అవసరమో, ఎంత ఉత్తమమో బోధపడక మానదు. ఇంకా భక్త రవిదాసు వాణిలో, ఆయన గావించిన సరళ వుపదేశాలలో వేదాలు, ఉపనిషత్తుల విజ్ఞానం, గీతాతత్వ సారం, రామాయణ భారతాల ఆదర్శాలు మొదలైనవి సామాన్య ప్రజలకు సైతం అరటిపండు వొలిచిపెట్టినట్లు అవగాహన అవుతాయి. భాషా విషయికంగా చూస్తే రవిదాసు రచనల్లో రాజపుటానా, గుజరాతీ, పంజాబీ, హిందీ మొదలైన వివిధ వాడుకభాషా పదాలు, వాటితోబాటు అరబ్బీ, పార్సీ, ఉర్దూ భాషాపదాలుకూడ గోచరిస్తాయి. రవిదాసు జన్మతః భక్తుడు, సాధకుడూను. సహజసాధన ద్వారా ఆధ్యాత్మిక సిద్ధి పొందిన మహాసిద్ధుడు. అందుచేతనే లౌకిక గురువులు, లౌకిక పాఠశాలలు, లౌకిక విద్యలను ఉపేక్షించి, ఆధ్యాత్మిక పాఠశాలలో అధ్యయనం చేసి ఆధ్యాత్మిక విద్యలో అద్వితీయునిగా పరిణమించాడు. "గురువులు దివ్యపదవికిన్ దెరువులు సెప్పరు..." అనే భక్త ప్రహ్లాదుని కోవకు చెందిన వాడు రవిదాసు. అందుకే "చలి మన హరి చటసాల చఢావు" ( ఓ మనసా! భగవంతుని పాఠశాలలో చేరుస్తాను పద!) అని మనసుకు ప్రబోధించు కుంటాడు ఆ భక్త శిఖామణి.

అందువల్లనే భక్త రవిదాసు సమకాలిక సమాజంలోను, అలాగే నేటి సమాజంలో కూడ గొప్ప సాధకునిగా, దైవాంశ సంభూతునిగా నిలవ గలిగాడు. సన్మానాలు పొందగలిగాడు, నేటికీ పొందుతున్నాడు. సమాజంలో రవిదాసు కింత ప్రాధాన్యం లభించడానికి కారణమేమిటి అని ప్రశ్నించు కుంటే అదంతా ఆయనయొక్క పరంపరాగత సంస్కారం, సత్సాంగత్యం, విస్తృత పర్యటనమూలంగా అబ్బిన లోకానుభవం, గురుకృప, వీటన్నింటినీ మించిన స్వతః ప్రజ్ఞలవల్లేనని తేలుతుంది. జీవ జగత్తంతా మిథ్యా వ్యాపారమనే పరమజ్ఞానం, సత్యాన్వేషణాతత్వం, ఏకేశ్వరుని పట్ల అచంచల విశ్వాసం, భక్తిపారవశ్యం - యివన్నీ భక్త రవిదాసుకు బాల్యం నుండే అబ్బాయంటే అదంతా పూర్వజన్మ సంస్కారఫలమనిగాక మరేమనుకోవాలి.

ఆధ్యాత్మిక విప్లవకారుడైన ఆచార్య రామానందుని శిష్యగణంలో రవిదాసు, కబీరు, ధనా, పీపా, సేనా, పద్మావతి మొదలైన ద్వాదశ భక్తులు ప్రముఖులని చెప్పుకున్నాము గదా. చదువుసంధ్యలకు సంబంధించి నంతవరకు, సుమారుగా వీరంతా నిరక్షరాస్యులు లేదా ఏదో కొద్దిపాటి అక్షరజ్ఞానం వున్నవారు మాత్రమే. అయినా వీరు గురుభాయీలు, అంటే సహపాఠులు. వీరు దీర్ఘకాలం పరస్పరం కలిసి వున్నారు. బహుదేశాటన సలిపారు. ప్రజలకు ఉపదేశామృతం పంచారు. సమాజంలో ఒక సంచలనం, ఒక నవీన జాగృతి కలిగించారు. దానికి తోడు ప్రత్యర్థులను, వారి ప్రతిక్రియలను ధైర్యసాహసాలతో ఎదురుకొన్నారు. దైవజ్ఞుడు, మహాపండితుడు, వ్యవహారకుశలుడు అయిన ఆచార్య రామానందుడు తన మార్గంలో అడ్డుపడిన ప్రతికూల ఘటనలను, ఛాందస ప్రత్యర్థులను ఎలా నేర్పుగా ఎవరినేవిధంగా యథాయోగ్యంగా ఎదుర్కొన్నాడో, ఎవరికే సముచిత యుక్తులతో సమాధానాలు యిస్తూ విజయం పొందగలిగాడో అవన్నీ ఆయన వెంటనున్న నిరక్షరాస్యులు లేక స్వల్ప విద్యాంతులు అయిన ఆయన శిష్యబృందం ప్రత్యక్షంగా గమనించారు. వారివారి ప్రజ్ఞా ప్రతిభల మేరకు అవగాహన చేసుకున్నారు. మొత్తానికి, ఏది నేర్చుకుంటే యింకేమీ నేర్వవల్సిన పనిలేదో అలాంటి పరమోత్కృష్ట పరావిద్యనే అభ్యసించారు. అందుచేతనే ఆ మహాచార్యుని అభినిష్క్రమణం పిదప ఆ శిష్యులంతా వారి వారి శక్తియుక్తుల కొద్దీ, తమ తమ విలక్షణ శైలి, ధోరణులనుబట్టి జనసామాన్యాన్ని, సమాజవ్యవస్థను సరిదిద్ద సమర్థు లయినారు. గురువుకు తగ్గ శిష్యులుగా నిరూపించుకున్నారు. వారిలోనూ విద్యలకు విద్య అయిన పారమార్థిక విద్యలో బహునిష్ణాతుడైనాడు మన భక్త రవిదాసు.

* * *

# 11

# రవిదాసు భక్తిసాధన

భారతీయ పరంపరానుసారం భక్తి భావన ఉపనిషత్తుల కాలంనుండీ విభిన్న రూపాలలో అగుపడుతున్నది. కానైతే అది సనాతనుల, ఛాందసుల ఆడంబరమైన కర్మకాండలు, నియమనిబంధనలమధ్య చిక్కుబడి సర్వులకూ అందుబాటులో లేకుండింది. అనంతరకాలంలో మధ్వాచార్యులు, రామానుజాచార్యులు, రామానందుడు మొదలైన సాధక శ్రేష్ఠులు ఆ సంగతి గమనించి కర్మకాండల్ని, బాహ్యాడంబరాల్ని తీసివేసి భక్తిని సరళం, సుగమం, సర్వసులభం గావించారు. జ్ఞానప్రాప్తికి భక్తి ప్రధాన సాధనమన్నారు. అంటే పూర్వ సంప్రదాయాన్ని మరింత ప్రజోపయోగకరంగా మార్చారు కాలదర్శులైన ఆ భక్త శిఖామణులు. భక్తి, ప్రతిపత్తి, అంకిత భావాలు నైతిక జీవితానికి పునాదులవంటివి. కనుక వాటిని ప్రజలలో ప్రవేశపెట్టసాగారు. ఆ పరివర్తనాకాలంలో పాత విలువలు నశింపసాగి, కొత్త విలువలు పాదుకో దొడగినవి. ఇంకా ఆ భక్తుల విశిష్టత ఏమంటే సామంజస్యం, వివేకబుద్ధి, అసూయారాహిత్యం అనే మూడు సద్గుణాలను నాటి భక్తిభావధారలో ప్రవేశపెట్టారు. అసలుకు ఆ భక్తులు ప్రజాసామాన్యం నుండి వచ్చినవారే గదా. కనుక ఒకవైపున ప్రజల అవస్థలు బాగా అవగాహన చేసుకోగలిగారు. మరోవైపు సాంప్రదాయిక కర్మకాండలు అనవసర ఆడంబరాలు, సాంఘిక అసహన భావాలను తోసిరాజని, భక్తి సాధనా మార్గంలో అంతవరకు వున్న కఠినమైన విధినిషేధాలను సడలింపజేసి, వాటిస్థానే సార్వజనీన భావనలను, మానవతా వాదం, భక్తిమార్గాలను పాదుకొల్పారు. అందునా సర్వజన సులభమైన 'రామ' నామం ఎంపిక చేసుకున్నారు. దానిని బాగా ప్రచారంలోకి తెచ్చారు. ఇంతేగాక మానవ సహజ అవగుణాలను ఉపేక్షించి, మనుష్యుల్లోని ఈశ్వరోన్ముఖ సద్గుణాలకు ప్రాధాన్యం యిచ్చారు. ఇంద్రియ నిగ్రహం, పవిత్ర చరిత్ర భక్తుల జీవిత సాధానికి ప్రధాన స్తంభాలని సూచించారు.

నాటి భక్తులకు, వారి భావ స్రవంతికి రవిదాసు వారసుడైనాడు. అందుకే పూర్వాపరాల భక్తి సంప్రదాయాల ప్రభావం, అంటే సాంప్రదాయిక

వేదాలు, ఉపనిషత్తుల వేదాంత పద్ధతి, నాథసాంప్రదాయపు యోగీశ్వరుల సిద్ధి పరంపర, బౌద్ధ చింతకుల ఆలోచనాసరళి, శైవవైష్ణవ భక్తుల మిశ్రిత ఆలోచనా స్రవంతుల ప్రభావం, యివిగాక విదేశీయుల అనగా ముస్లిం సూఫీ భక్తుల భావప్రభావం అన్నీ ప్రత్యక్షంగానైతేనేమి, పరోక్షంగానైతేనేమి ఇతర భక్తులకంటె రవిదాసే ఎక్కువగా అనుభూతికి తెచ్చుకున్నాడు. ఆ దివ్యానుభూతి ద్వారానే తన మార్గం ప్రశస్తం చేసుకుని, సమాజ పునర్నిర్మాణానికి పూనుకున్నాడు.

రవిదాసు జన్మతః భక్తుడు, ఆయన భక్తి అంతర్ముఖమైనదీ, సాధనాపరమైనదీను. అందుచేతనే కబీరు, నామదేవాది భక్తుల సాధనా పద్ధతి హృదయంగమం చేసుకున్నాడు గాని వారి ఖండన మండన పద్ధతి ననుసరించలేదు. భావప్రధానమైనది ఆయన భక్తి. కనుక ఎవరైతే మనఃపూర్వకంగా ఆ ఏకేశ్వరునికి అంకితంకారో, వారి పూజార్చనలు, జపతపాదులు అన్నీ బూడిదలో పోసిన పన్నీటి చందమేనని, కడకు వారికి ముక్తికూడ లభించదని ఆయన ప్రబోధం. ఈ ఉద్దేశ్యంతోనే రవిదాసు విగ్రహారాధన, యజ్ఞయాగాదులు మొదలైన బాహ్య కర్మకాండల్ని ఉపేక్షిస్తాడు. ఆయన దృష్టిలో కర్మయే ఈశ్వరుడు; ఈశ్వరుడే కర్మ. సర్వవ్యాపి, సర్వాంతర్యామి అయిన ఆ భగవంతుడు ప్రేమపూర్వకమైన భక్తికి ప్రసన్నుడవుతాడు. దీన జనోద్ధారకుడు, పతితపావనుడు అయిన భగవంతుని ఆరాధించడానికి విశుద్ధ భక్తి వినా వేరుమార్గం లేదని రవిదాసు అభిప్రాయం.

భక్త రవిదాసు స్వతంత్ర చింతకుడు, నవ్యభావ ప్రతిపాదకుడు, స్వాతిక స్వభావుడు, వినయశీలి. తాను చేయదల్చుకున్న భక్తి ప్రచారానికి యితర భక్తుల్లాగ ఖండన మండన విధానం, వ్యంగ్యశైలి అవలంబించకుండా సమయోచితమైన సమన్వయ మార్గం అవలంబించాడు. పరధర్మ నిరసనకు బదులుగా స్వధర్మ ప్రతిపాదన గావించాడు. ఆత్మసాధనలోనే అధికంగా లీనమైనాడు. భక్తిమార్గంపట్ల అచంచల నిష్ఠతో ఆత్మవిశ్వాసంతో వుండకపోతే తీర్థాటనలు, వేషభాషల వంటి బాహ్యాడంబరాలు ఎన్ని వున్నా ప్రయోజనం శూన్యమన్నాడు. విశ్వనియంత, సృష్టికర్త అయిన ఏకేశ్వరుని సన్నిధి ప్రాప్తికి సరళాతిసరళ మార్గం భక్తిమార్గమేనని నిరూపించాడు. దానికి ప్రతీకగా 'రామ' నామం జనసామాన్యానికి అందించాడు.

శ్రవణం,కీర్తనం, విష్ణో : స్మరణం, పాద సేవనం,
అర్చనం, వందనం, దాస్యం, సఖ్య మాత్మ నివేదనం

అని భక్తి నవ విధాలైనది. దీనినే 'నవధా భక్తి' అన్నారు. ఇందు అంతిమ విధానమైన 'ఆత్మ నివేదనం' అతి సరళమైనది. అందరికీ అందుబాటులోనిది. పరమాత్మ, జీవాత్మల బంధం అవినాభావ సంబంధం. ఒకదాన్ని మరొకదాన్నుంచి విడదీయ రానిది. అలా విభక్తం గానిదే భక్తి. అంటే 'నేను, నాది' అనే అహం పూర్తిగా నశింపు గావాలన్నమాట. పంచతత్వాల యీ శరీరం పంచ భూతాలలో కలిసిపోయిన పిమ్మట 'నేను' అనేది ఎవరు? ఎక్కడ? ఆత్మనివేదనలో భక్తుడు తన సర్వస్వమూ ఆ పరమాత్మునకు సమర్పణం చేసుకోవాలి.

భక్త శిఖామణి రవిదాసు సహజ సాధకుడు. ప్రాణికోటిలో మానవ జన్మ ఉత్తమమైనదని, అది అతి దుర్లభమని విశ్వసిస్తాడు. ఎన్నెన్ని జన్మల అనంతరం యీ మానవ జన్మ లభించిందో జీవునకు అని ఆశ్చర్య భావం వ్యక్తం చేస్తాడు. జనన మరణాల బంధనాల నుండి విముక్తి దైవభక్తిలో సద్వినియోగం చేయమని చెబుతాడు. సర్వసాధారణంగా ప్రజలు ముక్తిప్రాప్తి కొరకు, భక్తి సాధన కోసం యజ్ఞయాగాలు చేస్తారు. జపతపాలు సలుపుతారు. ఇల్లూ వాకిలీ, బంధుమిత్రులు అందరినీ వీడి అడవులు, కొండలు, గుహలు ఆశ్రయిస్తారు. కాని నిజమైన భక్తునికి యీ ప్రయాసలేవీ అవసరం లేదంటాడు రవిదాసు. ఇవన్నీ భక్తి పేర జరిగే ఆడంబరాలని, భ్రమలని, వీటన్నిటిని వదిలిపెట్టి రేయింబవళ్లు రామ నామ స్మరణలో తన్మయులై వుండమని, కామక్రోధాది వికారాలకు దూరంగా వుండమని, ఇంకా ఆత్మ సమర్పణ భావంతో భగవన్నామ స్మరణ చేసినవారికి ఆ పరాశక్తి సాయుజ్యం అవలీలగా లభించగలదని ఆ భక్త పుంగవుడు బోధిస్తాడు.

అసలయిన భక్తుని కొక షరతు పెడతాడు భక్త రవిదాసు. 'అహం' వీడనివాడు భక్తికి అనర్హుడని, అది వీడినవాడే భక్తి సాధనలో కృతకృత్యుడై, తద్వారా పరాశక్తిని చేరగలుగుతాడని చెబుతాడు. ఇందుకొక ఉదాహరణ యిస్తున్నాడు చూడండి. ఇసుకలో కలిసి పోయిన పంచదారను క్షుద్రజీవులైన పిపీలికాదులు ఏరుకుని తినగల్గుతాయి గాని మహాకాయం గల ఏనుగుకు అది సాధ్యం కాదు. అదే విధంగా 'అహం' తో పొంగిపోయే మానవ మహాకాయానికి అనేక విధాల మాయ ఆవరణలోవున్న ఆ పరాశక్తిని

పొందడం అసాధ్యమంటాడు సాధక శిరోమణి రవిదాసు. ఉపనిషత్తుల భాషలో భక్తి సాధన ఒక అసిధారా వ్రతం, అంటే కత్తిమీది సాము లాంటిది.

భక్తి సాధనలో రవిదాసు గ్రహించిన రహస్యం యీ 'మాయ' ఒక ఇంద్ర జాలం వంటిదని. తన హస్తలాఘవంతో ప్రేక్షకుల్ని మంత్రముగ్ధుల్ని చేస్తాడు ఐంద్రజాలికుడు. ప్రేక్షకుల్లో యెంతటి బుద్ధికుశలులు, విజ్ఞులువున్నా అందరికందరూ మైమరచి ఆ ప్రదర్శన చూస్తూవుంటారేగాని గారడీవాని రహస్యాల నెరుగగలిగే వారెవరూ వుండరు. అదేవిధంగా జిత్తుల మారి 'మాయ' ఉచ్చులనుండి తప్పించుకోవడం మానవ మాత్రులకే గాదు దేవతలకు సైతం తరం గాదంటాడు రవిదాసు.

మరి యింతటి గొప్ప ప్రభావంగల 'మాయ' ప్రభావం నుండి తప్పించుకోవడానికి ఏమైనా మార్గమున్నదా అంటే వుందంటాడు రవిదాసు భక్తుడు. ఆయన అభిప్రాయం ప్రకారం దైవభక్తియే ఆ మార్గం. ఈశ్వర భక్తి జ్ఞాన నేత్రాలను తెరిపిస్తుంది. ఆ జ్ఞాన చక్షువుల ద్వారా వీక్షించినప్పుడు ఆ మహా ఠగిని (మోసగత్తె) 'మాయ' కార్యకలాపాలు, మర్మాలు, రహస్యాలు సునాయాసంగా అవగాహన అవుతాయి. వాటి నిస్సారత, నిరర్ధకతకూడ తెలియవస్తుంది. తెలియక చిక్కుకుంటే చిక్కు కొందురుగాని తెలిసిన పిమ్మట బుద్ధి జీవులు ఆ మాయలమారి 'మాయ' ఎత్తులకు, జిత్తులకు లోబడరని సాధకోత్తముడు రవిదాసు స్వానుభవంతో బోధిస్తాడు. అంతేగాదు, తన జీవితం ద్వారా నిరూపించి చూపిస్తాడు.

ఉత్తమ సాధకుడు, భక్తినే సర్వోపరిగా నెంచే భక్తుడు కాబట్టే రవిదాసు తోటి భక్తజనాళికి నిరంతరం "అంబుజోదర దివ్యపాదారవింద చింతనామృత పాన మత్తులై" వుండమని బోధిస్తాడు. క్షణికోపాసనలకు, అల్పకాల భక్తి ప్రపత్తులకు ఆ పరాశక్తి సాయుజ్యం అసంభవమని ఘంటాపథంగా చెబుతాడు.పరాశక్తిని చేరుకోవడానికి అత్యంత ఆవేదన, అపార ఆరాటం భక్తునికి మిక్కిలి అవసరం. ఇంకా నిజమైన భక్తునికి భక్తిపారవశ్యం కావాలంటాడు రవిదాసు.

జబ లగ నదీ న సముంద సమావై
తబ లగ బఢై హంకారా

జబ మన మిల్యో రామ సాగర సో
తబ యహ మిటే పుకారా

అని పదం పాడుతాడు. అంటే కడలిలో కలిసేంతదాకా నదీ ప్రవాహం ఉరకలు తగ్గనట్లుగానే తన గమ్యాన్ని - అంటే పరాశక్తిని - చేరేంతదాకా భక్తుని తపన, ఆవేదన, భక్తి పారవశ్యాలు తగ్గగూడదని రవిదాసు ప్రజలకు పాఠం చెబుతాడు.

శ్రద్ధ, సత్సంగం, నామ జపం - యివి రవిదాసు భక్తికి మూలకందాలు. ఆ సాధకుని కథనానుసారం శ్రద్ధలేనిచో సత్సంగం, సత్సంగం లేని యెడల నామ జపం లేదు. నామ జపం లేనివానికి భక్తి శూన్యం, ముక్తీ శూన్యమే. భక్తి రసాన్ని 'మహారసం' అంటాడు రవిదాసు. మామూలు మనుషులు పదేపదే పూటుగా మదిరా పానం చేసి మత్తెక్కి చరిస్తుంటారు. ఒళ్లూ, ఇల్లూ గుల్ల జేసుకుంటారు. అయితే ఆ మత్తు ఎప్పటి కప్పుడు దిగిపోతూ, మళ్లీ మళ్లీ తాగవల్సి వస్తూంటుంది. అలాంటి వారికి రవిదాసు అందుకు బదులు భక్తి 'మహారసం' తాగమని సలహా యిస్తాడు. ఆ రసపానంతో యెక్కిన మత్తు యెక్కినట్టుగానే వుంటుందిగాని దిగడమంటూ వుండదు. అనగా భక్తుడు చివరకు పరాశక్తిలో లీనమైపోతాడు; జన్మ తరించిపోతుందన్నమాట.

భక్తి సాధనలో చరమస్థాయి నందుకున్నవాడు రవిదాసు. 'గౌణ భక్తి' అని 'పరాభక్తి' (సర్వశ్రేష్ఠ భక్తి) అని భక్తికి రెండవస్థలు చెప్పబడినవి. వీటిలో మొదటిది సాధనావస్థ అయితే, రెండవది తురీయావస్థ (సిద్ధావస్థ) అన్నమాట.

నారద భక్తి సూత్రానుసారం సిద్ధావస్థ లక్షణాలివి :

తత్ప్రాప్య తదేవాలోకయతి, తదైవ శృణోతి,
తదేవ భాష్యతి, తదేవ చింతయతి.

అంటే ఆ పరాశక్తిని చేరుకున్న భక్తుడు ఆ ప్రభువు ప్రేమలో లీనమై తన్మయావస్థలో ఆ ప్రభువునే చూస్తుంటాడు. ఆయననే వింటూంటాడు; ఆయన గురించే చర్చిస్తుంటాడు. ఆ ప్రభువు గురించే యోచిస్తూంటాడు. సరిగ్గా యిదే భావాన్ని భక్త రవిదాసు ఏ తీరుగా వ్యక్తపరుస్తున్నాడో చూడండి :

చితు సిమరన కర ఉనైన అవలోకనో
శ్రవన వాని సుజను పూరి రాఖఉ,
మన సుమధకరు కరఉ చరన హిరదై ధరఉ,
రసన అమృత 'రామనామ' భాఖఉ.

ఆ పరాశక్తిని చేరిన పిమ్మట ఆ భక్తుడు సదా ఆ పరాశక్తినే చిత్తమందు స్మరిస్తూ, నేత్రాలతో ఆ శక్తినే దర్శిస్తూ వుంటాడు. కర్ణపుటాలతో దాని గుణగణాలనే వింటుంటాడు. ఆ పరాశక్తి పాదపద్మాలనే ధ్యానిస్తూ, అమృతమయమైన ఆ నామమే నాలుకతో రుచిచూస్తూంటాడు (జపిస్తూంటాడు).

గౌణ భక్తిని మించినది పరాభక్తి. అది చాల గొప్పది. పై కథనాన్ని బట్టి మహాత్మా రవిదాసు భక్తిమార్గంలో సాధనావస్థను దాటి సిద్ధావస్థను చేరుకున్నాడనడంలో సందేహం లేదు.

గురువును ఎన్నుకోవడంలో రవిదాసు బహు జాగ్రత్తపడ్డాడు. తన ప్రధాన ధ్యేయం – ముక్తిపదం – చేరడానికి మార్గదర్శకుని (గురువును) ఎన్నుకొనే సదవకాశం జీవితంలో పదేపదే దొరకదు.*

*యుగాన్ని బట్టి వ్యక్తికి, వ్యక్తినిబట్టి యుగానికి ఒక విశిష్టత లభించడం సహజం. అది చరిత్ర లక్షణం. భక్తమండలి ఆవిర్భవించినది చారిత్రకంగా మధ్యయుగంలో. ఆ యుగ సాహిత్యంలో గురువు విశిష్టత, సత్సంగ మహిమలు అధికంగా వర్ణింపబడినాయి. కబీరు, రవిదాసు, నామదేవ్, చరణదాసు, ధర్మదాసు మొదలైన నాటి భక్తులు గొప్ప చదువరులుగాని, శాస్త్రపండితులుగాని కారు. అందరి కందరూ తత్వజ్ఞానులు. వారి తత్వజ్ఞానం లౌకిక పాఠశాలల్లో అలవడినది గాదు. గురువులవల్ల, వారి సత్సాంగత్యాలద్వారా లభించిన జ్ఞానమే. అందుకే గురువులకు, వారి సత్సాంగత్యాలక్కు నాడెంతటి గరిమ, మహిమలు ఆపాదింపబడినవంటే కబీరువంటి భక్త శిరోమణి కూడ స్వర్గం పిలిచినా గురువును, సత్సంగాన్ని వీడి వెళ్లడానికి నిరాకరిస్తాడు. ఎందుకంటే స్వర్గధామంలో గురువు, ఆయన సత్సంగం లభించవని కబీరు భయం.

అయితే నాటి భక్తులు అంతర్ముఖులయిన సాధకులు. అందువలన జటా కమండల కాషాయ వస్త్రధారులని గాక యోగ్యతాయోగ్యతల విషయం చక్కగా యోచించి మరీ సద్గురువులను ఎన్నుకొన్నారు. జీవిక కోసం ఇంటింటికీ తిరిగి రుద్రాక్షమాలలు పంచే సన్యాసులను గాక ముక్తిమార్గంలో

దోషరహితులైన వారెవరూ సామాన్యంగా వుండరు. అట్టివారెవరైనా వుంటే అది పతితపావనుడు, దీనజనోద్ధారకుడు అయిన ఆ పరమేశ్వరుడొక్కడే. అందుచేత ఆ పరాశక్తినే గురువుగా స్వీకరించాడు రవిదాసు. ఆ శక్తినే ఆరాధించాడు. ప్రేమతో పూజించాడు. ప్రేమమయం ఆయన పూజ; ప్రేమమయం ఆయన భక్తి. ఆ భక్త శిఖామణి ఏమి చేసినా అంతా కడు ప్రేమతో, సంపూర్ణ సమర్పణ భావంతోనే చేశాడు. కడకు తన్నుతానే ఆ ఆరాధ్యదైవానికి అర్పించుకున్నాడు. అనన్య భక్తి పారవశ్యంలో తన్మయుడైన ఆ భక్తశ్రేష్ఠునికి తన ఆరాధ్యుని పూజించడానికి అకళంకిత పవిత్ర సామగ్రి లభించలేదట. ఎందుకంటే పాలు లేగదూడల ఎంగిలియినవి; పూలు తుమ్మెదలు పాడు జేసినవి; నీళ్లు జలచరాలచే పంకిలమైనవి. ఈ విధంగా ఏది చూచినా అపవిత్రమైనదే. సంపూర్ణ పవిత్రతగల పూజాద్రవ్యాలయితే కావవి. కనుక వివశుడై రవిదాసు భక్తుడు తన ఆరాధ్యునికి తన హృదయమే సమర్పించుకుంటాడు. ఈ విధంగా తన సర్వస్వం అర్పించుకున్న ఆ మహానుభావుని భక్తిలో ఆత్మానుభూతి, తన్మయత్వం, అంకితభావం, ఆత్మార్పణలు స్పష్టంగా గోచరిస్తాయి.

భక్తవరులు అవతరించిన యుగం మధ్యయుగం. గురుప్రభావం, సత్సంగ మహిమలను వాటి సాహిత్యంలో వేనోళ్ల కొనియాడారు. సత్సంగం అనగా మంచి సహవాసం. భక్తులు, సాధకుల అభిప్రాయంలో యిది ఎంతో లాభకరం, ప్రభావదాయకమైనది కూడ. చందనం (గంధం) పూతతో సమస్తమూ సువాసనమయం అవుతుంది. పరుసవేది స్పర్శతో ఇనుము బంగారంగా మారుతుంది. అంతకంటె గొప్పది గురువు సాంగత్యం. అందుకే,

రామ బులాయా భేజియా, దియా కబీరా రోయ్ ।
జో సుఖ సాధు సంగ మే, సో వైకుంఠ న హోయ్ ।

---

తగు విధంగా పథనిర్దేశం చేయగల అనుభవశాలురనే వివేకబుద్ధితో ఎన్నుకున్నారు. ఆ గురువుల్ని ఈశ్వర ప్రతినిధులుగా భావించి వారి సత్సాంగత్యంలో కాలంగడిపారు. ఈ విధంగా గురుబోధ, సత్సంగాల మాధ్యమంగా సమాజంలో
2 సద్గుణాల వికాసం కోసం, దుర్గుణాల వినాశం కోసం పాటుపడ్డారు. అందుకవసరమైన ఆచరణ శుద్ధి సాధించారు నాటి భక్తులు.

రాముడు పిలవనంపితే పోవడానికి కబీరుకు ఏడుపొచ్చింది. ఎందుకంటే సాధుజనుల సాంగత్యంలో వుండే సుఖం వైకుంఠంలో కూడ వుండదు గనుక.

అని వెల్లడిస్తాడు కబీరు. అంటే గురుదేవుల, సజ్జనుల సాంగత్యం వీడి స్వర్గాన్నైనా కాంక్షించనంటాడు.

ఇక రవిదాసయితే సత్సంగానికి మరింత ప్రాధాన్యం యిస్తాడు. సత్సంగాన్ని మించినది మరొకటి సాధనాక్షేత్రంలో లేదంటాడు. దాని గరిమ, మహిమలను సిద్ధపరచడానికి వివిధ ఉదాహరణలు ఉటంకిస్తాడు. కాలవలు, బోదెల గుండా పారిన కలకనీరు, చిన్నచిన్న వాగులు, నదుల గుండా పారిన మురికి నీరు గంగానదిలో కలవడంతోనే పవిత్ర నిర్మల జలమవుతూంది. స్వాతి వర్ష బిందువులు పాముపడగపై పడి మణిగాను, అరటిచెట్టుపై కర్పూరంగాను, ఆలిచిప్పలోపడి ముత్యాలుగాను రూపొందుతున్నాయి. అదేవిధంగా ఎంత దుర్మార్గుడయినా గానీ సత్సంగ ప్రభావంతో సజ్జనుడవుతాడని రవిదాసు గట్టి నమ్మకం. ఇంకా యీ సత్సంగ ప్రభావం వల్లనే తాను సంఘంలో నిమ్నకులంలో జన్మించినా ఉచ్చస్థాయికి ఎదగగల్గానని, అన్ని వర్ణాలవారికి వంద్యుడనయ్యానని చెబుతాడు. తన పేరుప్రతిష్టల కన్నింటికీ ఆ సద్గురుని సాంగత్యం, ఆ పరమేశ్వరునిపట్లగల నిశ్చలభక్తి ప్రపత్తులే కారణమని వినయంగా, స్పష్టంగా చెప్పుకుంటాడు. కనుకే ఆ సాధక శిరోమణి సత్సాంగత్యాన్ని బలపరుస్తూ, "సత్సంగం లేనిదే భావం జనించదు; భావావేశం లేనిదే భక్తి కలగదు" (సాధు సంగతి బిన భావ న ఉపజై, భావ బిన భక్తి నహి హెూయ్) అని ప్రబోధిస్తాడు. తాను సైతం తన ఆరాధ్య దైవాన్ని "సదా సత్సంగం ప్రసాదించు ప్రభూ!" అని వేడుకుంటాడు.

దైవసాయుజ్యం మానవాళి ప్రధాన ధ్యేయం. భక్తి దానికి తగిన సాధనం. యుగధర్మాన్ని బట్టి కృతయుగంలో సత్యవాదం, త్రేతా యుగంలో యజ్ఞయాగాదులు, ద్వాపరంలో పూజా పునస్కారాలు, కలియుగంలో 'నామస్మరణ' భక్తికి ఆధారాలని చెప్పబడినవి. తదనుగుణంగా రవిదాసు ప్రేమానురాగాలతో, సమర్పణ భావంతో, ఏకనిష్ఠతో నామస్మరణ చేశాడు. కడ కా ప్రేమపూరిత భక్తిద్వారానే భక్తిమార్గంలో గౌణావస్థను దాటి సిద్ధావస్థను చేరుకున్నాడు. అనగా దైవసాయుజ్యం పొందాడన్నమాట. ఆరాధ్య దైవం సన్నిధి పొందడంతోనే రవిదాసుకు ఆరాధ్యునిపట్ల

స్నేహం, చనువులు ఏర్పాడ్డాయి. ఫలితంగా ఆ ఆరాధ్యున్ని "ఓ ప్రభూ! నీ అనేకానేక నామాలలో 'పతిత పావన' నామమొకటి. మరి ఈ పేరు నీ కెవరు పెట్టారు? ఇది మా భక్తులు యిచ్చిన పేరు గాదా? మేమే గనుక పాపాలు చేయపోతే మరి నీవు ఎవరిని ఉద్ధరిస్తావు? ఈ 'పతిత పావన' బిరుదు నీకెలా దక్కుతుంది?" అని ముఖాముఖీ అడిగేస్తాడు. ఇంకా, "ప్రాపంచిక బరువు బాధ లనుభవించమని చెప్పి నీవు నన్నీ నరలోకంలో పడవేశావు. అయినప్పటికీ నిన్ను నేను నా ప్రేమపాశంతో బంధించివేశాను. నేనైతే నీ నామస్మరణ ద్వారా యీ భవసాగరం తరిస్తాను. కాని నా ప్రేమపాశం (జేబడి) నుంచి విడిపించుకోవడానికి నీకు ఉపాయమేది? కనుక నీవెంత వద్దన్నప్పటికీ నేను నీలో లీనమయ్యే తీరుతా" నని వ్యంగ్యోక్తులుకూడ పలుకుతాడు. అంత బలీయమైనది ఆ భక్తుని ప్రేమపాశం! అంతటి మహాత్ముడా రవిదాసు భక్తుడు!!

* * *

# 12

# రవిదాసు భావధార

మహమ్మదీయ సుల్తానుల శాసనకాలంలో భక్తిమార్గాన్ని అవలంబించిన ఈ భక్త శిఖామణులు అవతరించారు. సుల్తానులు రెండు లక్ష్యాలతో అధికారానికి వచ్చారు. వాటిల్లో ఒక లక్ష్యం – రాజకీయాధికారం- సాధించారు. ఇక మత విజయం కోసం సంఘర్షణ సలుపుతుండినారు. వారు పాలకులవడం చేత అన్నివిధాల వారిదే ఆధిక్యత. కనుక తమ పక్షం వహించనివారినందరినీ 'కాఫిరు'లంటూ హీనదృష్టితో చూస్తూ, నానావిధాల వత్తిడి చేయనారంభించారు. ఇక పాలిత ప్రజలు మత విషయికంగా, ఆత్మరక్షణ పరంగా అనేక యాతనలకు లోనవుతూండినారు. జీవితావసర వస్తువులు, యితర సదుపాయాలు చాలినంతలేక ఉత్సాహం కోల్పోయి నిరాశానిస్పృహలతో సతమతమవుతూండినారు. అందువల్ల పాలకవర్గాలపట్ల ద్వేషం పెంచుకుని, వారిని 'మ్లేచ్ఛులు'గా చూచి అసహ్యించుకోసాగారు. ఈ విధంగా పాలక, పాలితవర్గాలు ఉభయులూ పరస్పర విరోధులుగా జీవిస్తూండినారు. అయితే నవాంగతుకులయిన మహమ్మదీయులు కేవలం దురాక్రమణ యుద్ధాలు, దండయాత్రలు మాత్రమే కాక తమతోబాటు ఏకేశ్వరోపాసన, నిరాకార దైవారాధన, నిరాడంబర పూజాపద్ధతి, సాంఘిక సమానత్వం ప్రాతిపదికగా ఒక క్రమబద్ధమైన సామాజిక వ్యవస్థలను కూడ కొనివచ్చారు. బహుదేవతారాధన, అర్థరహిత కర్మకాండలు, వర్ణవ్యత్యాసాలతో సతమతమవుతూండిన హిందువులకు అవి కనువిప్పుకాసాగినవి.

కాని పాలక, పాలితవర్గాలలో యిన్ని విభిన్నతలున్నప్పటికీ కొంత ఏకత్వం, కొంత సామ్యంకూడ లేకపోలేదు. శకునాల పాటింపు, తాయెత్తుల వాడకం వంటి మూఢాచారాలు, అజ్ఞానం, అంధ విశ్వాసాలు, సంప్రదాయ ప్రియత్వం ఉభయ వర్గాలలోనూ సమానంగా వుండినవి. ఒకప్పుడు దురాక్రమణదారులైన ముస్లింలు రానురాను ఈ దేశీయులతో కలిసిమెలిసి వుండవలసిన వారైనారు. ఇక వారెంతమాత్రం విదేశీయులు కారు. అయితే పైన పేర్కొన్న భిన్నత్వాలు, ఏకత్వాలతోనూ, యితర కొన్ని

ఘర్షణలతోనూ జీవిస్తూండినారు. మరి వారు సుఖశాంతులతో, సమైక్యతా భావంతో భారతీయులుగా బతకాలంటే ఉభయవర్గాల నడుమ ఒక సానుకూల సమరస భావం ఎంతైనా అవసరం. ఆ యుగాపేక్ష కూడ అదే.

అట్టి యుగావశ్యకతలను గమనించినవారే నాటి భక్తశ్రేష్ఠులు. ఆ భక్తవరుల్లో హిందువులు, ముస్లింలు ఉభయవర్గాల వారూ ఉన్నారు. వారిలో ఏ కొద్దిమందో తప్ప తక్కిన అధిక సంఖ్యాకులు సమాజంలోని నిమ్నవర్గాలకు చెందినవారవడం ఒక విశిష్టత. దానికితోడు వారు ఉదార భావాలు, సమదృష్టి, సద్భావనలు గలవారు, విశాల హృదయులు, సాధకోత్తములు. అంతేగాదు, పరస్పర ప్రేమానురాగాలు ప్రవర్ధిల్లజేయడమే ఆదర్శంగా పెట్టుకున్నవారు. అందువల్ల వివాదాస్పదమైన మతపర కర్మకాండలు, ఉచ్చ-నీచ, కొద్ది-గొప్ప భేదాలులేని, కులమతరహితమైన నవసమాజ నిర్మాణం కోసం తరతమభేదాలకు అతీతులుగా నిలిచి, యుగావసరానికి అనుగుణంగా ప్రాచీన వారసత్వంలోంచి గ్రహించదగిన మంచినంతటినీ అవసరమైన మార్పులు చేర్పులతో స్వీకరించారు. విడనాడదగిన దురాచారాలను నిర్మొగమాటంగా విడిచి పుచ్చారు. అదేవిధంగా నవాగంతుకుల ధర్మ విశిష్టతలు - ముఖ్యంగా సూఫీ ప్రేమమార్గం - గ్రహించారు. భారతీయ వైష్ణవ సంప్రదాయమైన మాధవ, మురారి, గోవింద, రామ, హరి మొదలైన పవిత్ర నామ జపాల పద్ధతిని స్వీకరించారు. ఈ విధంగా తమ సంకల్ప సిద్ధికోసం కొత్తపాతల మేలికలయికతో, ఉభయవర్గాలకు ఉపయుక్తమైన విశ్వజనీనమైన సమన్వయ సామరస్యమార్గం - భక్తిమార్గం - అనే రాచబాటను నిర్మించారు. కుల, మత, జాతి భేదాలకు, కొద్ది-గొప్ప తేడాలకు అతీతంగా పరమపితయైన పరమేశ్వరుని - హరిని - భజించేవారంతా భగవంతునికి ప్రీతిపాత్రమైన 'హరి'జనులేనని ఎలుగెత్తి చాటారు.

జాతి పాంతి పూఛే నహి కోయీ ।
హరికో భజై సో హరికా హోయీ ॥

కులమతాల ప్రమేయం వద్దు.హరిని (భగవంతుని) పూజించే వారంతా హరికి చెందినవాళ్లే.

పైన పేర్కొన్న భక్తమండలికి, వారి భావధారకు రవిదాసు, ఆయన వాణి ప్రతినిధులని చెప్పవచ్చు. ఎందుకంటే భక్తరవిదాసు అతి వినమ్రుడు, రాగద్వేష రహితుడు, ఖండన మండన స్వభావం లేనివాడు. తానెంత వినమ్రుడో, సాత్వికుడో తన వాణి అంత సరళమైనదీ, సుబోధకమైనదీనూ. ఆరాధ్యదైవం భజనకయినా, సాంఘిక అన్యాయాల ప్రతిఘటనకైనా ఆయన అదే సరళ సుబోధకం, సంయమప్రదమైన మధురవాణినే ఉపయోగించాడు. జనసామాన్యానికి అదేవాణి బోధించాడు. భక్తాగ్రేసరుడు రవిదాసు చింతనాస్రవంతిలో నవాగత 'సూఫీ' సాంప్రదాయ ఆలోచనా ధోరణి కనిపిస్తుంది. అదేవిధంగా పూర్వసంప్రదాయాలతో కూడుకున్న ఆలోచనా స్రవంతి, వేదాలు వేదాంతాల తత్వపద్ధతి, శంకరాచార్యుల అద్వైత మిథ్యావాదం కూడ అగుపిస్తుంది. వీటన్నింటిని మించి భావోద్వేగాల సుందర సామంజస్యం, కొత్తపాతల మేలికలయిక గోచరిస్తాయి. ఇవేగాక శరణాగత భావన, పశ్చాత్తాపం, దైన్యదాస్య భావన, వీటన్నింటిని మించి ఆత్మసమర్పణ భావం, నాటి భక్త సమాజంలో మేటి అయిన రవిదాసు ప్రత్యేక లక్షణాలు. తదనురూపంగా సంపూర్ణ ఆత్మసమర్పణా భావంతోనే ఆయన తన కారాధ్యుడైన పరబ్రహ్మను పూజించాడు.

నాటి భక్తులందరూ తమ భక్తిభావనలను దోహాలు (ద్విపదలు), సాఖీలనే పదాల మాధ్యమంగా ప్రజల్లో ప్రచారం చేశారు. అలాగే రవిదాసు వాణి కూడ ప్రధానంగా దోహాలు, సాఖీల మాధ్యమంగానే వెలువడింది. విశేష ప్రచార, ప్రసారాల నందుకొన్నది. కబీరు మొదలుగాగల భక్తమండలి పెద్ద లౌకిక విద్యావంతులేమీ కాదు. సత్సాంగత్యం, స్వానుభవాలద్వారా అలవడిన ఆధ్యాత్మిక జ్ఞానమేవారిది. కనుక వారేమి చెప్పినా, ఏమి బోధించినా సూటిగా సూత్రప్రాయ భాషలోనే చెప్పారు. అదే వారవలంబించిన నవీన సూక్ష్మశైలి కూడ. ఆ సూత్రప్రాయ భాషే వారి దోహాలు, సాఖీలలో దర్శనమిస్తుంది. ప్రజలకు జ్ఞానోపదేశం చేయడమే భక్తవరుల ప్రధాన ధ్యేయంగదా. అందుకు అత్యంత ఉపయుక్తమైనవి ఈ దోహా, సాఖీ పదాలే. ఇందు సాఖీ మరీ ప్రభావకరమైనది. అందుకే,

**సాకీ ఆంఖీ జ్ఞానకీ సమఝు లేహు మన మాహి ।**
**బిన సాఖీ సంసార కా ఝుగరా ఛూటతా నాహి ।**

సాఖీ జ్ఞానచక్షువని తెలుసుకో మనసా ! సాఖీయే లేకపోతే
ఈ సంసార జంజాటాలు వదిలించుకోవడం అసాధ్యం అంటాడు భక్త
కబీరు.

ఈ విధంగా భక్తులు రాగం, తాళం, పల్లవి యుక్తంగా తమ హృదయాంతరాల్లోంచి వెలువర్చిన రసమయ భక్తిగీతాలు పదరూపం ధరించాయి. రవిదాసు వ్యక్తిత్వం, భక్తిసాధన, భావస్రవంతి అన్నీ మనకు ఆయన భక్తివాణిలో దర్శనమిస్తాయి. ఇంకా ఆ సాధకోత్తముని సాంఘిక, రాజకీయ, మత విషయిక, నైతిక ఆదర్శాలు, ఆలోచనలుకూడ మన మందునుండి గ్రహించవచ్చు. ఆ భక్తివాణి దోహాలు, సాఖీల రూపంలోనే వ్యక్తమయింది.

నిర్గుణ, నిరాకార, ఆదిమధ్యాంత రహిత పరాశక్తే రవిదాసు ఆరాధ్య దేవత. ఆ 'సర్వోన్నత శక్తి'ని వేదాంత భాషలో 'బ్రహ్మ' యన్నాడు. వైష్ణవ సంప్రదాయ ప్రకారం పరంపరాగతంగా అధిక ప్రచారంలోనున్న దామోదర, నిరంజన, మహేశ్వర, రామ,కృష్ణ, హరి, మాధవ, మురారి, గోవింద మొదలైన పేర్లతో ఆ పరబ్రహ్మను సంబోధించాడు. ఇంకా ఇస్లాంపరంగా అల్లా, ఖుదా, ... అని కూడ తన ఆరాధ్యున్ని సంబోధించడానికి ఆయన సంకోచించలేదు. ఇక్కడ ఒక విషయం గమనించాలి. రాముడంటే దశరథ రాముడని గాని, కృష్ణుడంటే గోకుల విహారి అనిగాని కాదు. ఈ నామజపాలు సగుణ రూపంలోగాక నిర్గుణ, నిరాకార రూపంలో స్వీకరించాడు భక్త రవిదాసు. చరాచర ప్రపంచానికంతా కర్త, భర్త అయినవాడే రవిదాసుని రాముడైనా, కృష్ణుడైనానూ. కడకు ఆ భక్త పుంగవుని దృష్టిలో సత్యమన్నా అదే. 'చరణ పతాల సీస అసమానా' అంటూ తన ఆరాధ్య దైవాన్ని పరిచయం చేస్తాడు రవిదాసు. ఆ చరమ శక్తి విరాట్ స్వరూపం ఏ విధంగా వర్ణిస్తున్నాడో చూడండి.

ఆది అంత జాపాన ఏకరస, ఏక్ తార్ హై భాయీ ।
థావర జంగమ కీట పతింగా, పూరి రహ్యో హరి రాయి ।
సర్వేశ్వర, సర్వాంగి సబగతి, కర్తాహర్తా సోయి ।
ద్రిష్టి అద్రిష్టి గేయ అరు గ్యాతా, ఏకమేక హై రవిదాసా ।

ఆది మధ్యాంత రహితమైన సమస్త ప్రాణులతో నిండివుండేది వాటి గతి విధుల నెరిగియుండేది, వాటికి కారణ భూతమైనదీ అన్నీ ఆ పరాశక్తే, ఆకాశం శిరస్సు, పాతాళం పాదాలుగా వ్యాపించిన విరాట్ స్వరూపంగలది, చూచేది, చూడబడేది తెలుసుకొనేది-తెలుసుకొనబడేది, కర్త, భర్త అన్నీ తానే అయిన ఆ ఏకైక విరాట్ శక్తే తన ఆరాధ్యదైవమని రవిదాసు భావన.

అట్టి పరబ్రహ్మ ప్రాప్తి సుఖానుభవమే పరమానందం. ఆ పరమానంద ప్రాప్తి యెట్లా కలుగుతుందంటే ఆత్మచింతనద్వారా మస్తిష్కంలో జ్ఞాన జ్యోతిని ప్రజ్వలింపజేసి పరబ్రహ్మ సుఖానుభూతి పొందవచ్చని రవిదాసు అంటాడు. జ్ఞాన స్వరూపం ఆత్మ. తెలుసుకొనేది, తెలుసుకోదగినది - జ్ఞేయం, జ్ఞాత - రెండూ ఒకటే యిక్కడ. విజ్ఞాన జ్యోతి ద్వారా మాయాభ్రాంతి తొలగుతుంది.కాని ఆత్మ చింతన వినా జ్ఞానజ్యోతి ప్రకాశించదు. అది ఒక్కసారిగా సంభవమయ్యేదీకాదు. అభ్యాసంద్వారా క్రమక్రమేపీ సాధ్యమవుతున్నది. ఈ విధంగా బ్రహ్మ-ఆత్మలకు సంబంధించిన యోచనలో భక్త రవిదాసు శంకరుని అద్వైత వాదానుయాయి అని తెలుస్తున్నది.

రవిదాసు తన జీవితంలో స్మరణకు 'రామ' నామం అధికంగా ఎన్నుకున్నాడు. పరాశక్తి స్వరూపం పరబ్రహ్మ ప్రాప్తికోసం నామ జపానికిగాను అంతకుముందునుండి వ్యాప్తిలోవున్న 'రామ, కృష్ణ, గోవింద' మొదలైన పేర్లు ఎన్నుకొన్నాడని యిదివరకే తెలుసుకున్నాము. వాటిలోనూ ఇష్టదైవప్రాప్తికి అనుసరించే విధివిధానాలన్నిటికీ మూలాధారంగా రామనామజపాన్ని ఎన్నుకున్నాడు. ఈ రామనామాని కింత ప్రాధాన్యత, శ్రేష్ఠత ఆయన సొంతంగా ఆపాదించినదికాదు. తనకు పూర్వం జ్ఞానేశ్వరుడు, నామదేవు మొదలైన మహారాష్ట్ర భక్తులు రామ నామ ప్రచారం చేశారు. వీరిని మించి శ్రీ రామానందుని ద్వారా రామనామం ప్రబలవేగంతో ప్రచార, ప్రసారాల నందుకున్నది. ఆ యుగంలో రామనామం సమన్వయానికి ప్రతీకగా నిలిచిందని కూడ చెప్పవచ్చు. అందుచేతనే ఇంచుమించు మధ్యయుగపు భక్తులందరూ కూడ తమ ఆరాధ్య దైవం ప్రాప్తి కోసం రామనామాన్నే ఊతగా స్వీకరించారు. ఆ నామ మహత్తును కీర్తించారు. ఆ సాంప్రదాయాన్నే పాధకుడు రవిదాసుకూడ అనుసరించాడు.

ఇక్కడొక విషయం. రామనామాన్ని రవిదాసు పరంపరాగతమైనదిగాను, ఆ కాలంలోని వివిధ అంతర్ విభేదాల నివారణకు తగు ఉపాయంగానూ స్వీకరించాడేగాని సాకారి, అవతార పురుషుడు అయిన శ్రీరాముని నామంగా స్వీకరించలేదు. నాటి బహుళ సంఖ్యాక నిరక్షరాస్య ప్రజలకు సరళసుబోధకంగా భక్తివాణి ప్రబోధించడానికి సులభసామాన్య సాధనంగా రామనామం ఉండడం మరొక కారణం. అట్టి మహిమాన్విత రామ నామం అండగా భక్త రవిదాసు తన ఆరాధ్య దైవాన్ని సేవించాడు. సాయుజ్యం పొందాడు. ఆ సరళోపాయాన్ని - రామనామాన్ని - ప్రజలకూ బోధించాడు. కుడితి కుండలో బడ్డ ఎలుక చందంగా ఆ మహామోసగత్తె 'మాయ' జాలంలో పడి ఐహిక ప్రపంచంలో ఉక్కిరిబిక్కిరవుతున్న ప్రజానీకానికి రామనామాన్ని తారకమంత్రంగా అందించాడు. శుద్ధ హృదయంతో, ఆత్మ సమర్పణ భావంతో రామనామ స్మరణ చేసినవారికి భవబంధాలు అవలీలగా తొలగిపోతాయని, తమ ఆరాధ్య దైవ సాన్నిధ్యం పొందుతారని కూడ చెబుతాడు రవిదాసు.

కహై 'రవిదాస్' రామ జపి రసనా,
మాయా కైసే సంగ్ రహై రే ।

ఓ నాలుకా రామనామం జపించు. ఇక ఆ దరిదాపుల్లో మాయ ఎలా నిలిచివుంటుందో చూద్దాం.

ఇంతేకాదు, రామనామ స్మరణ లేకుండా మానవుడే కార్యం చేసినా, లేక చేయ ప్రయత్నించినా అన్నీ వ్యర్థమేనంటాడు. సాధుసన్యాసుల వేషధారణచేసి, సదా విషయలోలురుగాను, కామక్రోధ లోభ మోహ మద మత్సర్యాలతో విహరిస్తూ రామనామ జపం అభినయించే కపట సాధువులను భక్త రవిదాసు ఏ విధంగా ఎండగట్టుతున్నాడో చూడండి :

బేఖ లియో పై భేద న జాన్యో, ఇమృత లేయి విషై సో సామ్యో ।
కామక్రోధమై జనమ గంవాయో, సాధసంగతి మిలిరామ న గాయో ॥

జటా కమండలాలు, కాషాయ వస్త్రధారణతో సాధువేషమైతే వేశారుగాని దాని మర్మ మెరిగారు కాదు. అమృతాన్ని విషంగా మార్చేశారు. విషయ వాసనలో లీనమై సత్సంగం, రామనామస్మరణం విస్మరించారు.

మానవ జన్మకు రవిదాసు అనన్య ప్రాధాన్యత నిస్తాడు. సమస్త ప్రాణి కోటిలో ఉత్తమమైనది మానవజన్మ. వెనుకజన్మల్లో చేసిన పుణ్యకర్మల ఫలితంగా, జన్మజన్మల యాతన అనుభవించినమీదటగాని మనకీ జన్మ లభించలేదు. జ్ఞాని, విజ్ఞాని, తత్వజ్ఞాని కావాలన్నా, జప తపాదులొనరించి మహాపురుషులుకావాలన్నా, కామక్రోధాది అరిషడ్వర్గాలను జయిచి సంయమపూరితమైన సాత్విక జీవనం గడపాలన్నా - ఏమి చేయాలన్నా అది మానవ శరీరధారులకే సాధ్యం. ఇదే జనన మరణ చక్రంనుండి ముక్తి పొందడానికి, ఆ పరమేశ్వర పరబ్రహ్మ సాయుజ్యం పొందడానికి మానవశరీరమే తగిన సాధనం. మానవ జీవితమే తగిన తరుణం. ఇందుచేతనే కాబోలు మానవత్వంలో దైవత్వం నిహితమై వుందంటారు.

ఇంకా ఈ నరలోకంలో పుట్టడానికి సిద్ధ, సాధ్య, కిన్నర, కింపురుష, సురలాది దేవతలు సహితం తహతహలాడుతారంటాడు రవిదాసు. కారణం నామజపం చేయడానికి, వివిధపద్ధతుల్లో జగదారాధ్యుడైన ఆ యేకేశ్వరుణ్ణి పూజించడానికి నరలోకం తగిన తావని, నరజన్మ తగిన సాధనమని బోధిస్తాడు. ఈ కారణంగానే రవిదాసు తన అభిప్రాయం ప్రకారం మానవజన్మకు అంత అగ్రస్థాన మొసగాడు. కనుకనే ఈ జన్మలోనే, ఇప్పుడే సత్కార్మ లాచరించి మంచి కీర్తి సంపాదించుకొమ్మని, తిరిగి యీ మానవజన్మ లభిస్తుందో, లభించదో నని హెచ్చరిస్తాడు. ఇంకా, నాలుగు విధాలైన ముక్తిమార్గాలలో ఆఖరిదీ, అత్యుత్తమమైనదీ అయిన సాయుజ్యం పొందడానికి మానవజన్మే తగిన తరుణమని సాధికారంగా చెబుతాడు రవిదాసు.

రవిదాసు జన్మతః భక్తుడు, సహజ సంవేదనాశీలి.-కనుక ప్రజల కష్టనష్టాలకు ఆయన హృదయం పదేపదే స్పందించింది. వేదన పొందింది. ఆ ఆవేదన, పరితాపం ఆయన వాణి ద్వారా, సత్కార్మల ద్వారా అభివ్యక్తమయింది. 'ధరమ, కరమ దుయి ఏక్ హై భాయీ' అంటూ ధర్మాన్ని, కర్మలను అవినాభావంగానే భావించాడు. ధర్మం అంటే కర్మ, కర్మ అంటే స్వకర్మ, సదాచారంగా సదా భావించాడు ఈ మహాసాధకుడు. స్వకర్మయే సుకర్మ; రామనామ జపం, సత్కార్మల ఆచరణలపై ఆధారపడిన జీవితమే సార్థక జీవితమన్నాడు. ఆయన

దృష్టిలో కర్మ అనగా సత్కార్మే కాదు నిష్కామ కర్మకూడ. ఆ నిష్కామ కర్మ చేస్తూ నూరేళ్ళు నిండుగా జీవించాలని ఆ సిద్ధుని బోధ. ఉపనిషత్తులు, భగవద్గీతకూడ సరిగ్గా యిదే - కర్మాణి కుర్వన్ ఏవ శతమ్ సమాః జిజీవిషేత్ అని - ఘోషిస్తున్నవి. ఆ భక్తునికి స్వకర్మయే ధర్మం. ధర్మమే భక్తి. కాన స్వకర్మయే సకర్మ లేక సుకర్మ, అంటే కులవృత్తి. అదే ధర్మం. భవసాగరం తరించడానికి ఆ ధర్మమే కులవృత్తిగా స్వీకరించాడు. అన్నిటికీ రామనామస్మరణే రామబాణంవంటి మంత్రమని బోధించాడు.

పరమ భక్తుడైన రవిదాసు మానవుని మానవునిగానే గౌరవిస్తాడు. ధనవంతునిగా, కులీనునిగా గౌరవించడు. దీనినిబట్టి ఆయన గొప్ప స్వాభిమానిగా, మహామానవతావాదిగా గోచరిస్తాడు. ఇంకా కులమత భేదాలకు, జాతి వర్ణ వ్యత్యాసాలకు పూర్తిగా వ్యతిరేకునిగాకూడ అగుపడతాడు. ఈ విషయం ఎంత స్పష్టంగా వ్యక్తపరుస్తున్నాడో గమనించండి :

**జాత జాత మే జాత హై, జ్యోఁ కేలన మే పాత ।**
**'రవిదాసు' న మానుష జుడ సకె, జౌలౌ జాతన జాత ।**

అరటి ఆకులు ఒకదాన్నుండి మరొకటి పుట్టుకొచ్చినట్లుగా జాతులనుండి జాతులు, ఉపజాతులు పుడుతున్నవి. ఈ జాతులు నశించనంతవరకు మానవులు పరస్పర ప్రేమానురాగాలతో కలవలేరు, ప్రగతి చెందలేరని రవిదాసు ఉవాచ.

ఇంకా, కులమత భేదాలతోనూ, ఉచ్చనీచ తారతమ్యాలతోనూ సతమతమవుతూండే నాటి సంఘంలో, శాస్త్రవాదాలు, పురాతన మూఢాచారాలు ప్రబలమైన నాటి సమాజంలో జన్మచేత మానవులెవరూ కులీనులుగాని, అకులీనులుగాని కాజాలరని రవిదాసు ఎంత సాహసంతో ప్రకటిస్తున్నాడో చూడండిః

**'రవిదాస' జనమకై కారనై, హోత న కోఊ నీచ ।**
**నర కూ నీచ కర డారి హై, ఓఛే కరమకై కీచ ।**

జన్మచేత మానవులెవరూ నీచ కులస్థులు (అకులీనులు) కారు. మానవుల్ని ఉచ్ఛ, నీచ వర్గాలుగా చేసేది వారు చేసే ఉచ్ఛ, నీచకర్మలే.

రవిదాసు మతానుసారంగా దైవత్వప్రాప్తియే మానవుని అంతిమ ధ్యేయం. కనుక పవిత్ర జీవితం గడపమని, దుష్టసాంగత్యం, దుర్మార్గాలు త్యజించమని, యింకా యింద్రియ లోలత్వం, భోగవాంఛలకు దూరంగా వుండాలని, అలా వుండని పక్షంలో మానవుడు దైవత్వం పొంద నర్హుడు కాడనీ హెచ్చరిస్తున్నాడు చూడండి :

**జో బస రాఖే ఇంద్రియా, సుఖదుఃఖ సమఝి సమాన్ ।**
**సో ఉ అమరిత పద పాయిగో, కహి 'రవిదాస్' బఖాన్ ।**

రవిదాసు మతప్రకారం జితేంద్రియుడై, సుఖదుఃఖాలు రెంటినీ సమదృష్టితో చూచేవాడే కడకు పరమపదం పొందగల్గుతాడు.

రవిదాసు స్వేచ్ఛాప్రియుడు. పరాధీనతను అంగీకరించడు. పరాధీనుని జీవితం బానిస బతుకు. అలాంటివాడిని సంఘంలో ఎవరూ ప్రేమించరు, గౌరవించరు. సరిగదా, నీచంగా చూస్తారు. అది పరరాజుల కింద పరాధీనత కావచ్చు. లేదా ఇంద్రియ పరాధీనతలాంటిది మరేదైనా కావచ్చు. మొత్తానికి పరాధీనత అంటేనే పాపం, అదొక అభిశాపం అంటాడు. అందుచేత ఉభయరకాల పారతంత్ర్యాన్ని పరిత్యజించి మానవుడు స్వతంత్ర, స్వావలంబిత జీవితం గడపాలంటాడు.

ఇదే విధంగా రాజ్యపాలనగురించిన రవిదాసుకల్పన కూడ విలక్షణమైనది. అదేవిధంగా వ్యక్తపరుస్తున్నాడో గమనించండి.

**ఐసా చాహో రాజ మే, జహా మిలై సబన కో అన్న ।**
**ఛోటా బడా సబ సమ బసై, 'రవిదాసు' రహై ప్రసన్న ।**

సకల ప్రజలకు అన్నవస్త్రాలు పుష్కలంగా లభించే, ఉచ్ఛ – నీచ భేదాలు లేకుండా పేదలు, ధనికులు అంతా సమానత్వంతో మెలగే రాజ్యం కావాలి. అట్టి సుపరిపాలనతో రవిదాసు సంతోష పడతాడు.

అంటే పేదాసాదా, ధనిక దరిద్రులందరికీ తిండి, గుడ్డ, నీడ సమానంగా లభించే, సుఖశాంతులు, చదువు సంధ్యలు, పౌరహక్కులు సమంగా లభించే పాలన కావాలంటాడు. స్వపరిపాలన అర్థం అదే , సుపరిపాలనంటే అదే నంటాడు రవిదాసు.

ఈ విధంగా, క్లుప్తంగా చెబితే, రవిదాసు భావస్రవంతికి మూలాధారం భక్తి ఆధారిత భారతీయ సంస్కృతీ, మానవ సమానత్వం, సౌభ్రాత్రం అనే మౌలికాదర్శాలూనూ. రవిదాసు సాంఘిక సంకుచితతత్వాలు, మత విషయిక ఆడంబరాలు, పటాటోపాలకు అతి విముఖుడు. ఇంకా పరస్పర వైరాన్ని పెచ్చరిల్లజేసే కుల, మత, వర్ణ, వర్గ, సంప్రదాయ భేదాలను సైచనివాడు. అయినప్పటికీ ఘర్షణ తత్వంతో వాటిని ఎదురుకోకుండా, వాటిలో గల మూలతత్వాన్ని కనిపెట్టి అనేకత్వంలో ఏకత్వం నెలకొల్ప యత్నించాడు. తను గ్రహించిన సత్యాలను నిర్భయంగా చాటి చెప్పాడు. ఆయన పరమప్రభు భక్తి పరాయణుడు, సర్వజన హితకారి, స్వాతంత్ర్య ప్రియుడు, మౌలిక చింతకుడు. పరమ ప్రభుని సన్నిధి ప్రాప్తి, మానవ సేవలే పరమ లక్ష్యాలని ఆ సాధక శ్రేష్ఠుని అభిప్రాయం. భక్తిమార్గం అందులకే. స్వకర్మ ప్రభుప్రాప్తికి సహజసాధనం. ఇది మానవాళికి ఆ భక్త శిఖామణి నేర్పిన పాఠం.

* * *

# 13

# రవిదాసు సాహిత్యం

రవిదాసు సహజ భక్తుడు. లౌకిక చదువు సంధ్యలు లేనివాడు. అయితే ఆయన సాహిత్యమేమిటి అన్న ప్రశ్న తలయెత్తవచ్చును. ఒక్క రవిదాసుకే కాదు రమారమి ఆ కాలపు భక్తవరులకందరికీ వర్తిస్తుంది యీ ప్రశ్న. ఈ భక్తబృందం లౌకిక పాఠశాలల్లో చదవలేదు. కాని గురుశుశ్రూష ద్వారా వీటికి మించిన ఆధ్యాత్మిక పాఠశాలల్లో ప్రవేశం పొందారు. గురూపదేశం పొందారు. విద్యలను మించిన విద్య, పరావిద్య నభ్యసించారు. ఇంకా, సత్సాంగత్యంచేసి లోకానుభవం గడించారు. స్వానుభవం సంపాదించారు. వాటి ఆధారంగా మూఢ సాంప్రదాయాలతో రూఢిగా నడుస్తూవస్తున్న వర్తమాన సమాజ ప్రవంతికి ఎదురీదారు. చరిత్ర గమనంలో తమ కొక అధ్యాయం ప్రత్యేకించుకోగలిగారు. వారిలోనూ కబీరు, రవిదాసులు బహుగణన కెక్కినవారు. వారుగాని, వారిశ్రేణిలోని భక్తులెవరైనా గాని కవులుగారు. కావ్యాలు రచించలేదు. వారంతా భక్తులు. కనుక భక్తిపారవశ్యంలో తన్మయులై ఉద్వేగంతో పదాలు పాడారు. పద్యాలు చెప్పారు. వారేమి చెప్పినా, ఏమి పాడినా, ఆ పరమగురువు – ఆ పరమేశ్వరుడిని సంబోధించి చెప్పారు. భక్తివాణితో సంబోధించారు. వారి నోళ్లనుండి పద్యాలుగా, పదాలుగా వెలువడ్డ ఆ సంబోధనలను తర్వాత వారి శిష్యులు, అనుయాయులు సేకరించి, సాఖీలుగాను, దోహాలుగాను వర్గీకరించి, లిపిబద్ధం చేసారు. అవే ఆయా భక్తులపేరిట కబీరు సాహిత్యమనీ, రవిదాసు సాహిత్యమనీ ప్రచారంలో వున్నాయి.

సాహిత్యమనగానే దాని కో సమ్మానప్రదమైన సంప్రదాయం వున్నది. ప్రత్యేక కొలబద్దలున్నవి, నిర్వచనాలున్నవి. మన ప్రాచీన ఆచార్యులయిన దండి, భామహ, విశ్వనాథ, జగన్నాథ పండితరాయలు ఆదిగా గల సాహిత్యస్రష్టలు సాహిత్యానికి కొన్ని గీటురాళ్లేర్పరిచారు. అయితే ఆ గీటురాళ్ల ప్రకారంగా పరీక్షలు, పరిశీలనలకు తట్టుకొని

నిలవజాలదు ఈ భక్తి సాహిత్యం. దీని కట్టి పరీక్షలు అవసరం లేదేమో కూడాను. సాహిత్య శాస్త్ర సంప్రదాయ పరంగా ఈ భక్తివాణిని సాహిత్య పరిథిలో చేర్చవచ్చునా లేదా అనే మీమాంసలుకూడ పండితుల్లో లేకపోలేదు. అయినప్పటికీ యీ తర్జనభర్జనలు విడిచిపెట్టి భక్తులవాణిగా, అభివ్యక్తిగా భావించి వారి అనుభూతిపరంగా చూచినవారికి యిందులో సాహిత్య సంప్రదాయ లక్షణాలన్నీ కాకపోయినా, కొన్నయినా కానరాకపోవు. సహజరీతిలో, స్వతంత్ర శైలిలో, స్వేచ్ఛగా వ్యక్తమయిన భక్తవాణిలో - ముఖ్యంగా రవిదాసు వాణిలో - ఉపమా ఉత్ప్రేక్షలు, అనుప్రాస, వృత్యనుప్రాసలు అనేకం అగుపడతాయి. ఇంకా అర్థాలంకారాలు, రూపకాలంకాలతోబాటు అబిధా, లక్షణా, వ్యంజనా ప్రయోగాలు సహితం అగుపడతాయి.

రవిదాసు ప్రాథమికంగా భక్తుడు; ఆయనది భక్తివాణి. కనుక ఆయన రచనల్లో ఆద్యంతం భక్తి స్థాయీభావం వుండనే వుంది. దానికి శరణాగతి, సమర్పణ, పశ్చాత్తాపాది, అక్కడక్కడా శాంత నిర్వేదాది సంచారీ భావాలు తోడై ఆయన భక్తిభావనల అభివ్యక్తికి మంచి పుష్టి నిచ్చాయి. రవిదాసు రచనల్లో శరణాగత, సమర్పణ భావాలు అధికంగా గోచరిస్తాయి. దీనిని బట్టి ఆయన భక్తిభావావేగం ఎటువంటిదో విదితమవుతున్నది. అవ్యక్తం, అదృశ్యం అయిన ఆ పరాశక్తి సాక్షాత్కారం పొందడమే రవిదాసు జీవిత లక్ష్యం. అందు కాయన భావాభివ్యక్తి ప్రధానంగా అబిధలో వెలువడింది. అబిధలో వ్యక్తపరచలేని చోట్ల ఆ భావాన్ని ప్రతీకాత్మక లక్ష్యార్థాలలో వ్యక్తపరచడం జరిగింది. ఏకేశ్వరుని పట్లగల తన భక్తిని ప్రతీకలద్వారా వ్యక్తపరిచాడు. ఆత్మ, పరమాత్మల సమ్మేళనం కోసం నెమలి, చకోరం, వత్తి, జాతి, నీరు, దారం మొదలైనవి ఆత్మకు ప్రతీకలుగా, గిరివర, చంద్రుడు,సమిధ, తీర్థస్థానం, చందనం, ముత్యం యిత్యాదులు పరమాత్మకు ప్రతీకలుగా వాడుతూ ఆ రెంటి నడుమ ప్రేమబంధం, ఆత్మ బాంధవ్యాలను ఎంత సుందరంగా వ్యక్తపరిచాడో!

జ ఉ తుమ గిరివర (చాదర) త ఉ హమ మోరా ।
జ ఉ తుమ చంద తౌ హమ భయె చకోరా ।

జ ఉ తుమ దీవరా త ఉ మమ బాతీ ।
జ ఉ తుమ తీరథ త ఉ హమ జాతీ ।

ప్రభుజీ తుమ చందన హమ పానీ ।
జా కె అంగ అంగ బాస సమానీ ।

ప్రభుజీ తుమ మోతీ హమ ధాగా ।
జైసె సోనె మిలత సుహాగా ।

*ఓ ప్రభూ (పరమాత్మా)! నీవు గిరిరాజమైతే నేను నాట్యమయూరిని, చంద్రుడు నీవైతే చకోరిక నేను. నీవు దీపం, నేను వత్తిని; నీవు పుణ్యతీర్థం, నేను భక్త జాతిని. ప్రభూ, నీవు చందనమైతే నేను నీరై మన కలయిక సుగంధమై ఒడలంతా అలముకొని పరిమళిస్తుంది. ప్రభుజీ! నీవు ముత్యాల రాశి అయితే నేను వాటిని దండగా కూర్చడానికి దారాన్ని. బంగారంలో వెలిగారంలా మన ముభయులం కలిసిపోయినప్పుడేగదా అసలు వన్నె వచ్చేది!*

ఈ విధంగానే రవిదాసు తన ఆధ్యాత్మిక, తాత్విక భావాలు పలుచోట్ల ప్రతీకాత్మక శైలిలోను, రూపక శైలిలోను అతి మనోహరంగా వ్యక్తపరిచాడు. కొన్నిచోట్ల రూపకాలంకారాలు, వృత్యనుప్రాసలు క్రమబద్ధంగా వచ్చి ఆయన పదాలకు ఎనలేని చక్కదనం తెచ్చిపెట్టాయి.

రవిదాసు భాష జనం భాష. అందువల్లనే తన రచనల్లో అవధి, భోజ్‌పురీ, వ్రజ, హిందీ భాషాపదాలు పుష్కలంగా గోచరిస్తాయి. కఠినమైన ఆధ్యాత్మిక, తాత్విక భావనల్నిసైతం తన దివ్యానుభూతితో మేళవించి సరళ సుందర సుబోధకమయిన భాషలో ప్రజలకు అందిస్తాడు. ఆ భక్తునకు పుస్తకవిద్యాప్రాభవం అంతగా లేకపోయినా, భాషా జ్ఞానం మెండుగా లేకపోయినా, అతడు వాడిన భాషలో తరతమ భేదాలతో అనేక గ్రాంథిక, గ్రామ్య పదాలు, వాటితోబాటు హిందీ, ఉర్దూ, గుజరాతీ, రాజస్థానీ మొదలైన ప్రాంతీయ భాషా పదాలు, అవధి, బ్రజ భాష వంటి ఉపభాషాపదాలు, యింకా పార్సీ, అరబ్బీలవంటి విదేశీ భాషాపదాలు సహితం ప్రచురంగా కనిపిస్తాయి.

ఇక్కడ రవిదాసు రచనలకు కలిగిన సౌందర్యాది విశిష్టతలు ఆయన పలుదేశాల పర్యటనమూలంగాను, భక్తిభావతీవ్రతలోను సహజంగా వచ్చినవేగాని, కావాలని చేసిన సాహితీప్రయాస ఫలితాలు కావని మరువరాదు. కనుకనే భక్తి సాహిత్యం కేవలం సాహిత్య శాస్త్ర నిబంధనల

దృష్టితోగాక దేశకాల పరిస్థితుల అవసరాలనుబట్టి సాహిత్య పరంపరకు కాస్త వేరుగా అధ్యయనం చేసి అవగాహన చేసుకోవల్సిన అగత్యమెంతైనా వుంది. ఇందులో సందేహం లేదు.

భక్త రవిదాసాది భక్తమండలి అవతరించినది చారిత్రక మధ్యయుగాల కాలంలోనని గమనించాము. ఆ కాలం రాజకీయరంగంలో ఉత్థాన పతనాల కాలం; సాంఘికంగా దారుణ అసమానతల కాలం; మత విషయికంగా పరివర్తనలు, మతాంతరీకరణల కాలం; నమ్మక విశ్వాసాల రీత్యా సంక్రాంతి కాలం, అంటే సాంస్కృతికంగా పునర్ వ్యవస్థీకరణ కాలమని చెప్పుకోవాలి. ఈ సంధియుగంలో ప్రజలు నానా అగచాట్లకు గురవుతూండినారు. ముఖ్యంగా సామాన్యప్రజలు మరీనూ. అపజయాలకు తోడు అడుగడుగునా అవమానాలు అనుభవిస్తూండినారు.

అట్టి సంధికాలంలో ఈ భక్త సముదాయం అవతరించింది. వీరు ప్రధానంగా నిమ్న వర్గాల ప్రజలనుండే పుట్టుకొచ్చారు. వారిమధ్యనే జీవిస్తూ, ఆ బడుగుజనాల ఆవేదనలు, ఆర్తనాదాలు చక్కగా అవగాహన చేసుకోగలిగారు. సర్వవిధాల హతాశులు, నిరాశులైన ప్రజాసమూహంలో ఆ బరువుబాధల నివారణార్థం ఉదార భావాలు విరివిగా వ్యాపింపజేశారు. బహుదేవతారాధనకు బదులుగా ఏకేశ్వరోపాసన, జాతి, కుల భేదాలకు మారుగా సర్వమానవ సమానత్వం ప్రబోధించే మానవతావాదం ప్రజలకు ఉపదేశించారు. వారికి ధైర్యసాహసాలు ప్రసాదించి నిర్భయుల్ని చేశారు.జ్ఞాన భక్తి సమన్విత సమరసభావం బోధించి ప్రజలలో పరస్పర విశ్వాసానురాగాలు నెలకొల్పారు. ఈ మూతన భావ ప్రబోధ నిమిత్తం వారు పరంపరాగత భావస్రవంతికి వ్యతిరేకంగా వినూత్న అభివ్యంజనా శైలిని చేబట్టారు. అది వారి మౌలికశైలి. తమ ఇష్టదైవాన్ని ఆలంబనగా వుంచుకుని ఆ శైలిలో పాటలుపాడారు. పదాలు అల్లారు. ఇందులో భక్త రవిదాసుది ప్రధాన పాత్ర.

"ఈ భక్తుల అన్నిటనీమించిన విశిష్టత వారి మహద్వాణి" అంటారు స్వర్గీయ ఆచార్య కాకా కాలేల్కర్. "అది కేవలం వాణీ విలాసంగాదు. జీవనసారమని చెప్పుకోవాలి. ఇంకా, తమ భక్తిభావనల అభివ్యక్తి కోసం వారు సృష్టించుకున్న వాణి. అల్పాక్షరాలతో, మృదు

మధురం, జనరంజకం, సమ్మోహకమైన సత్యవాక్కులతో అనేకార్థకమైన పరిపూర్ణవాణి వారిది. ప్రజాహృదయాలను అది సూటిగా తాకుతుంది. అందకే అది శాశ్వతంగా నిలవగల్గింది; అమరత్వం పొందగల్గింది" అని కూడ పేర్కొంటారు.

భక్త రవిదాసు తన తోటి భక్తగణాన్నిమించిన తత్పరతతోను, వారికంటె హెచ్చు ఆత్మీయత, అధిక సంవేదనలతోను, సరళమైన శైలిలోను తన భక్తిభావనలు ప్రజలకు బోధించాడు. ఎంతటి కఠిన విషయమైనా, ఎంతటి గహనమైన ఆధ్యాత్మిక భావనమైనా అరటిపండు వొలిచి పెట్టినట్లుగా ప్రజలకు వివరించాడు. ప్రజల హృదయాలకు సూటిగా హత్తుకునేట్లు బోధ చేశాడు. తోటి భక్తుల్లో రవిదాసుని ప్రత్యేకత యిది. అందుచేతనే భక్త రవిదాసు గురించి పరిశోధన సల్పిన పండితులు, "సందేహ గ్రంథి ఖండన నిపుణ విమలవాణి" రవిదాసునదని ప్రశంసించారు. అనగా ఆధ్యాత్మికం, తాత్వికం అయిన గూఢ రహస్యాలను (గ్రంథులను) విడమరిచి చెప్పడంలో నిపుణమైన పవిత్రవాణి రవిదాసు వాణి. ఉపదేశాత్మకమైన రవిదాసు వాణిని ఆయన అనుయాయులు తరువాత విషయాలవారీగా సంకలనం చేశారు. ఆ విధంగా సంకలనం చేయబడ్డ గ్రంథాలు, రైదాసు వాణి, రైదాసు సాఖీ, రైదాసు పదాలు అని నాలుగైదు ప్రచారంలో వున్నాయి. ఇంకా శిక్కుల గురుగ్రంథ సాహెబ్‌లోనూ, దాదూపంథ ధర్మగ్రంథాలైన సర్వాంగీ, పంచవాని లలోనూ, సుప్రసిద్ధ తత్వవేత్త, విద్వాంసులు శ్రీ వియోగి హరిగారి 'సంత్ వాణి' అనే బృహత్ సంకలనంలోనూ భక్తరవిదాసు రచనలు చేర్చబడి వున్నాయి. అలాగే గోరఖ్‌పూరు నుండి వెలువడే కళ్యాణి పత్రిక 'సంత్ అంక్' లోనూ, వెల్‌వేడియర్ ప్రెస్ ప్రచురించిన 'రైదాస్‌జీ కీ వాణీ' అనే సంకలనంలోనూ భక్త రవిదాసు రచనలు అనేకం ముద్రించబడినవి; ప్రబల ప్రామాణికత నందుకున్నవి. ఇంకా, "ఇలాంటి అనేక రచనలు అచ్చుముఖం చూడకుండా పడివున్నాయి. ఉదార పురుషులైన సాహిత్య సేవకులెవరైనా వాటిని ఒక్కచోట సేకరించి, పరిష్కరించి, ప్రచురిస్తే అదెంతో అమూల్యకృషి కాగలదు. ఆ పుణ్యశ్లోకుడు భక్త రవిదాసు భావధార, పుణ్యజీవితం, పరమసాధనల ఔచిత్యమెరుగడానికి, విలువగట్టడానికి వీలుకాగలదు" అని పండిత శ్రీ పరశురామ చతుర్వేది వంటి సాధికార రచయితలు అభిప్రాయపడుతున్నారు.

రవిదాసు భక్త భావాలలో ఉత్తరాదిన గల సమకాలీన సాధనా పద్ధతుల మూలతత్వం నిహితమైవున్నా ఒక నవీనతకూడ ఏవిధంగా గోచరిస్తుందో, అదేవిధంగా ఆయన రచనల్లో సాహిత్య సౌందర్యం, కళా మనోహర లక్షణాలతోబాటు ఆయన ప్రత్యేకత ఒకటి అగుపడుతున్నది. ఆరాధ్యదైవంపట్ల భక్తుని దైన్యత, వినయశీలత, ఆత్మ సమర్పణ భావావేగం, ఆ భావోద్వేగంలో పెల్లుబికిన మనోహర అభివ్యక్తి - యివి రవిదాసు వాణి ప్రత్యేకతకు కారణాలు. భక్తులెవరూ తమ రచనలను అలంకారాది సాహిత్య లక్షణాలతో అలంకరించాలని ఎంచలేదు. సాధ్యమైనంత బలీయమైన అభివ్యక్తితోను, తీవ్ర భావావేశంతోనూ ప్రజలకు ప్రబోధించదలిచారు. అభివ్యక్తి పటుత్వానికి వలసిన సాధనాల్లో ఒకటి అలంకారాలు. కనుక గంభీరమైన అనుభూతితో వెలువడిన, తీవ్ర భావావేశంలో వ్యక్తమయిన భక్తవాణి అభివ్యక్తిలో ఈ అలంకారాలు తమంత తాముగానే వచ్చి చేరుతాయి. ఈ యథార్థం భక్త సాహిత్యమంతటా, ముఖ్యంగా రవిదాసు అభివ్యక్తిలో స్పష్టమవుతున్నది.

గంభీరమైన అనుభూతితో వెలువడే నిర్మల అభివ్యక్తి ఉత్తమ సాహిత్య లక్షణాలలో ఒకటని యెంచిన రవిదాసు వాణి సార్థక సాహిత్యమనడంలో సందేహంలేదు. భక్తి సాహిత్య మర్మజ్ఞులు స్వర్గీయ హజారీ ప్రసాద్ ద్వివేదీగారి మాటల్లో -

> *హార్దిక భావప్రసరణం ఉత్తమ కావ్యలక్షణమయితే, అట్టి గుణాలతో పరిపూర్ణమైనవి రవిదాసు భజనలు... అనాయాసంగా సహృదయాలను ఆకర్షించుకుంటాయి. ఆయన ఆత్మసమర్పణ భావం, దైన్య భావన, సహజభక్తి మొదలైన లక్షణాలు శ్రోతల హృదయాలలో ఉత్తమ భక్తి భావనలను ఉదయింపజేస్తాయి.*

మరో విశిష్టత ఏమనగా భక్త రవిదాసు కాలంనాటికి ఎంతో దూరం నడిచి నడిచి వచ్చిన ప్రాచీనత చివరకు ఒక పరివర్తన ద్వారం వద్దకు వచ్చి నిలచింది. అప్పుడు నవీనత దానికి తలుపు తెరచి స్వాగతం పలికింది. ఆ కొత్తపాతల కలయికలో దేశాటన నేర్పిన లోకజ్ఞానం, భాషాజ్ఞానాలు క్షీరనీర న్యాయంగా కలిసి ఒక సుందర సృష్టి జరిగింది. లౌకిక చదువు సంధ్యలు లేని, అయితే కారణజన్ముడైన భక్త రవిదాసు ముఖతః ఆ సమన్వయం, సామరస్యం తత్కాల జనవాణిగా

ప్రకటమయ్యాయి. పర్యటనా ఫలితంగా చేకూరిన భాషా వైవిధ్యంతోనూ, విభిన్న ప్రదేశాలకు చెందిన వివిధ భాషాపద ప్రయోగాలతోనూ ఆ వాణి వెలువడింది. సామాన్య ప్రజల్లోంచి పుట్టుకొచ్చిన రవిదాసు వారి వాడుక భాషకు, నాటి సామాన్య జీవన వాతావరణానికి ప్రతిరూపంగా నిలవగలిగాడు. రవిదాసు వాణిలో అవధి, భోజ్‌పురీ, గుజరాతీ, రాజస్థానీ, పంజాబీ, ఖడీబోలీ, బ్రజిబాసా మొదలైన ప్రాంతీయ భాషలు, ఉపభాషల పదాలు విరివిగా గోచరించడానికి కారణం అది. ఆ కారణంగానే నాడు భాష కొక జాతీయ రూపం సమకూడింది. అంత వైవిధ్యంతో వివిధ భాషాపదాలు, వినూత్న పద ప్రయోగాలు చోటుచేసుకోవడం ఆ సాధకోత్తముని వాణి వైశిష్ట్యమని చెప్పకతప్పదు.

అయితే, ఏమి కారణమోగాని మధ్యయుగాల భక్తమండలిలో తలమానికమైనవాడు, కబీరుతో సమంగా లేక అంతకుమించి ప్రచారం పొందినవాడైన రవిదాసు పరిచయం వింధ్యపర్వతాలను దాటి దక్షిణాదికి వ్యాపించలేదు. ఇది నిజంగా శోచనీయం.

రవిదాసు తన యుగ ప్రవృత్తులన్నింటినీ సమీకరణ జేసి, అందుండి సామాన్య ప్రజానీకానికి సరళసులభమైన భక్తిమార్గం చూపించాడు. ఆయన పవిత్రవాణి నాడెంత అవసరమైంతో నేడూ అంతే ఆవశ్యకమని ఘంటాపథంగా చెప్పవచ్చు. ముఖ్యంగా యిది సంఘ సంస్కర్తలకు, సంఘనాయకులకు ఎంతైనా అవసరం. అంతేకాక కావ్యప్రియులకు కావ్యరసానందం, ఆధ్యాత్మిక చింతకులు, తాత్వికులకు తత్సంబంధ ఆనందోత్సాహాలు, దళిత, పీడిత ప్రజలలో ఒక భావవిప్లవం కలగజేయగల సామర్థ్యం ఆ భక్తుని సాహిత్యాన్ని కున్నదనడంకూడ అతిశయోక్తి ఎంతమాత్రం కానేరదు.

* * *

# 14

# భక్తుని సందేశం

రవిదాసు కాలం నాటికి దేశపరిస్థితి నానా అలజడులకు గురయి అల్లకల్లోలంగా వుండింది. సాంఘిక, రాజకీయ అస్థిరతలు, మతపర కల్లోలాలు వ్యాప్తిలో వుండినాయి. సాంఘిక, రాజకీయ రంగాలలోనేగాక సాంస్కృతిక రంగంలోకూడ అదొక పరివర్తనాకాలం, కొత్తపాతల కూడలి కాలం అని చెప్పవచ్చును. వివిధ జనవర్గాల రీతిరివాజులు, ఆచార వ్యవహారాల్లో పెనుమార్పులు సంభవిస్తూండిన కాలం. పాత విలువలు, విశ్వాసాల స్థానే కొత్త విలువలు, విశ్వాసాలు పాదుకొంటున్న కాలం. సామాన్య జన జీవనంలో మరీ విపరీతమైన గడ్డుపరిస్థితులు తెచ్చిపెట్టిన సంధికాలం. స్థానిక స్వదేశీయులకు, నవాగంతుక విదేశీయులకు ఉభయులకూ బహు కష్టదాయకమైన పరిస్థితులు నెలకొనివుండినవి. ఓటమిపాలై, అణగదొక్కబడే స్వదేశీ ప్రజలు అనేక తంతులు, ఆచారాలు యిష్టమున్నా, లేకున్నా బలవంతపు బ్రాహ్మణార్థంగా ఆచరించవల్సివచ్చింది. అందువల్ల విజితులైన స్వదేశీయుల్లో నిరాశానిస్పృహలు అలముకొన్నవి. తత్పర్యవసానంగా 'మేము అనాథలం, దిక్కులేని వారం' అనే ఆత్మధిక్కార భావం ఎల్లెడలా వ్యాపించింది. ఇటువంటి స్వీయ ఘృణాభావన ఏ జాతికైనా వేరుపురుగువంటిదిగదా!

నిర్విరామంగా సాగే విదేశీదురాక్రమణలు, దేశప్రజలకు పదే పదే కలిగే అపజయాలు, అందుమూలంగా కలిగే పరాభవాలు- ఒకవైపు అయితే, మరోవైపున నవాగంతుకుల విసూత్న భావాలు, సాంఘిక సమానతా వ్యవహారాలు, అందుకు ప్రతిగా మరింత కరడు గట్టిన స్వదేశీయుల పూర్వాచార పరాయణత్వాల నడుమ భారతీయ సమాజం, సంస్కృతులు సతమతమవుతూండినవి. ప్రజల కొక జీవన్మరణ సమస్య ఎదురయింది. హిందూ సమాజం బతికిబట్ట కట్టాలంటే విజితులు, విజేతల మధ్య పెరిగిన అఖాతం పూడ్చాలి. విజితులైన దేశప్రజల్లో, అందునా సామాన్య ప్రజల్లో జనించిన హీన, దాస్య భావాలు నిర్మూలనం

చేయాలి. వీటికి బదులుగా అందరికీ సానుకూలమైన సార్వజనీన సమన్వయ సామరస్య భావధార పాదుగొల్పాలి. అంటే కాస్త యించుమించుగా సమాజ పునర్నిర్మాణమే జరగాలన్నమాట. నాటి కాలం అపేక్షిస్తున్న ఆవశ్యకత కూడ అదే.

అట్టి తరుణంలోనే సంఘంలో నూతన భావ సంచలనం ప్రారంభమయింది. పరంపరగా కొనసాగుతూవస్తున్న సనాతన, ఛాందస, సంకుచిత ధార్మిక క్షేత్రంలో ఉదార భావాలు, విశాల దృక్పథాలు ప్రవేశింపజేసిన మహామనీషి శ్రీ రామానందుడు. నిజానికి ఆచార్య రామానందుడు ఆ కాలపు ఆధ్యాత్మిక పీఠాధిపతి అని చెప్పుకోవలె. ఎందుకనగా ఏ రకమైన సంస్కరణలు, విప్లవాలనైనా అణగదొక్కే మొండి, బండకాలం అది. మతం, సంఘం, రాజ్యం సహా జీవితరంగాలన్నీ ఛాందసత్వానికి దాస్యం సల్పుతున్న కాలమది. అలాంటి కాలంలో శ్రీ రామానందుడు ఎంతో ధైర్యసాహసాలతో, అపార ప్రజ్ఞాపాటవాలతో అతి సామాన్య ప్రజానీకానికి సైతం సర్వమానవ సమానత్వ భావనలు ప్రసాదిస్తూ దైవచింతనను ప్రగాఢతరం గావించాడు. ఈ మహత్తర కృషిలో ఆయన శిష్యులు గురువుకు దీటుగా నిలిచి తోడుపడ్డారు. ఈ విధంగా వారు మధ్యయుగపు సమాజంలో ఒక ధార్మిక విప్లవమే తీసుకొచ్చారు.

శ్రీ రామానందుడు, ఆయన శిష్యులు అన్ని విధాల నిస్సహాయులైన నిమ్న వర్గాల ప్రజలకు ఓదార్పు, ధైర్యం కల్పించసాగారు. రామానందుడు, కబీరు, నామదేవు, జ్ఞానదేవు, రవిదాసు మొదలయినవారు తమ అమూల్య జీవిత కాలాన్ని ప్రధానంగా ఈ కృషికే వినియోగించారు. 'ముక్కు మూసుకుని, కేవలం స్వీయముక్తికై ప్రయత్నించినవారు' అని స్వామి వివేకానందుడు ఎత్తి పొడిచినటువంటి సన్యాసులు కారు వీరు. పొరుగువాని ముక్తి కొరకు, తద్వారా సమాజ శ్రేయస్సుకోసం పాటుపడిన నిస్వార్థ సాధకులు, నిష్కామ కర్ములు, పరోపకారులూనూ.

అయితే యిక్కడ గమనించవల్సిన విషయం ఒకటి. వీరిలో నామదేవు, జ్ఞాన దేవులు మహారాష్ట్రీయ భక్త పుంగవులు; అయినా వారు ఉత్తర హిందూస్థానంలో యీ విధమైన నూతన సంచలనం కొంత కలిగించిన మాట వాస్తవం. కాని దేశప్రజలను తగినంతగా ప్రభావితుల్ని

చేయలేకపోయారు. ఇక రామానందుడు నవచింతనానికి తగిన పృష్ఠ భూమిని సిద్ధపరిచాడే గాని వ్యవహారికంగా దానిని సామాన్యప్రజలకు అందించలేకపోయాడు. నాటి వాస్తవిక పరిస్థితులను జనసామాన్యానికి అవగాహన చేయడంలోను, వివిధ వర్గాల ప్రజల మధ్య కొంత సామరస్యం కుదర్చడంలోను కబీరుదాసు కొంతవరకు కృతకృత్యుడయ్యాడని చెప్పవచ్చు. కాని అందు కాయన అనుసరించిన వ్యంగాత్మక శైలీ, వికట భాషల కారణంగా జనసామాన్యం ఆయన బోధలు సరిగా అవగాహన చేసుకోలేకపోయారు. ఇదేవిధంగా ప్రగతిశీల చింతకుడయిన ధనా భక్తుని గంభీరోపదేశాలు సమాజంలో అల్ప సంఖ్యాకులైన ఉన్నత వర్గీయుల వరకే పరిమితమైనవిగాని అధిక సంఖ్యాకులైన నిమ్న వర్గీయులకు, నిరక్షరాస్యులకు ఉపకరించలేకపోయాయి. దేశీ విదేశీల కలయిక, పాత కొత్త భావాల సంధికాలంలో భారతీయ సమాజం, సంస్కృతులకు ఎదురయిన విషమావస్థను నాటి భక్త సమాజం గమనించింది. కాని గ్రహించింది గ్రహించినట్టుగా తెలియజెప్పడంలోనూ, తరుణోపాయంగా తాము సంకల్పించుకున్న సామరస్య భావజాలాన్ని సూటిగా సామాన్య ప్రజల హృదయాలకు హత్తుకొనేలా అందించడంలోనూ ఆ భక్త శ్రేష్ఠులందరూ సమానంగా సఫలులు కాలేక పోయారు. వారందరిలోనూ నాటి వాస్తవిక స్థితిగతులను, సాంఘిక వివశతను, ప్రజానీకం బరువుబాధలను సరిగా అవగాహన చేసుకుని, సంవేదనతో అనుభవించి, స్వానుభవసారాన్ని రంగరించి నాటి ప్రజాసామాన్యానికి ఉపయుక్తమైన భాషారీతుల్లో సార్వజనీన సమన్వయ, సామరస్యాల భావధారను సాధారణ ప్రజలకు అందించిన శ్రేయం భక్త శిరోమణి రవిదాసుకే దక్కుతుంది.

మధ్యయుగపు భక్తుల్లో రవిదాసుక్కు ఒక ప్రత్యేక స్థానం వుందని, ఆయన దొక విశిష్ట భక్తి భావనయవి, విలక్షణమైన శైలి అని తెలుసుకున్నాము. తదనురూపంగా పామర జనాభ్యుదయం కొరకు, సమాజ ప్రగతికొరకు పాటుపడని సాధకుడు సాధకుడేగాడని భక్త రవిదాసు ప్రవచించాడు. మహారాష్ట్ర భక్త శిరోమణి జ్ఞానేశ్వరుడు చేసిన భక్త నిర్వచనం కూడ యిదే. అందుచేతనే సమకాలీన భక్తులు సైతం పలువురు పలువిధాలుగా రవిదాసును ప్రశంసించారు. "భక్తుల్లో భక్తుడు మన భక్త రవిదాసు" అని కబీరు కొనియాడితే, "అత్యంత నిష్కామ కర్మకుడు, మహాత్యాగి" అని శ్లాఘిస్తాడు ధనా భక్తుడు. ఇక అనన్య

సాధకురాలు మీరాబాయి, *"గురు మిలై రైదాస్ జీ, దీనీ జ్ఞాన కి గుటకీ"* (జ్ఞాన గుళిక ప్రసాదించాడు రవిదాసు గురువు నాకు) అని కీర్తిస్తుంది. "అంత్యజుడయికూడ అన్ని వర్ణాలవారికీ పూజ్యుడయ్యాడు ఉత్తమ సాధకుడు రవిదాసు" అని ప్రశంసించాడు శిక్కుమత సంస్థాపకుడు గురు నానక్. ఈ విధంగా యింతమంది మహానుభావులచేత యింత ఘనంగా గౌరవింపబడిన సాధకోత్తముడు రవిదాసు సమాజానికి యిచ్చి వెళ్లిన సందేశమేమిటో పరికించుదాం:

1. తన కాలం నాటికి సమాజంలో బాగా వ్యాపించి పోయివున్న కులమత భేదాలు, కొద్ది-గొప్ప తేడాలు, జాతి, వర్ణ తారతమ్యాలు చూచిన రవిదాసు మనస్సు ఎంతో దుఃఖించింది. "ఏ కౌటిల్యము వీనిని ఏర్పరిచెనోగాని చీకటి *గదులున్నె జగదీశ్వరాలయములోన"* అన్న ఒక ఆంధ్రకవి వలెనే ఎంతగానో వ్యథ చెందాడు. చింతన చేశాడు. కార్యకుశలుడయిన కుమ్మరి అనేక రూపురేఖలు, ఆకారపరిమాణాలుగల పలువిధాల పాత్రలు నిర్మిస్తాడు. అయితే వాటి తయారీకి ఉపయోగపడిన మట్టి ఒక్కటేగదా... అదే విధంగా పలురకాల రూపురేఖలు, అనేక విధాల ఆకార పరిమాణాలుగల మానవులను సృష్టించాడు బ్రహ్మ. ఈ సృష్టికి పంచభూతాలను వాడాడు. ఈ విధంగా పంచభూతాత్మకమైన మానవ శరీరధారుల సృష్టికర్త ఒక్కడే బ్రహ్మ. కనుక మానవులంతా ఆ ఏకేశ్వరుని సంతానమే గదా. అప్పుడు మానవులంతా సోదరులవుతారు. సోదరుల్లో కులమతాలు, కొద్దిగొప్పలు కల్పించుకొని, ఆ నిమిత్తంగా పరస్పరం పోట్లాడుకోవడం, కొట్లాడుకోవడం శుద్ధ అజ్ఞానమంటాడు కాలద్రష్ట రవిదాసు. కనుక సమాజంలో మానవులంతా సమానంగా మెలగాలనే మానవతా బోధ చేశాడతడు.

2. సదాచారం, నైతిక వర్తన, పరిశుద్ధ ఆచరణలు లేని పక్షంలో మానవుని మనుగడ సక్రమంగా జరగనేరదు. కనుక యివి మానవులకు అత్యంత ఆవశ్యకమైనవి. అయితే విశుద్ధ ఆచరణ, పరిశుద్ధ నైతిక ప్రవర్తనలకు ఇంద్రియ నిగ్రహం తప్పనిసరి అవసరమంటాడు భక్త రవిదాసు. ఇంద్రియాలను నిగ్రహించనంతవరకు మానవ జీవితం సంతోషంగా కడతేరదంటాడు. ఆ సాధకోత్తముని మతప్రకారం మానవుల ఇంద్రియ లాలస ఎప్పుడూ పూర్తిగా తృప్తిపర్చబడజాలదు. సరిగదా

ఇంద్రియ తత్వం భోగవాంఛను పెంచడమే. భోగవాంఛ పెరిగేకొద్దీ, అది తీర్చుకోవడానికి తగిన సాధనసంపత్తులూ పెరిగితేగాని నరులు సుఖమనుభవించలేరు. మరి భోగనిమిత్తమైన ఈ సామగ్రియే సమస్త దుఃఖాలకు, మానసిక అశాంతికి, పరస్పర కలహ కార్పణ్యాలకు కారణభూతం. కాబట్టి రవిదాసు సందేశమేమంటే భోగ విలాసాలకు, ఈర్ష్యాద్వేషాలకు మూలకందమైన ఇంద్రియలోలత్వానికి లోబడకుండా హమేషా దూరంగా వుండడమే ఉత్తమం. అలావున్నట్లయితే ప్రశాంత మనస్కులై, ఉల్లసిత హృదయాలతో మానవులు మనగలుగుతారు. వారి ఆత్మవిశ్వాసం పెరగగలదంటాడు భక్త రవిదాసు.

3. భోగవాంఛ వల్ల కలిగే అనర్థాలలో ధనలాలస ఒకటి. ధనేచ్ఛ దుఃఖానికి చేటు. కనుక సాధకోత్తముడు రవిదాసు, "ధనం త్యజించనైనా త్యజించాలి, లేదా పరోపకారానికైనా ఖర్చు చేయాలి" అని ప్రబోధిస్తాడు. ఇవి రెండూ కాని పక్షంలో, మానవులు దుఃఖమనుభవించక తప్పదు. ఈ సందర్భంగా "నామ భజన మే జో సుఖ పావె, సో సుఖ నాయి అమీరీ మే" అంటాడొక గుజరాతీ భక్తుడు. అంటే, నామస్మరణలోగల సుఖశాంతులు ధనార్జనలో వుండవట. భక్త రవిదాసుకూడ యిలాగే చెబుతాడు.

> **ధన సంచయ దుఃఖ దేత హై, ధన త్యాగే సుఖ హొయ్ ।**
> **'రవిదాసు' సీఖ గురు దేవకీ, ధనమతి జోరై కోయ్ ।**
>
> *ధన సంపాదన, సంచయం దుఃఖానికి మూలం. ధనత్యాగం సుఖానికి మూలం. కనుక అధిక ధనార్జనాలాలస వీడమని గురు రవిదాసు హితవు.*

4. 'శ్రమైక-జీవన సౌందర్యం' గురించి, స్వీయశ్రమ ద్వారా జీవిక సంపాదించుకోవల్సి అగత్యం గురించి భక్త రవిదాసు సమాజానికి మౌలిక సందేశం యిచ్చాడు. పరాన్న భుక్కులా జీవించడం రవిదాసుకు సుతరామూ యిష్టం లేదు. హోతింతాయిలాగ 'తేరగా వచ్చిన పిండివంటల కంటె కష్టపడి గడించుకున్న గంజిమేలు' అనే తత్వం ఆయనది. భక్త రవిదాసు అభిప్రాయం ప్రకారం శ్రమయే భక్తి; శ్రమయే దైవం; సమస్త సుఖశాంతులకు, కడకు ఆ పరమపద ప్రాప్తికి సైతం శ్రమయే సులభ మార్గం. చెప్పేదొకటి, చేసేది మరొకటికాదు రవిదాసు తత్వం. ఆయన కేవలం ఉపదేశ కర్త కూడ కాదు. స్వానుభవమే యితరులకు బోధించేవాడు.

ఈ విషయమై తన ఉన్నత అభిప్రాయాల కనుగుణంగా జీవితాంతం చర్మకారవృత్తి చేస్తూనే పొట్టపోసుకుంటూ వచ్చాడు. తన పునీత జీవితమే తన బోధనకు ఆదర్శంగా నిలిపాడు. భక్తి, ఆరాధనలద్వారా ఆ ఏకేశ్వరుని సన్నిధి పొందడానికి కర్మ ఎంత ఉపాదానమైనదో రవిదాసు పదాల్లో గోచరిస్తుంది. గమనించండిః

**జిహ్వా సో ఓంకార జప, హత్థన సే కర కార్ ।**
**రామ మిలహి ఘర్ ఆయి కర కహి రవిదాస్ ॥**

జిహ్వతో ఓంకారం జపిస్తూ చేతులతో పనులు చేసుకుంటూ పోతూంటే ఆ భక్తవత్సలుడు ప్రసన్నుడై భక్తుని ఇంటికే వచ్చి దర్శనమిస్తాడట.

ఆహా, ఎంత అమోఘమైన ఆత్మవిశ్వాసం! తదనుగుణంగానే ఆయన తన జీవితంలో కర్మకు విశేష ప్రాధాన్యం యిచ్చాడు.

5. రవిదాసు జన్మతః భక్తుడు. భక్తి భావనలతోనే పెరిగాడు. భక్తినే జీవనాధారం చేసుకొని జీవించాడు. చివరకు భక్తిలోనే పరమపదం చేరుకున్నాడు. అటువంటి రవిదాసు భక్తిని బోధించకుండా ఎలా వుండగలడు? గురు రవిదాసు సహజ భక్తుడు కావడం చేత భగవద్భక్తికి ఎలాంటి ఆడంబరాలు అవసరంలేదంటాడు. వాటికి సమ్మతించడు కూడాను.

**వన భోజఞ పిఅన మిలహి, బన మాహ ప్రీతమీ నాహి ।**
**'రవిదాస' పిఅ హై బసి రహ్యా, మానవ ప్రేమ మా హి ॥**

అంటే సహజ భక్తునికి భక్తి సాధనకొరకు, దైవదర్శనం కోసం ఇల్లూవాకిలీ, బంధుమిత్రులను విడిచి తోటి మానవులకు, సమాజానికి దూరంగా అరణ్యప్రదేశాలకుగాని, పర్వతగుహలకుగాని వెళ్లవలసిన పని లేదని చెబుతాడు. 'మానవ సేవయే మాధవ సేవ'గా నెంచిన వారికి మానవప్రేమలోనే దైవదర్శనమవుతుంది. కనుక రేయింబవలు మానవసేవలో లీనమై వుండమంటాడు.

6. రవిదాసు భక్తి ప్రేమ ప్రధానమైన భక్తి. అందుమూలంగా అనురాగ, విశ్వాసాల బలం బాగా చేకూరింది. దాని ఆధారంగా,

రవిదాస్ జన్మకై కారనై, హెూత్ న కోఉ నీచ్ ।
నర కూ నీచ్ కర్ డారి హై, ఓచె కరమ్ కౌ కీచ్ ।

అంటాడు. అంటే మానవులెవరూ జన్మతో నీచులు, అంటరాని, చూడరానివారు కారని, తమ తమ కర్మలు, ఆచరణలను బట్టి ఉత్తములుగానో, అధములుగానో అవుతారని అర్థం. ఇలా సాధికారంగా వెల్లడించి ఛాందస సనాతనవాదులకు కనువిప్పు కలిగించాడు.

7. భక్తి క్షేత్రంలో రవిదాసు చూపిన సాహసం అసామాన్యమైనది. ఇష్టదేవతారాధన, ధర్మపీఠోపదేశాలు మొదలైన కార్యాలు అన్ని వర్ణాలవారూ చేయవీలులేదని, కొద్ది సంఖ్యలో గల కులీనులకే అది హక్కుభుక్తమనీ చిరకాలంగా వచ్చిన రివాజు. అజ్ఞానం, అవివేకాలవల్ల సమాజంలో రూఢిగా చెలామణీ అవుతూన్న ఆ రివాజును తోసిరాజన్నాడు రవిదాసు. సవర్ణ-అవర్ణ, ధనిక-దరిద్ర, పేదాసాదా తారతమ్యాలు లేకుండా మానవులంతా దైవార్చన చేసుకోవచ్చని, ధర్మపీఠాలెక్కి ఉపదేశాలు యివ్వవచ్చని నిర్భయంగా చాటి చెప్పాడు. అంతేకాదు, సాటిలేని భక్తునిగా, సిద్ధి పొందిన సాధకునిగా ప్రసిద్ధి చెందాడు. వట్టి మాటలతో చేసే ఉపదేశాలు గాక ఒక నిర్మాణాత్మక సందేశం అందజేశాడు.

8. అది హిందూ, ముస్లింల నడుమ, వారి సంస్కృతుల మధ్య తీవ్ర సంఘర్షణ సాగుతున్న కాలం, ఉభయ సంప్రదాయాలు పరస్పరం బద్ధవైరులుగా చూచుకుంటున్న కాలమని యిదివరకే చెప్పుకున్నాముగదా. పరస్పర విరోధభావంతో వుండే నాటి ప్రవృత్తులు భక్త రవిదాసుకు ఎంతమాత్రం నచ్చలేదు; అసహజంగా తోచింది. కనుక తన సాత్వికసాధన, హితోపదేశాల ద్వారా విజితులు, విజేతల మధ్య ఉభయులకు అవసరమైన సమన్వయ భావం సృష్టించాడు. సమయోచిత సామరస్య భావం నెలకొల్పాడు. తన వ్యంగ్యశైలిలో కబీరు హిందూ, ముస్లిం ఉభయ సముదాయాలను ఎత్తిపొడిస్తే, రవిదాసు తన సమన్వయ సామరస్య భావనలో ఉభయ సంప్రదాయాలను ఏ విధంగా సమీకరణ చేయ జూస్తున్నాడో గమనించండి :

కృష్ణ కరీమ్ రామ హరి రాఘవ జబలగి ఏక నపేఖా ।
వేద కతేవ కురావ పురానన సహజ ఏక కరి భేషా ॥

అంటే కృష్ణుడు, కరీమ్, రాముడు మొదలైన వారందరినీ సమాన దృష్టితో చూడనంతవరకు ఎన్నివేదాలు చదివినా, ఎన్ని పురాణాలు పఠించినా,ఎన్ని కురాన్లు పఠించినా ప్రయోజనం శూన్యమని అర్థం. ఇలా మెత్తగా, మర్యాదగా మందలించి హిందూ-ముస్లింల మధ్య పరస్పర సౌహార్ద సామరస్యాలు నెలకొల్పయత్నించాడు.

9. ఉపేక్షిత సమాజంలో ఉద్భవించినప్పటికీ రవిదాసు ఉపేక్షితునిగాకాక ఉత్తమునిగానే జీవించాడు. ఇంకా యుగయుగాలుగా తోటి మానవులకూ, సమాజానికీ దూరంగా వుండిపోయిన సాటి పీడిత ప్రజలను మేలుకొలిపి, వారిని ఓదార్చి, వారికి తగుస్థానమిచ్చి సంఘంలో కుదురుగా సమ్మానపూర్వకంగా నిలబెట్టాడు. ఇలాంటి జీవిత కృషే రవిదాసుని ప్రత్యక్ష ఉత్తమ సందేశమని చెప్పవచ్చు.

10. గురు రవిదాసు సమాజానికి, ముఖ్యంగా పీడిత తాడిత దళిత సముదాయానికి యిచ్చిన సర్వోత్తమ సందేశం యిది :

> ఓ మానవులారా! ఈ కులమతాల కుంభకోణంలో చిక్కి మిమ్మలను మీరు కించపరచుకోకండి. జ్ఞానం, భక్తి, మహత్తు, శ్రేష్ఠతలనేవి కేవలం ఒక వర్గం వారి నొసటనే రాసిపెట్టబడలేదు. సంఘంలో తక్కిన మనుషులందరివలెనే మీరుకూడ భక్తులు, జ్ఞానులు కావచ్చును. శ్రేష్ఠులు, మహాత్ములు కావచ్చును. ఇందుకు వలసిన సద్గుణాలు వీరు వారనకుండా అందరికీ అందుబాటైనవి. అనుసరింపదగినవి. కానైతే ఒకటే షరతుః హరి అనగా ఈశ్వరునిపట్ల అచంచల విశ్వాసం, ఆచరణ శుద్ధి అవసరం. అవి వుంటేనే మానవ హృదయాల్లో అంతర్నిహితమై వుండే దైవత్వాన్ని కనుగొనగల్గుతారు; దాన్ని మేల్కొలుపగలుగతారు.

* * *

# 15

# ఉపసంహారం

ఈ విధంగా భక్త రవిదాసు సమాజంలో చెలామణి అవుతున్న మూఢ నమ్మకాలను, సంకుచిత భావాలను, కుల, మత, జాతి వైషమ్యాలను నిస్సంకోచంగా ఖండించి సర్వమానవ సంక్షేమదాయకమైన సమసమాజంకోసం పాటుపడ్డాడు. హెచ్చు తగ్గులు, కొద్ది గొప్పలు, పేదసాదలు, ధనిక దరిద్రులు లేని ఒక నవసమాజాన్ని గురించి ఆయన కలలు కన్నాడు. అంటే నేటి భాషలో ఒక సామ్యవాద సమాజం గురించి, మానవతావాద సమాజం గురించి అన్నమాట. హిందూ ముస్లిం సముదాయాల మధ్య పరస్పర విరోధ ప్రవృత్తులు బలంగా పనిచేస్తూండిన నాటి సమాజంలో కటువైన సత్యాలు ప్రవచిస్తూ ఉభయులకూ అవసరమైన సమరసభావం నింపజేయడం సామాన్య మానవులకు సాధ్యమయ్యే పనికాదు. సాహసం, సహనం రెండూ దండిగా గల మానవాతీతునికే సాధ్యం. మరి రవిదాసువంటి సిద్ధునికే అట్టి సందేశాలివ్వడం చెల్లింది. కనుకనే నాటి సమాజం ఆయన్నొక సంఘసంస్కర్త అనీ, గొప్ప విప్లవకారుడు, ప్రగతి శీలి అనీ శ్లాఘించింది. సమాజానికి సరియైన, సరళ సులభమైన రాజమార్గం - భక్తిమార్గం - చూపించాడు భక్త రవిదాసు అని కొనియాడింది నాటి భక్త సముదాయం.

రవిదాసు కారణజన్ముడు. కనుక సాధకున కుండవలసిన సహనం, సంతృప్తి, భక్తునికుండవలసిన రాగవిశ్వాసాలు, ధైర్యసాహసాలు, వీటినిమించి జనసామాన్యానికి నచ్చజెప్పగల ఓపిక, సామర్థ్యం గల సాధకోత్తముడై నాడు. ఆయన బోధ లేవీ నిజమైన శాస్త్రమర్యాదలను ఉల్లంఘించేవి కావు. అందువల్లనే ఆయన పరంపరకు వ్యతిరేకంగానైనా తత్కాలానుగుణంగా కొత్తపాతల కలయికతో ఒక సమన్వయ భావధారను, ప్రగతిశీల మార్గాన్ని సృష్టించగల్గాడు. కాలప్రవాహంలో అధోగతి పాలైన సమాజ సత్సంస్కృతులను పునరుద్ధరించడానికి తన సర్వస్వం సమర్పణ చేశాడు. పురోహితవాదం, ఛాందస పండితుల చండశాసనం సర్వోపరిగా

సాగుతూండిన భూస్వామ్య (ఫ్యూడల్) యుగంలో ఎన్ని ఆటంకాలు వచ్చినా, అవరోధాలు కల్పింపబడినా వాటన్నిటినీ అధిగమించి తాను ఒక నూతనమార్గం అవలంబించడమనేది ఎంతో సాహసంతోకూడిన పని. అంతేకాదు, తన నిర్దిష్ట పంథాలో నిర్భయంగా సాగిపోయాడు. తన గమ్యం - పరాశక్తి సాయుజ్యం - చేరగలిగాడు. తద్వారా సమాజంలో నిమ్న వర్గాలకు చెందిన శూద్రులు, అంతకంటె నిమ్నస్థాయిలోని పంచములు, దళితులు మొదలైన బహిష్కృతులు, తిరస్కృతులు అంతా పరమేశ్వరుడిని భక్తితో పూజించుకోవచ్చని, అందుకెలాంటి అవరోధాలు వుండరాదు, వున్నా నిలువజాలవని నిరూపించాడు. అందుకుగాను ధార్మిక ఉపాసనలో నాడు ప్రచారమందున్న వివిధ భక్తి మార్గాలను చక్కగా అవగాహన చేసుకుని, వాటి కతీతమైన సమన్వయమార్గం -రామనామ స్మరణం - ప్రజలకు సూచించాడు. రామనామస్మరణ ప్రచారానికీ, ప్రజలు భక్తిమార్గం అవగాహన చేసుకొనడానికీ అనుకూలంగా ఖండన మండనరహితమైన సులభ సామాన్యమైన అభివ్యంజనా శైలిని సృష్టించాడు.

భక్త రవిదాసు వాణి మధ్యయుగపు జనజాగరణ వాణి. అంతేగాక ప్రాచీన భారతీయ సంస్కృతిని పోషించే వాణి. ఇంకా, భౌతిక జీవితంలోని యథార్థతను చూపించే వాణి. అందున్న తత్వదర్శనానికి సరియైన వ్యాఖ్యానంకూడ చేసిన వాణి. భగవద్భజన, సదాచార జీవనం, నిరహంకార వృత్తితో చేసిన సాధన, సర్వజన హితాయ, సర్వజన సుఖాయగా చేసిన కార్యమే వాస్తవికమైన ధర్మమని బోధిస్తున్నది రవిదాసు వాణి. భక్తి, సదాచారాలను గురించి మధ్యయుగాలనాటి భక్తులందరూ చెప్పారు, రవిదాసూ చెప్పాడు. ఇందులో విశేషం లేదు. కాని 'కర్మయే ధర్మం' అని నొక్కిచెప్పడంలో రవిదాసు ప్రత్యేకత యిమిడి వుంది.

సంఘంచే ఉపేక్షితులు, ఆర్థికంగా వంచితులు, రాజకీయంగా తిరస్కృతులు అయిన వేలాది మానవుల్లో తలెత్తుకు తిరిగే సాహసం పురిగొల్పింది రవిదాసు వాణి. మానవజన్మయెత్తడంలో అంతరార్థం అత్యుత్తమ లక్ష్యం చేరడమేనని ప్రబోధించిందా వాణి. 'సాదా జీవనం, ఉన్నత చింతనం' (plain living and high thinking) అనే తత్వజ్ఞుల పలుకు రవిదాసుపట్ల పూర్తిగా వర్తిస్తుంది.

అంత్యజకులంలో పుట్టినప్పటికీ చరిత్రలో, వ్యవహారంలో, సాధనలో ఏ వైష్ణవ భక్తునికీ తీసికట్టుగా జీవించలేదు రవిదాసు. ఒక ధార్మిక విద్వాంసునికంటె మిన్నగా గౌరవ మర్యాదలందుకున్నాడు. స్వాభిమానంతో సొంతకాళ్లపై నిలబడి బతికాడు. నిర్విరామ కర్మ, సతత సాధనాల ద్వారా పరమేశ్వరునిపట్ల అమోఘమైన రాగవిశ్వాసాలు అలవర్చుకున్నాడు. గొప్ప గుండెబలం సముపార్జించుకున్నాడు. ఫ్యూడల్ యుగపు పూర్వాచార పరాయణులు, ఛాందస పండితుల సమాజ వ్యవస్థలో యుగయుగాలుగా మానవధరాతలంపై జీవించడానికి, కాదుకాదు, నిలవడానికే చోటులేని ఒక పెద్ద జనసముదాయానికి స్వాభిమానం, నైతికబలం ప్రసాదించి భూతలంపై వారు తలెత్తుకు తిరగడానికి, సగర్వంగా జీవించడానికి ఆస్కారం కల్పించాడు. రవిదాసు రాగవిశ్వాసాలముందు పూర్వాచార పరాయణుల కుహనా ఆడంబరాల వ్యవస్థ నిలువలేకపోయింది. కనుకనే అన్ని వర్ణాల ప్రజలూ ఆయన బోధలు వినక తప్పింది కాదు. రవిదాసు భక్తిభావ పరంపర ఎంత విస్తృతంగా వ్యాప్తి చెంది వుండేదో ఆ కాలంలో ప్రచారంలోనున్న ఈ సంస్కృత సాహిత్యోక్తిని బట్టి ఊహించుకోవచ్చు.

గత గీతా నశం క్వచిదపి పురాణం వ్యపగతమ్ ।
విలీనాః స్మృత్యర్థా నిగమనిచయో దూరగతమ్ ।

ఇదానీ రైదాస ప్రభృతి వచనైర్మోక్ష పదవీ ।
తదేవ జానీమో కలియుగ త్వై వేష మహిమా ।

*గీత నశించిపోయింది. ఉపనిషత్తులు లుప్తమైనవి. వేదాలు విస్మృతమైనవి. కారణం రవిదాసు ప్రభృతుల వాణిద్వారా ప్రజలు మోక్షం పొందగలుగుతున్నారు. కలియుగ మహిమ యిది.*

సమకాలీన పండితులు రవిదాసు ప్రభావానికి అసహిష్ణులై పై వాక్యాలు అన్నట్లు అగుపిస్తున్నది. కాని సంకుచిత మనోవృత్తి గలవారు ఎందరేమనుకున్నప్పటికీ రవిదాసు భావాల ఔచిత్యం మరింత వృద్ధయిందే గాని తగ్గలేదు. నాటి సమాజంలో ప్రధానంగా ధార్మిక క్షేత్రంలో రవిదాసుకుగల స్థానం, ఆయన భావాల ఔచిత్యాన్ని బట్టి సమకాలీన ప్రజానీకంచే రవిదాసు ఏ బ్రాహ్మణునికన్నా తక్కువగా గణింపబడలేదని స్పష్టమవుతున్నది.

భక్త రవిదాసు గొప్ప దూరద్రష్ట, సంఘసంస్కర్త, ఆయన జీవితం ఆద్యంతాలు సంఘర్షణాపూరితం. అయినా గృహస్థులకు కర్మమయ జీవితమార్గం, గృహస్థులు కానివారికి నిష్కామ మానవసేవా మార్గం చూపించాడు: నిద్రిస్తున్న సమాజాన్ని తట్టిలేపాడు. సంకుచితతత్వాలు కుసాంప్రదాయాల సంకిలం నుండి సమాజాన్ని బైటకు తీసి, దానికి స్వస్థత, స్వచ్ఛత చేకూర్చాడు: అందుకే మన జాతిపిత మహాత్మ గాంధీ, "బీజన్యాయంగా తన్నుతాను నశింప జేసుకొని ఇతరులకు జీవనదానం చేయడం నేర్పాడు. తోటి మానవుల అభ్యుదయం కోసం కష్టాల కొలిమిలో తాను స్వయంగా భస్మమై పోవడం రవిదాసు వంటి త్యాగవీరునికే తగింది. హరిజనుల కోసం ప్రభుమందిరం తెరిపించడం కొరకే ఆయన దైవ భక్తిలోని వ్యాకులత, ఆరాటం అంతా. రవిదాసుని అమృతవాణి తప్తహృదయాలను చల్లబరుస్తుంది. సామాన్య మానవులకు సైతం సమానత్వం ప్రసాదిస్తుంది." అని భక్త రవిదాసును కొనియాడారు.

భక్తాగ్రేసరుడు రవిదాసు అవతరించి సుమారు 650 ఏండ్లు దాటింది. నాడు రవిదాసు, కబీరుల్లాంటి భక్తులంతా ఏ సాంఘిక అన్యాయాలు, అంతర్ వైరుధ్యాలు, అల్పాధిక తారతమ్యాలు, దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా తీవ్ర పోరాటం చేశారో ఆ సాంఘిక అన్యాయాలు, అసమానతలు నేటికీ కొనసాగుతున్నవి. మానవులుగా గౌరవప్రద జీవనం గడపడానికి వీలులేక కోట్లాది ప్రజలు ఆరాటపడుతున్నారు. అందువల్ల రవిదాసులాంటి సాధక శ్రేష్ఠులు, నిస్వార్థ సంఘసేవకులు, గొప్ప సంస్కర్తలు, జాగృత భక్తులు నేడూ ఎంతో అవసరమే. రవిదాసు బోధలు నాడెంత ప్రయోజనకరమో నేడూ అంతే ఉపయోగకరమనడంలో సందేహంలేదు. ఈ దృష్టితో చూస్తే ఆయన వాణి, భావాల రీత్యా నాటికీ, నేటికీ ఆయన గొప్ప సంఘసేవకుడు, మౌలిక చింతకుడు, సాంఘిక విప్లవకారునిగా నిలిచిపోతాడనడంలో సందేహం లేదు. మానవ సమాజంలో అసమానతలు, ఉచ్చనీచ తారతమ్యాలు, అసహిష్ణుతలు వున్నంత వరకు భక్త రవిదాసు విశాల, ప్రగతిశీల భావాలు, వాటి సమయౌచిత్యం అభేద్యంగా వుండగలవనడంలోకూడా సందేహం లేదు.

అజ్యేష్టాసో అకనిషాస ఎతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ ।
యు వా పితా స్వపారుద్ర ఎషాం సుదుఘా పృశ్నిః
సుది నామరుద్భ్యః ।

మనలో గొప్పవారు లేరు, కొద్దివారు లేరు. కులీనులు, అకులీనులు అసలే లేరు. అందరం కలసి సోదరులవలే మెలగాలి. అందరి పురోభివృద్ధి కోసం అందరం కలిసి పాటుపడాలి. మనమంతా ఆ పరమ పిత సంతానం. మనందరికీ సుఖమునిచ్చి, పాలిచ్చి పోషించు ప్రకృతి మన తల్లి.

* * *

# 16

# రవిదాసు వాణి పరిచయం

1. జైసా రంగ్ కుసుంబ కా తైసా ఇహ సంసార్ ।
మేరె రమ్యఈ ఎ రంగ్ మజీఠ కా కహి రవిదాస్ చమార్ ।

ప్రపంచం కుసుంబ పుష్పంవంటిది. క్షణక్షణం రంగు మారుతూంటుంది. తన ఆరాధ్యుని రంగు తొగరు రంగు వంటిది, శాశ్వతమైనది, ఎన్నటికీ మారనిది అంటాడు చర్మకారుడు రవిదాసు.

2. ఇక్ నజిర్ సో సబకూ దేఖఇ, సరిష్టికా నిరజన హారా ।
సబ ఘట వ్యాపక అలఖ నిరంజన, కహి రవిదాస్ చమార్ ।

సృష్టికర్త ఈశ్వరుడు అందరినీ సమానంగా చూస్తాడు. ఆ నిర్గుణ నిరాకార బ్రహ్మ (అలఖ్ నిరంజన్) సర్వత్రా వ్యాపించి వున్నాడని చర్మకారుడు రవిదాసు కథనం.

3. మసిజిద్ సో కచు ఘిన నహి, మందిర్ సో నహీ పిఆర్ ।
దోఉ మహ అల్లాహ్ రామ నహీ, కహ రవిదాస్ చమార్ ।

మసీదు అంటే రోతకాదు. మందిరం అంటే ప్రేమా లేదు. ఈ రెంటిలో దేనిలోనూ అల్లా, ఈశ్వరులు లేరని చర్మకారుడు రవిదాసు అభిప్రాయం.

4. జివ్హా సో ఓంకార్ జప, హత్థన సో కర్ కామ్ ।
రామ్ మిలహి ఘర్ ఆఇ కర్, కహి రవిదాస్ విచార్ ।

నాలుకతో ఓంకారం జపిస్తూ, చేతులతో పనిచేస్తూ వున్నట్లయితే పరమేశ్వరుడు వచ్చి సొంత గుమ్మంలోనే దర్శనమిస్తాడని రవిదాసు బోధ.

5. జన్మజాతకూ ఛాడికరి, కరనీ జాన్ పరధాన్ ।
ఇహ్యాం వేదకా ధరమ హై, కరై రవిదాస్ బఖాన్ ।

జన్మ, జాతి మాట వదిలి కర్మను ప్రధానంగా యెంచాలి. వేదాలలో చెప్పిన ధర్మమిదేనని రవిదాసు చెబుతాడు.

6. బహ్మన్ ఖతరీ బైస్ సూద్, రవిదాస్ జన్మతే నాహి ।
జో చాహ ఇ సు బరన కఊ, పావఊ కరమన మాహి ।

రవిదాసు మతప్రకారం పుట్టుకతో మానవులెవరూ బ్రాహ్మణులు, వైశ్యులు, క్షత్రియులు లేక శూద్రులు అవరు. ఎవరు ఏమయినా అది వారు చేసే కర్మనుబట్టే అవుతారు.

7. పరాధీనతా పాప హై, జాన లేహురే మీత్ ।
రవిదాస్ దాస్ పరాధీన సో, కౌన్ కరె హై ప్రీత్ ।

పరాధీనత మహాపాపం, పరాధీనుడు బానిసవంటివాడు, అతడిని ఎవరూ ప్రేమించరు తెలుసుకొమ్మని హెచ్చరిస్తాడు రవిదాసు.

8. పరాధీన కొ దీన క్యా, పరాధీన బె దీన్ ।
'రవిదాస్' దాస్ పరాధీన కొ, సబహీ సమఝె హీన్ ।

పరాధీనునికి ధర్మమేమిటి? పరాధీనునకు ధర్మమంటూ వుండదు. పరాధీనుని, బానిసను అందరూ నీచంగా చూస్తారని రవిదాసు చెబుతాడు.

9. రవిదాస్ జన్మకె కారనై, హెూత్ న కోఉ నీచ్ ।
నరకూ నీచ్ కర్ డారి హై, ఓచె కరమ కౌ కీచ్ ।

జన్మకారణంగా ఎవరూ నీచులు కారు. నీచకర్మమనే పంకమే మానవుల్ని నీచులుగా చేసిందని రవిదాసు అంటాడు.

10. 'రవిదాస్' బాహ్మన మతి పూజిఏ, జఉ హెూవె గున హీన్ ।
పూజహి చరన చండాలకె, జఉ హెూవై గున పరవీన్ ।

గుణహీనుడైతే బ్రాహ్మణుడైనా పూజార్హుడు కాడు. అదే గుణ సంపన్నుడైతే చండాలునికైనా చరణపూజ చేయాల్సిందేనని రవిదాసు బోధ.

11. జాతి పాంత కె పేర మహి, ఉరఖు రహ్యా సబలోగ్ ।
    మానుషతా కూ ఖాతహై ఇ, రవిదాస్ జాత కర రోగ్ ।

కుల మత జంజాటాల్లో మనుషులంతా చిక్కుపడివున్నారు. కాని ఈ కులమతాల రోగం మానవత్వాన్ని మింగేస్తున్నదన్న సంగతి ఎవరూ గమనించడం లేదని రవిదాసు హెచ్చరిస్తున్నాడు.

12. జాత జాత మె జాత హై, జ్యోం కేలన మె పాత్ ।
    'రవిదాస్' న మానుష జుడ సకై, జోలౌ జాత న జాత్ ।

అరటి ఆకులవలె జాతి నుండి జాతి, అందునుండి ఉపజాతులుగా పుట్టుకొస్తున్నాయి. ఈ జాతులు నశించిపోనంతవరకు మానవులు పరస్పరం కలవజాలరంటాడు భక్తుడు రవిదాసు.

13. సత్ సంతోష్ అరు సదాచార్, జీవన్ కో ఆధార్ ।
    'రవిదాస్' భయే నర దేవతే, జిన త్యాగే పంచ వికార్ ।

సత్యం, సంతోషం, సదాచారాలు మానవ జీవితానికి ఆధార స్తంభాలు. విషయలోలత్వం మొదలైన పంచవికారాలను జయించిన మానవుడే దైవత్వం పొందగల్గుతాడంటాడు రవిదాసు.

14. జో బస రాఖే ఇంద్రియా, సుఖ దుఃఖ సమఝు సమాన్ ।
    సో ఉ అమరిత పద పాయిగో, కహి 'రవిదాస్' బఖాన్ ।

ఇంద్రియవాంఛల్ని అదుపుచేసుకుని సుఖదుఃఖాలు రెంటినీ సమదృష్టితో చూచేవారే అమరపదం పొందగలుగుతారని రవిదాసు వివరిస్తాడు.

15. ఐసా చాహౌ రాజమే, జహా మిలై సబనకో అన్న ।
ఛోట బడో సబ సమ బసై 'రవిదాస్' రహై ప్రసన్న ॥

కొద్ది-గొప్ప, పేద-ధనిక తారతమ్యంలేకుండా అందరికీ కూడు, గుడ్డ, నీడ లభించే, అందరూ ఆత్మసమ్మానంతో సమానులై వుండే రాజ్యం ఏర్పడితే రవిదాసు సంతోషిస్తాడు.

16. మాథై తిలక హాథ్ జపమాలా,
జగకు ఠగనేకు స్వాంగబనాయ ।
మారగ చాడి కుమారగ డహకై,
సాంచీ ప్రీత బిను రామ నపాయ ॥

నుదుట బొట్టు, చేత జపమాల ధరించి లోకాన్ని మోస పుచ్చడానికి భలేవేషాలు వేస్తుంటారు. అయితే సాధుమార్గం వీడి కుమార్గంలో నడుస్తుంటారు. కాని నిజమైన ప్రీతి లేనంతవరకు రామ (దైవ) దర్శనం కలుగదు.

17. 'రవిదాస్' మదురా కా పీజియే, జో చఢై చఢై ఉతరాయ్ ।
నావ మహరస పీజియే, జో ఛడై నాహి ఉతరాయ్ ॥

ఎక్కిన మత్తు పదే పదే దిగి పోతూండే మదిరారసం తాగడమెందుకు? మత్తెక్కడమే గాని ఎన్నడూ దిగని రామనామ రసం తాగరాదా అంటాడు రవిదాసు.

18. బన భోజ ఇ పిఅ న మిలహీ, బన మాహ ప్రీతమ నాహి ।
'రవిదాస్' పిఅ హై బసి రహ్యౌ, మానవ ప్రేమహి మాహి ॥

అడవుల్లో కొండగుహల్లో ఎంత వెదికినా పరమేశ్వరుడు దొరకడు; మానవ ప్రేమలో మాత్రమే ఆ ప్రియ దేవుడు నిలిచివుంటాడని రవిదాసు మతం.

19. ఇక బూంద్ సౌ బుఝి గఈ, జనమ జనమ కీ ప్యాస్ ।
జనమ మరన బంధన టూటఈ, భయే 'రవిదాస్' ఖలాస్॥

ఒక్క బొట్టుతో (అంటే ఒక్కసారి దైవసాక్షాత్కారం కావడంతోనే) జన్మజన్మల దాహం తీరిపోయింది; జనన మరణ బంధనాలు సైతం తెగిపోయాయి; జీవన్ముక్తి లభించిందంటాడు రవిదాసు.

20. ప్రేమ పంథ కీ పాలకీ, రవిదాస్ బైఠియో ఆయ్ ।
సాంచే సామి మిలన్ కూ, ఆనంద కహ్యో న జాయ్ ।

ప్రేమమార్గపు పల్లకిలో కూర్చుని తన ప్రియతమ దైవాన్ని కలవడానికి వెళ్లేటప్పుడు తనకు కల్గిన అపూర్వ ఆనందానుభూతి వర్ణనాతీతమంటాడు భక్త రవిదాసు.

21. దయాధర్మ జిన్హమె నాహి, హిరదై పాపకీ కీచ్ ।
'రవిదాస్' తిన్హహి జానిహొ, మహాపాతకీ నీచ్ ।

హృదయంలో దయాధర్మస్వభావం లేనివాడు, పాపపంకిలం పెంచుకున్నవాడు మహాపాపి, నీచుడని తెలుసుకోమంటాడు రవిదాసు.

22. బ్రాహ్మన అరు చండాల మహి, 'రవిదాస్' నహి అంతర్ జాన్ ।
సబ మహి ఏక్ హి జ్యోతి హై, సబ ఘట ఏక్ భగవాన్ ।

పిపీలికాది సకలప్రాణులు ఒకే పరంజ్యోతి నుండి పుట్టినప్పుడు, సమస్తప్రాణుల్లో ఒకే ఈశ్వరుడు వసిస్తుండగా, వీరు బ్రాహ్మణులు వారు చండాలులు అనే అంతరం చూడవద్దంటాడు భక్త రవిదాసు.

23. పంచదోష తజి జో రహఈ, సంత చరన లవ లీన్ ।
'రవిదాస్' తే హీ నర జానఈ, ఊంచహి అరు కులీన్ ।

కామక్రోధాది పంచదోషములు త్యజించి, సాధుపురుషుల సత్సంగంలో లీనమై వుండే మనిషే ఉత్తముడు, కులీనుడని భక్త రవిదాసు నిర్ణయం.

24. దీన దుఖి కే హేత్ జఉ, బారై అపనే జాన్ ।
'రవిదాస్' ఉహ నర సూర్ కౌ, సాంచా ఛత్రీ జాన్ ।

నిస్సహాయులు, దీనులు, దుఃఖితుల రక్షణార్థం ఎవరైతే తమ ప్రాణాలర్పిస్తారో వారే నిజమైన శూరులు, క్షత్రియులని తెలుసుకోమంటాడు రవిదాసు.

25. జల కీ భీతి పవన కా థంబా రకత బూంద కా గారా ।
హాడ మాంస నాడీ కో పింజరా పంఖీ బసై బిచారా ।

నీటిగోడలు, గాలిస్తంభాలు, రక్తమాంసాల గచ్చు, నరాలు, ఎముకల అల్లికలతో నిర్మితమైన ఈ శరీర పంజరంలో పాపం ఆయువు పిట్ట చిక్కుపడివుందని రవిదాసు అంటాడు.

26. సాద సంగతి బిను భాఉ నహీ ఉపజై ।
భావ బిను భగతి హెూఇ న తేరీ ।

సాధుపురుషుల సాంగత్యం లేకుండా భావం పుట్టదని, భావోదయం కానిదే భక్తి జనించదని సాధక శిరోమణి స్వానుభవంతో వెల్లడిస్తున్నాడు.

27. అంతర గతి రాంచే నహీ, బాహర కర్రై ఉజాస్ ।
తే నర జమపురి జాహింగే, భాషై సంత్ రైదాస్ ।

హృదయాంతరాల్లో భక్తి లేకుండా, సమర్పణ భావం లేకుండా తీర్థాటనలు, పూజా పునస్కారాల వంటి బాహ్యాడంబరాలు ఎన్ని చేసినా అవన్నీ వ్యర్థమే. అలాంటి వారికి ముక్తి లభించడం అసంభవం, వారు నరకానికే వెళతారు అని హెచ్చరిస్తాడు భక్త రవిదాసు.

28. లోహ కీ నావ పాషానన బోఝు, సుకీరత భావ హీనా ।
లోభ తరంగ మోహ భయోకాలా, మీన భయో మన లీనా ।

ఓ ఈశ్వరా! అపారమైనది భవసాగరం. నాది ఇనుప నావ. రాళ్లరప్పలు యిందున్న బరువు. నాలో ఇనుమంతైనా సద్భావాలు లేవు. మోహ లోభాల తరంగాలు దీన్ని మింగజూస్తున్నవి. వీటన్నిటి నడుమ చేపలా కొట్టుకులాడుతున్నది నా హృదయం అని పరితపిస్తున్నాడు రవిదాసు.

29. కృష్ణ కరీమ్ రామ హరి రాఘవ, జబ లగి ఏక న పే ।
వేద కతేవ కురాన్ పురానన, సహజ ఏక కరి బేషా ।

కృష్ణుడు, కరీం, రాముడు, హరి, రాఘవుడు - వీరందరినీ ఏకదృష్టితో చూడనంతవరకు ఎన్ని వేదాలు, ఎన్ని పురాణాలు పఠించినా, ఎన్ని కురానులు వల్లించినా ప్రయోజనం శూన్యమని భక్త రవిదాసు హెచ్చరిస్తున్నాడు.

30. జబ లగి నదీ న సముద సమ్మావై,
తబ లగి బడే హంకారా ।
జబ మన మిల్యా రామ సాగరసూ,
తబ యహ మిటీ పుకారా ।

సాగర సంగమం అయ్యేంతవరకు నది ఉరకలతో వడిగా జరజర ప్రవహిస్తూంటుంది. భక్త్యావేశంకూడ అలాగే వుండాలి. కడలిని చేరిన నది వడితగ్గి మధుర రవళితో నింపాదిగా సాగినట్లే రామసాగరం చేరిన (దైవ దర్శనం అయిన) మనస్సు నిమ్మళిస్తుంది.

31. హరి సా హీరా ఛాండికర కరై ఆన్ కీ ఆస్ ।
తే నర జమ పుర జాహింగే సత్ భాషై రైదాస్ ।

వజ్రంలా ప్రకాశించే హరి (పరంజ్యోతి) ని వదలి, క్షుద్రమైన అహాన్ని ఆశ్రయించేవాడు యమపురికి పోవడం తథ్యమంటాడు రవిదాసు.

32. మై పఢ్యో రామ కో నామ ఔర్ దూజా న జానై ।
రర్రా మమ్మా ఛాడి తీసరో అంక న జా నౌ ।

రామ నామం తప్ప మరో నామ మెరుగను రకారం, మకారం తప్ప మూడో అక్షరం ఎరుగనని చెప్పుకుంటున్నాడు మహాత్ముడు రవిదాసు.

33. 'రవిదాస్' ఇక్ హీ నూర్ తే, జిమి ఉపజ్యో సంసార్ ।
ఊంచ్ నీచ్ కిహ విధి భయే, బాహ్మన అరు చమార్ ।

ఒకే పరంజ్యోతి నుండి ఈ చరాచర ప్రపంచం జనించినప్పుడు ఇందు ఒకరు గొప్ప, మరొకరు కొద్ది - కొందరు బ్రాహ్మణులు, మరికొందరు చమార్లు - అనే భేదాలు ఎలా వచ్చాయని ప్రశ్నిస్తున్నాడు రవిదాసు.

34. కామ క్రోధ మద లోభ తజి, జఉ కరమ ధరమ కర కార్ ।
సోఈ బాహ్మన జాన హి, కహి 'రవిదాస్' విచార్ ॥

కామ క్రోధ లోభ మద మాత్సర్యాలు త్యజించి ఎవరైతే ధర్మ కర్మలాచరిస్తారో వారే బ్రాహ్మణులని ఎరుగమంటాడు రవిదాసు.

35. ఆది మధ్య జాసొన ఏక రస, ఏక తార్ హై భాఈ ।
థావర జంగమ కీట పతంగా, పూరి రహై హరి రాఈ ॥
సర్వేస్వర సర్వంగీ సరబగతి, కరతా హరతా సోఈ ।
ద్రిష్టి అద్రిష్టి గేయ అరు గ్యాతా, ఏక మేక హై రవిదాసా ॥

జననమరణాలు లేనిది ఆ పరాశక్తి, స్థావర జంగమము అన్నింటిలోనూ, పిపీలికాది సకల ప్రాణులలోను నిండివుండేది, వాటి గతి విధుల నెరుగునదీ, వాటికి కారణమైనదీ అదేశక్తి. చూచునది, చూడబడునది; తెలుసుకొనునది, తెలుసుకోబడేది; సర్వగతికారకం, సర్వాంగ భూషితం, సర్వేశ్వరుడయినది; కర్త అదీ, హర్తా అదే - అంతా ఒకే ఒక శక్తి, అదే పరాశక్తి, ఏకేశ్వర శక్తి అని తెలుసుకోమంటాడు రవిదాసు.

36. జబ జబ ఫైలెఇ జగత మహి కూడ పాప అంధియార్ ।
తబ తబ రాఖై హద్ద దేహో రవిదాస ఇక రామ హమార్ ॥

ఎప్పుడెప్పుడైతే ఈ లోకంలో కుళ్లు, పాపాలు, అజ్ఞానం, అత్యాచారాల అంధకారం వ్యాపించి ధర్మహాని కలుగుతుందో, అప్పుడప్పుడల్లా ఏకేశ్వరుడు (రాముడు) ధర్మసంరక్షణకోసం పరిమిత మానవదేహం ధరించి అవతరిస్తూంటాడని రవిదాసు అంటాడు.

* * *

# సహాయక గ్రంథాలు


1. గురు రవిదాస దర్శన్ – ఆచార్య పృథ్వీసింగ్ ఆజాద్

2. గురు రవిదాసు – ఆచార్య పృథ్వీసింగ్ ఆజాద్

3. సంత్ రవిదాస్ – ఆయన కావ్యాలు – స్వామి రామానంద శాస్త్రి, శ్రీ వీరేంద్ర పాండే

4. సంత్ రవిదాసు వచన సుధ – డా॥ సరనదాస్ భమోత్

5. ఉత్తర భారత సంత్ పరంపర – పండిత శ్రీ పరశురామ చతుర్వేది

6. సంత్ రవిదాసు పద సంగ్రహం – శ్రీ రామ్‌జీదాసు కల్యాణ


ఇంకా అనేక పత్రాలు, పత్రికలు.

* * *



# చోళ్ల విష్ణు

జననం : 1914లో, పశ్చిమ గోదావరి జిల్లా,కొవ్వూరు తాలూకాలోని తాడిమళ్ల గ్రామ మాలపల్లిలో; ప్రాథమిక విద్య: చింతపల్లి దగ్గరి కాశిపాడు మిషన్ స్కూలులో, చింతపల్లి అగ్రహారీకులు సామవేదం రామశాస్త్రులవారి వద్ద సంస్కృతం చదువు; ఆనక 1924-28లో తణుకు జాతీయ విద్యాలయంలో విద్యాభ్యాసం; 1928 పిదప చాగల్లు ఆనంద నికేతన్ ఆశ్రమంలో గురుదేవులు శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడిగారి వద్ద చదువు, రాజమండ్రి వీరేశలింగం హైస్కూలు పరీక్షలు (ఇంగ్లీషు లేకుండా) పూర్తిసేత; పి.ఆర్. కాలేజీ విద్యార్థులు నడిపిన సోదర సమితి ద్వారా శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, వి.ఆర్. నార్ల ప్రభృతులతో పరిచయం; 1929లో ఆనంద నికేతన్ ఆశ్రమంలో మహాత్మగాంధీ దర్శన భాగ్యం; 1930 ఉప్పు సత్యాగ్రహంలో రెండేళ్లు ఖైదు శిక్ష గాంధీ-ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా విడుదల; ఉంగుటూరు కేంద్రంగా వీర భారతి రహస్య పత్రిక నిర్వహణలో భాగం; 1932 జూన్ 25న భీమవరం ఆర్.డి.ఓ. ఆఫీసుపై జాతీయ జెండా ఎగురవేసిన ఫలితంగా 3 నెలలు ఖైదు; ఆనక మూడేళ్లు సుందరయ్యగారితో సహవాసం; అనంతరం హైదరాబాదు, రావి నారాయణరెడ్డిగారి వద్దకు; నైజాం వ్యతిరేక ప్రచారం- నిర్మాణాత్మక కార్యకలాపాలు; 1935 సిరిసిల్ల (4వ) ఆంధ్రమహాసభలో యోగాసనాల ప్రదర్శన-రజతపతక సాధన; 1939లో ఢిల్లీ, ఠక్కర్ బాపా వద్దకు నిర్మాణాత్మక కార్యక్రమాల్లో శిక్షణార్థం; నాటినుండి నేటిదాకా దేశరాజధానిలోనే నివాసం. 1987 మే, మైనపురి (U.P.) లో జరిగిన 130వ భారత స్వాతంత్ర్యోద్యమ మహాసభలో స్వాతంత్ర్య సమరయోధునిగా సన్మానం; 1987 సెప్టెంబరు 14 - కొత్త ఢిల్లీ పార్లమెంటు హాలులో జరిగిన రాష్ట్ర భాషా ఉత్సవంలో జస్టిస్ శ్రీ రంగనాథమిశ్రాచే రాష్ట్ర భాషాసేవక్‌గా సన్మానం.

Printed and Published by *Ravi Sasi Enterprises,*
6-3-1243/156, D. Sanjeevaiah Nagar, Opp. Raj Bhavan, Hyderabad-500 482.